
వినాయక చవితి ప్రత్యేక సంచిక
ఆంధ్ర సచిత్ర వార పత్రిక
41, సెప్టెంబర్, '86
రు. 3/-
పూర్తి నవలిక-
వెర్రితల్లి-కడుపుతీపి
శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి
kasi

## ఇదిగో వచ్చేసింది!

ఇదిగో అబ్బాయ్ -
'ఉదయం వీక్లీ'తో బాటు
మరో పుస్తకం ఏదో వచ్చిందే..?

అది మీ కోసమే
ఉదయం వీక్లీ ఇచ్చే
బోనస్ నవల!

# ఉదయం
# గ్రంథాలయం పథకంలో

ఉదయం వీక్లీ మంచి మంచి కథలు
కవితలు, సీరియల్స్,కార్టూన్స్‌వంటి ఎన్నో
ఆకర్షణలతోబాటు ఒక అత్యంత ప్రత్యేక
ఆకర్షణ 'బోనస్‌నవల'తో ఇక మీ
ముంగిట్లోకి వస్తోంది.
వారానికి 1 నవల! నెలకు 4 నవలలు!
ఏడాదికి 52 నవలలు!!
మీ ఇంట్లో మీకో స్వంత గ్రంథాలయం!!!




మీరు చెల్లించే వెలకన్నా పొందే విలువ మిన్న!

gdc/PAP/0886

# మనలో మాట

మా పాఠకులు, రచయితలు, రచయిత్రులు, ఏజంట్లు, ప్రకటనకర్త లందరికీ వినాయకచవితి సందర్భంగా మా శుభాకాంక్షలు అంద చేస్తున్నాము.

ఈ వినాయక చవితికి ఆంధ్రసచిత్ర వారపత్రిక 78 ఏళ్ళు పూర్తి చేసుకుని 79వ సంవత్సరంలో అడుగు పెడుతున్నది. ఆ సందర్భంగా ఈ ప్రత్యేక సంచికని ఎక్కువ పేజీలతో, మరింత ఆకర్షణీయంగా వెలువరించటానికి చేసిన మా ప్రయత్నానికి పాఠకుల ఆదరాభిమానాలు లభిస్తాయని ఆశిస్తున్నాము.

ఈ ప్రత్యేక సంచికలో మామూలు శీర్షికలతో పాటు అదనపు ఆకర్షణలుగా ప్రఖ్యాత రచయిత్రి శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి గారి పూర్తి నవలిక "వెర్రితల్లి – కడుపుతీపి", సుప్రసిద్ధ రచయితల కథలు, ప్రత్యేకంగా సినీ నటీనటులు సుజాత, శ్రీ లక్ష్మి, రాళ్ళపల్లి అందించిన హాస్య రచనలు, రాజకీయాలలో నించి సినిమారంగంలో కి నటుడిగా ప్రవేశించిన చల్లా రామకృష్ణారెడ్డి పరిచయం, ప్రత్యేక కార్టూన్‌లు, గేయాలు, వ్యాసాలు చోటు చేసుకున్నాయి.

బొమ్మల సీరియల్ "సీక్రెట్ ఏజంట్ విక్రమ్" మరో సరి కొత్త సాహసగాథని కూడా ఈ సంచికలో నే ప్రారంభిస్తున్నాము.

ఇటీవల మేము నిర్వహించిన "నాకు నచ్చిన వ్యక్తి" వ్యాస రచన పోటీకి చాలా పెద్ద సంఖ్యలో వ్యాసాలు వచ్చాయి. ఎంతో ఉత్సాహంతో ఈ పోటీలో పాల్గొన్న వారందరికీ మా కృతజ్ఞతలని తెలియ చేసుకుంటున్నాము. అసంఖ్యాకంగా అందిన వ్యాసాలని పరిశీలించి బహుమతికి అర్హమైన వాటిని ఎంపిక చేయటంలో కొంత ఆలస్యం అనివార్యం అయింది. సాధ్యమైనంత త్వరలో వాటి ఫలితాలని ప్రకటించ గలము.

ఇటీవల సంభవించిన గోదావరి వరదలు గతంలో ఎన్నడూ లేనంత బీభత్సాన్ని సృష్టించాయి. వందలాది గ్రామాలు వరద ముంపుకి గురై లక్షలాది ప్రజలు నిరాశ్రయులైనారు. ఎంతో ప్రాణ నష్టం, ఆస్తి నష్టం వాటిల్లింది. రైలు, రోడ్డు మార్గాలన్నీ బంద్ అయిపోయి ఎంతో మంది ఎన్నో విధాలుగా కష్టనష్టాలకి గురైనారు. వరద దెబ్బ తిన్న ప్రాంతాలని ప్రత్యక్షంగా చూసి జరిగిన నష్టాన్ని మదింపు చెయ్యటానికి తొమ్మిది మంది సభ్యులుగల కేంద్ర బృందం వచ్చి వెళ్ళింది. ప్రధాన మంత్రి రాజీవ్‌గాంధీ వరద దెబ్బ తిన్న ప్రాంతాలని సందర్శించి దీనిని జాతీయ విపత్తుగా పేర్కొన్నారు. బాధితులకి రాష్ట్ర ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వం సత్వర సహాయాన్ని అందించవలసిన అవసరం ఎంతైనా ఉంది. దానికి తోడు ప్రజాహిత సంస్థల, వితరణశీలురైన వ్యక్తుల సహాయ సహకారాలు కూడా వారికి అందజేస్తే మరికొంత ఉపశమనం లభిస్తుంది. ఈ జల ప్రళయంలో అన్ని విధాలుగా కష్ట నష్టాలకి గురి అయిన వారికి ఇతరుల సహకారం, సహాయ సానుభూతుల అవసరం ఎంతైనా ఉన్నది. □



ఆంధ్రసచిత్రవారపత్రిక
వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)
5-11 సెప్టెంబర్, 1986
శ్రీ అక్షయ నామ సం. భాద్రపద శు. పాడ్యమి
సంపుటము 79 : సంచిక 1
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
విడి ప్రతి వెల రు. 3-00
ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'నృత్య గణపతి'
(చిత్రం : ఎస్. కో విశ్వేశ్వరరావు)

కళలు జీవితానికి అలంకారాలే కాని, మమతలలో జీవించటం గొప్పకళ!

మురళీమోహన్
సమర్పించు
శ్రీ జయభేరి ఆర్ట్ ప్రొడక్షన్స్

క్రాంతికుమార్

# శ్రావణ మేఘాలు

మాగంటి వెంకటేశ్వరరావు
కిషోర్

చక్రవర్తి·గణేష్ పాత్రో·కె.ఎస్.హరి·బి.కృష్ణంరాజు




Bhaskar

నైజాం: శ్రీనివాసా ఫిలింస్;
సీడెడ్: వి.యం.సి;

# గజాననుడు




 చిత్రకారుడు : దేవుదీక్షితులు 

విశ్వ సృష్టి, మూలశక్తి అయిన ప్రకృతి యొక్క కంపన ద్వారా మొదలవుతుంది ఆ విశ్వానికి ఉన్న శబ్ద ప్రతీక "ఓం."

"ఓంకార"నాదం ఉత్పన్నమయి ఆ నాదం క్రమంగా మాయా వికార రూపాన్ని సంతరించుకుని గజానన రూపంగా భాసిల్లింది.

పుట్టిన పసి బిడ్డ ఏడ్పులో వినిపిస్తుంది ప్రణవనాదం. వీచే గాలుల్లో, ఊగే పూవుల్లో ఊయల లూగుతుంది ఓంకార శబ్దం. కార్మికుని కూనిరాగం మొదలు అపర సంగీత సుధా మాధురి-లహరి వరకు సర్వత్ర స్ఫురించేది ఓంకారమే. మంత్రంలోను, యంత్రంలోను సమస్త దృశ్య ప్రపంచంలో, భూత భవిష్యత్ వర్తమానాలలో, ప్రత్యణువులోనూ ప్రస్ఫుటమయ్యేది విశ్వజనీనమైన సర్వ సమగ్రమైన ఓంకారమే.

అ, ఉ, మ అన్న మూడు అంశములతో ప్రకటితమైన ఓంకారమే గణేశ తత్వం. మానవునికి గల మూడు అవస్థలలో జాగ్రదావస్థ అకారము, స్వప్నావస్థ ఉకారము, సుషుప్త్యావస్థ మకారము.

ఐహికము ఆధ్యాత్మికము అయిన జగద్విజ్ఞానమంతా గణేశుని అధీనమే.

మొదట శబ్దంగాను తర్వాత క్రమంగా జగత్తు-గాను పరిణమించిన మహత్తర వైజ్ఞానిక తత్వమే వినాయకుడు.

"సదసద్వ్యక్త మవ్యక్తం సర్వం హి గణనాయకః" సదసద్రూపమైన, వ్యక్తావ్యక్త స్వరూపమైన సమస్తమూ గణేశుని రూపమే. ప్రణవ స్వరూపమైన గజాననుని రూపము నుండి సత్వరజస్తమో గుణములు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, సమస్త లోకములూ ఆవిర్భవించాయి. దేశ కాలాతీతమై, త్రిగుణాతీతమై, అస్థిత్వము అనస్థిత్వము లేనిదై, అద్వైతమై, అవస్థాత్రయానికి సాక్షియైన నిర్గుణ పరబ్రహ్మ స్వరూపమే గణేశుడు. సమస్త విశ్వానికి ఆయనే నాయకుడు కాబట్టి వినాయకుడు అయినాడు.

నిరాకార పరబ్రహ్మమయిన ఆ దివ్యతత్వాన్ని త్రిమూర్తులు సహస్ర దివ్య సంవత్సరాలు అవిశ్రాంతంగా తపస్సు చేసి అన్వేషించారు. అప్పుడు కోటి సూర్యప్రభా భాసిత తేజముతో చంద్రబింబము వంటి ముఖము, సుందరమైన నాసిక, పద్మముల వంటి కన్నులు కలిగి, ఖడ్గఖేట ధనశ్శక్తులను ధరించిన నాల్గు చేతులతో, నానా నక్షత్ర యుక్తమగు అంబరమును పోలిన ఉత్తరీయముతో, ఏకదంతముతో, ఓంకార సంకేతమైన పెద్ద తొండముతోను, అంచు బ్రహ్మాండ సంకేతమగు విశ్వగోళముతోను వినాయకుడు వారికి దర్శన మిచ్చాడు. వారి వారి కర్తవ్యాలను బోధించాడు.

అట్టి మహత్తర తత్వమైన వినాయకుని భక్తులు వివిధ రూపాలుగా భావించుకుని పూజిస్తారు. వినాయక చతుర్థి గణేశునికి విశేషమైన పర్వదినం.

ఈ రోజు వినాయకుని ప్రతిమను మట్టితో చేసి, 21 రకాలైన పత్రులతో పూజించి ఉండ్రాళ్ళు నైవేద్యంగా పెడతారు.

21 పత్రాల అర్థం: పంచ భూతములు (5) పంచతన్మాత్రలు (5) పంచజ్ఞానేంద్రియాలు (5) పంచ కర్మేంద్రియాలు (5)మనస్సు (1) మొత్తం ఈ 21తో కూడిన సూక్ష్మ శరీరమును, వినాయకుని రూపములో ఉన్న పరమాత్మకు అర్పించటం.

ఇట్టి మహోన్నత సత్యాల రూపకల్పన అయిన విఘ్నేశ్వరుని సమిష్టితత్వాన్ని అర్థం చేసుకుని ఆ పవిత్ర అవగాహనలో వర్ణ వర్గబేధాలు, తర తమ బేధాలూ మరచి సర్వులూ పునీతులగుదురు గాక!

– పి. ఆదిలక్ష్మి

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

# మనం గమ్యాన్ని చేరుకోగలమా?

కాలం ఎంత వేగంగా గడచి పోతున్నదో గమనిస్తే ఆశ్చర్యం కలుగుతుంది. చిరకాలం దాశ్య శృంఖలాలతో బంధింపబడి ఉన్న భారత దేశం వాటి నుంచి విముక్తం అయిన తర్వాత అందుకోవలసిన గమ్యాన్ని మన పెద్దలు చెపుతూ ఉండటం నిన్న కాక మొన్న జరిగినట్లు అనిపిస్తున్నది. దాదాపు నాలుగు దశాబ్దాల కిందట కొత్త ఢిల్లీలోని అశోకాహాలు నుంచి దక్షిణాదిన ఉన్న పల్లె కారుల పూరిపాకల వరకూ దేశం అంతటా ఆ సంకెళ్ల మోత ప్రతిధ్వనిస్తూ ఉండేది. మొగలాయీలు మొదట మన దేశంలో అడుగు పెట్టటంతో మొదలైన ఆ మోత తర్వాత పోర్చుగీసు, డచ్చి, ఫ్రెంచి వాళ్ళు, చివరికి బ్రిటిషువారు మన దేశాన్ని వదలి పోయే వరకూ అలా వినిపిస్తూనే ఉన్నది. బ్రిటిష్ వారి నిష్క్రమణతో ఒక శకం ముగిసి మరో శకం ప్రారంభానికి నాంది పలికింది. అయితే ఆ ప్రారంభం వాస్తవమైనటువంటిది కాదని, గమ్యం ఇంకా చాలా దూరంలో ఉన్నదని చాలా మంది అభిప్రాయం.

భారతదేశం నిజంగానే వచ్చిన అవకాశాన్ని అందుకోలేక పోయిందా? ప్రతి ఒక్కరి పెదవులపై ఉన్నటువంటి ఈ ప్రశ్న అసహ్యకరమైనటువంటిదే, అంతే కాకుండా స్వాతంత్ర్యం ధనిక, పేద తారతమ్యం లేకుండా దేశంలో అందరికన్నీరు తుడిచి వేస్తుందని మహాత్మా గాంధి ఇచ్చిన హామి ఇంతవరకూ నెరవేర్చ బడలేదు. భారతీయులలో ప్రతి అయిదుగురిలో ఒకడు కటిక పేదవాడు. దేశంలో దాదాపు సగం మంది దారిద్ర్య రేఖకి దిగువనే ఉన్నారు. మిరెంత ప్రయత్నించినా దారిద్ర్యం అన్నది దాన్నంతట అది తొలగిపోదు.

మరో వైపు చూస్తే భారతీయ మేధావి ఎప్పుడూ నిరాశావాదే. పరిస్థితులు అంత దారుణంగా ఏమి లేవని తెలిసి కూడా అతనెప్పుడూ మనో వేదనలో మునిగి తేలుతూ ఉంటాడు. ఒక దేశ చరిత్రలో 40 సంవత్సరాలు అంత ఎక్కువేమి కాదు. ఒక వ్యక్తి జీవితంలో అది దాదాపు 8 ఏళ్లకి సమానం. దేశం అన్ని రకాలుగా ఇంత వరకూ సాధించినది తక్కువ ఏమి కాదు. మనది పేదదేశమే కానీ మిగతా వారిలా కాక కొద్దో గొప్పో స్వయం సమృద్ధి కలదేశం. అణు రియాక్టర్ల నుంచి జలాంతర్గాముల వరకూ, గుండు సూది మొదలు కార్బన్ కాగితం దాకా దాదాపు ప్రతిదీ మనం తయారు చేస్తున్నాము. మనం చేస్తున్న ఉత్పత్తి తగినంతగా లేదు. అయితే దానికి అర్థం మనం స్తబ్దంగా ఉన్నామని మాత్రం కాదు. తగినంత వేగంగా మనం అభివృద్ధిని సాధించలేక పోతున్నాము.

సాంఘికాభివృద్ధిలో, జీవన స్థాయిలలో తీవ్రమైన లోసుగులు ఉన్నాయి. ఈ కారణంగానే దేశాభివృద్ధి వ్యూహం ఏ దిశగా పోతున్నదన్న దానిమీద సందేహాలు కలుగుతున్నాయి. అదేవిధంగా వాటిని స్వీకరించే సమాజంలోని వర్గాల మధ్య ఉద్రిక్తతలు ఏర్పడుతున్నాయి. వాళ్ల ఖర్మానికి వాళ్లని వదిలి వేయబడినటువంటి వారిలోనే కాకుండా ఆలోచించ గలిగే తరగతులనబడే వారిలో కూడా ఈ అభివృద్ధి విధానం అనేది ధనికులని మరింత ధన వంతులుగా, పేదలని మరింత బీదవారిగా మార్చే విధంగా పెడత్రోవ పట్టిందనే భయం నానాటికి పెరిగి పోతున్నది. ఈ ఆర్థిక వ్యవస్థ, పరిపాలనా వ్యవస్థ తిరిగి మామూలు ప్రజాస్వామ్య పంథాకి రావటానికి గట్టి మార్పు రావాలన్నది ప్రస్తుతం వినిపిస్తున్నది. ఈ భావం కలగటానికి కారణం అత్యవసర పరిస్థితి, పెడదారి పట్టిన ప్రణాళికా విధానం వల్లనే అలా జరిగింది. చివరికి అది మార్చి 1977లో జరిగిన పెద్ద మార్పుకి, తద్వారా, దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పటినుంచి ఏలుతున్న ప్రభుత్వాన్ని కూలద్రోయటానికి అది దారి తీసింది.

పరిస్థితులు మళ్లీ అలాలేవు. అత్యవసర పరిస్థితి అన్నది ఒక రకమైన హింస, ప్రభుత్వపు తీవ్రవాదం వంటిది. భారత ప్రభుత్వం లేదా దానిని నడిపే ప్రతినిధులు స్వలాభాపేక్షతో కూడిన ఇష్టాయిష్టాలతో ఎంతకైనా సిద్ధ పడగలగటం దానికి నిదర్శనం. వారి పదవులు పదిలంగా ఉంచుకోటం కోసం రాజ్యాంగాన్ని కూడా లెక్క చేయరన్న దానికి అత్యవసర పరిస్థితి ఒక ఉదాహరణ. భారత ప్రభుత్వం స్వలాభాపేక్షతో కూడిన, వ్యక్తిగతమైన ఆసక్తులకి నిలయంగా మారింది– కొందరు ఒక కుటుంబాన్ని గురించి చెప్పవచ్చు– వారు రాజ్యాంగ పరిరక్షకులుగా, ప్రజాస్వామ్య రక్షకులుగా ఉండవలసినది పోయి స్వప్రయోజన కరమైన ఆసక్తులు గల వారైనారు. ప్రభుత్వం తన అధికారంతో దానిలో కొద్ది మందిని కాపాడటానికి అధికార దుర్వినియోగానికి సిద్ధమైంది. రాజ్యాంగాన్ని త్రోసిరాజని వేలాది మందిని జైళ్లలో పెట్టటానికి కూడా అది వెనుదీయలేదు. ఈ సరికొత్త వ్యవస్థలో ఏదైనా అందుబాటులోనే ఉంటుంది. దేశ సమైక్యత, దాని సరిహద్దులు, సంపద, బహుశః స్వాతంత్ర్యాన్ని కూడా వారి స్వప్రయోజనాలతో కూడిన ఆసక్తులకి భంగం కాకపోతే అతి సాధారణమైన విషయంగా వాళ్ళు భావిస్తారు.

ఒకప్పుడు రెండు రకాలైన భారతదేశమే ఉండేది. ధనవంతులది, పేదవారిది. అయితే పేదరికాన్ని, సంపదని కొలవవచ్చు. భారతీయులని సమతూకంలో ఉంచటానికి కొంత సంపదని అటు నుంచి ఇటు మారిస్తే సరిపోతుంది. కానీ ఇప్పుడు మూడు రకాలు ఉన్నాయి. ధనవంతులు, పేదవారు మాత్రమే కాక నిజాయితీలోపించిన ఒకరకం రాజకీయ వర్గం ఒకటి ఆ రెండిటి మధ్యా చోటు చేసుకున్నది. అది ధనవంతులని పేదవారిమీదకీ, పేదవారిని ధనవంతుల పైకీ ఉసిగొలుపుతున్నది. అధికారంలో కొనసాగుతూ ఉండటానికే ఆ వర్గం అలా చేస్తున్నది. స్వప్రయోజనంతో కూడిన ఒక ప్రత్యేకమైన ఆసక్తి పేదవారిపై ఆ వర్గానికి ఉన్నది. వర్గ రాజకీయాల పట్ల కూడా దానికి అలాంటి ఆసక్తే ఉన్నది. దేశాన్ని విడదీసేది ఏదైనా దానిపై అలాంటి ఆసక్తే ఉన్నది. సిక్కులని హిందువులకి వ్యతిరేకంగా, ముస్లిమ్‌లని హిందువులకి వ్యతిరేకంగా, పట్నాలని పల్లెలనుంచి విడదీసే విషయాల మీదా వారికి అలాంటి ఆసక్తి ఉన్నది. ప్రజలలో ఐకమత్యాన్ని పెంచే వాటి కన్నా వారిని విడదీసే పద్ధతులపై ఆ వర్గానికి ఆసక్తి ఉన్నది. జర్మన్లు వాళ్లలో వాళ్లు వేరుగా ఉండేలా చేయటానికి నాజీలు చూపించినటువంటి ఆసక్తి వంటిదే ఇది కూడా. దీనిని బట్టి మనం ఫాసిజం ప్రారంభానికి దగ్గరలో ఉన్నట్లు అనిపిస్తున్నది.

అన్ని దేశాలలోనూ వేర్పాటు ధోరణులు ఉన్నాయి. కానీ ప్రస్తుతం భారత దేశంలో ఉన్నంత బలంగా అవి మరెక్కడా లేవు. గతంలో కూడా అల్లర్లు జరిగాయి. కాని ఇప్పటిలా ఎంతో పకడ్బందీగా వాటిని నిర్వహించటం అన్నది ఆనాడు లేదు. ప్రతి రాష్ట్రంలోనూ తీవ్ర వాదులు ఉన్నారు కాని పంజాబ్‌లో లాగా వాళ్ళు సాయుధులు కారు. త్వరలో ఇదే పరిస్థితి కాశ్మీర్‌లో, ఇతర చోట్ల ఏర్పడవచ్చు. భింద్రన్ వాలె వంటి వాళ్ళు ఆకాశం నించి ఊడి పడలేదు. భారతదేశాన్ని పరిపాలించిన వారు కొందరు బాహాటంగా, ఎంతో జాగ్రత్తగా అటువంటి వారిని సృష్టించారు. ప్రభుత్వానికి ఉన్న అధికారాలని అలాంటి వాటి కోసం దుర్వినియోగం చేసారు. ప్రస్తుతం దేశంలో జరుగుతున్న ఎన్నో అరాచకాలకి బాధ్యత చాలా వరకూ ప్రభుత్వానిదీ, దానిని నడుపుతున్న వారిదీ. ఈ జాతివ్యతిరేక చర్యల పేరు చెప్పి భయపెట్టి ప్రభుత్వం మరిన్ని అధికారాలని పొందుతుంది. దానిని నడిపేవారు ఎప్పటికీ వాటని తమ స్వప్రయోజనాల కోసం ఉపయోగించుకుంటూనే ఉంటారు. ఈ చెడుని అరికట్టక పోతే ఇక ఎప్పటికీ మనం గమ్యాన్ని చేరుకోలేము. □

పూర్తి నవలిక

# వెర్రితల్లి - కడుపుతీపి

ఇల్లిందల సరస్వతీదేవి

జీపులో పోతున్న నలుగురు ఉద్యోగులు హఠాత్తుగా మర్రి చెట్టు దగ్గర ఆగారు.

విస్తరించిన కొమ్మలతో ఆ వీధిని చాలా భాగం ఆక్రమించుకుని, తన నీడతో బాటసారులను సేదదీర్చే ఆ మర్రి చెట్టు కింద కూర్చుని, ఒకామె వడలు చేస్తున్నది.

"పెద్దమ్మా. మేము నలుగురం వచ్చాం. మాకు వేడి వేడి వడలు పెట్టు" అన్నాడు వారిలో ఒకరు.

"రెండు నిమిషాలాగండి సామీ". అంటూ బూర్లె మూకుట్లో వేగుతున్న మసాలా వడలను చూస్తూ – బాదమాకుల బుట్ట దగ్గరకు లాక్కుని తడిబట్టతో తుడిచి, మూడేసి వడల వంతున నాలుగాకుల్లోనూ పెట్టి అందించింది. వాళ్ళు నిలబడే తింటూ మాట్లాడుకుంటున్నారు.

ఆమె మళ్ళీ ఒకసారి ఇరవై వడలను మూకుట్లోవేసి గాజు గ్లాసులతో బిందెలో నుంచి మంచినీళ్ళు ముంచి యిచ్చింది.

"మా నలుగురికీ మరో రెండేసి వెయ్యి".

వేయించుకుని తింటూ "చూడమ్మా. నీవి రోడ్డుమీద పొయ్యి పెట్టుకున్నావేం? గాలికి ఆరిపోదూ?" అన్నాడొకాయన.

"బాబూ పదేళ్ల నుంచి పొయ్యి ఆరకుండా మండుతూనే ఉంది మరి గాలివస్తే ఈ ఇనపరేకు అడ్డం పెడతాను. ఈ వడలు మీకు నచ్చాయా?" అడిగింది.

"మహారుచిగా ఉన్నాయి. నీవు ఏమేసి చేస్తావో మరి. ఈ ఆకులు ఎక్కడ పారెయ్యమంటావు?"

"ఆ బుట్టలో పడెయ్యండి బాబూ". గజం దూరంలో ఉన్న బుట్ట చూపించింది

"నీ పేరేమిటో గాని- బిల్లెంత చెప్పు?" కోటువేసుకున్న ఆయన జేబులో నుంచి పర్సు తీశాడు

"సామి. పన్నెండణాల కొకవడ లెక్క చూసి యివ్వండి."

"పన్నెండణాలకొకటా?" తెల్లబోతూ అడిగాడు

"సామి సెనగపప్పు ధర ఎక్కువయింది. మసాలా, నూనె, కట్టెలూ, నా శ్రమ కలిపితే అది తక్కువే"

"అయినా అంత ధరా?"

"ఇచ్చెయ్యవోయి. పాపమామె వయసును చూసయినా వెంటనే బిల్లు యివ్వు. ఇదే నీకు ఎ

హోటల్లోనో అయితే ఇంత చౌకగా రాదు".

"అబ్బ, ఎంత రుచిగాఉన్నాయి? ఆ రుచి కోసం అయినా అంత వెల యివ్వవచ్చు"

పర్సు తెరచి డబ్బు లెక్క కట్టి బిల్లు చెల్లిస్తూ

"చూడమ్మా నీ పేరేమిటో గాని - రేపు మళ్ళీ ఇదే వేళకు వస్తాము. ఇప్పుడిచ్చినట్టే వేడి వేడిగా అందించు." అంటూ ఒక్కొక్కరే జీపు ఎక్కారు.

అలా ఆఫీసులు మూసే వేళల్లోనూ, ఒంటి గంటా



రెండూ గంటల మధ్యలోనూ, స్కూలు ఇంటర్వెల్‌లోనూ, మంగతాయారుకు ఊపి రాడకుండా ఉంటుంది. పొద్దున పదిగంటలకు మొదలుపెడితే సాయంత్రము ఆరు గంటలు దాటే వరకూ ఆమె అరచేతిలో తడి బట్ట వేసుకుని, రుబ్బిన పిండిని గిన్నెలో వేసుకుని, చిన్న చిన్న ఉండలు చేస్తూ, సన్నగా వత్తి చమురులో వేస్తూనే ఉంటుంది. ఉడికిన వడలను పేళ్ల బుట్టలో వేసి బట్ట కప్పుతూనే ఉంటుంది.

ఆ చుట్టు పక్కల ఇళ్ల వాళ్లకు ఇంట్లో టిఫిన్ చేసుకోనినాడు మంగతాయారు వడలను తెప్పించుకుంటారు. ఇంటికి తీసుకుపోయే వాళ్లకేం బాధలేదు. కాని - దారినపోయే వాళ్లు కొందరు 'కూర్చోటాని కేమయినా ఉంటే బాగుంటుం దనుకుంటారు.

మంగతాయారు సాయంకాలం ఆరు గంటలు కాగానే కట్టెలు ఊదేసి, పొయ్యి దులిపేసి, ఒక చిన్న గోనె సంచిలో వేస్తుంది. గిన్నెలు ఒక దానిలో ఒకటి పెట్టుకుని, బాదమాకులు బుట్టలో పెట్టుకుని, ఎంగిలాకుల బుట్ట ఖాళీ చేసి, తన సామాన్లతో డాక్టరు రమణయ్యగారి పెరట్లో ఉన్న రేకుల షెడ్డులోకి చేరుకుంటుంది. సామాను సర్దుకొని పెరట్లో ఉన్న బాదం చెట్టు కింద చాప వేసుకుని నడుం వాలుస్తుంది. అప్పుడామెకు నిద్రేం పడుతుంది? కాని అలా ఒక గంటసేపు విశ్రాంతి తీసుకుంటుంది.

సరిగ్గా ఎనిమిది గంటలయిన తరువాత పొద్దున వండిన అన్నం, కూర, పులుసూ ఉట్టి మీద నుంచి దింపి భోజనానికి కూర్చుంటుంది. భోజనం కాగానే చాపేసుకుని, దిండు మీద తలపెట్టి, దుప్పటి కప్పుకొని గోవిందనామాలు చదువుతూ నిద్రలోకి జారుకుంటుంది.

"మంగమ్మా. నేను బ్యాంకుకు వెళ్తున్నాను. నీకేమయినా పనుంటే చెప్పు?" అడిగాడు డాక్టరు.

"డాక్టరు బాబూ? డబ్బా నిండింది. లెక్క పెట్టి



బ్యాంకిలో జమ చెయించండి" డబ్బా తెచ్చి ఆయన చేతికిచ్చింది

డబ్బెంత ఉందో ఆయన లెక్కబెట్టటమే గాని అమె అటు చూడనైనాచూడదు. అయనఆమెపాలిటి దైవమనుకుంటుంది. ఉద్యోగం చేస్తూ డబ్బు బాగా సంపాదించుకొంటున్న కొడుకు ఉండి కూడా అనాధగా ఆ మర్రి చెట్టు కింద ఉపవాసాలు చేస్తూ ముడుచుకొని పడుకొంటున్న మంగతాయారును పిలిపించి, భార్యకు చెప్పి, రేకుల షెడ్డు ఖాళీ చేయించి, ఆమెకు తలదాచుకొనే సదుపాయ మేర్పరిచాడు. వడలయినా చేసుకుని బ్రతకమని సలహా యిచ్చాడు ఆరు నెలలకొకసారి సెనగపప్పు, మసాలా దినుసులు తెప్పించి యిచ్చేవాడు మొదట. వడలు చెట్టు కింద చేసుకోమని సలహా చెప్పింది కూడా అయనే. అందుకే మొదట వాయ తియగానే డాక్టరు బాబు యింటికి రెండు ప్లేట్లు ఇచ్చి వస్తుంది.

"మంగమ్మా, రోజు రోజూ నీ వడలకు రుచి మించిపోతున్నది నువు ఒక హోటలు పెట్టవచ్చు" అని ప్రోత్సహకరంగ అనేవాడు డాక్టరు

"ఇది ఇట్లా సాగిపోతే చాలు బాబూ! మీరు చల్లగా ఉంటి నన్నొక కంట కనిపెడుతుంటే అదే తృప్తి" అంటుంది మంగమ్మ.

రాత్రి పడుకోబోయే ముందు మంగమ్మకు గత స్మృతులు మనసులో మెదులుతూ ఉంటాయి తన పెనిమిటి శీనయ్య బియ్యం పప్పు ఉప్పూ అమ్మే సెటు దగ్గర నౌకరు. సెటు ఇచ్చే జీతం నూరు రూపాయలతో తృప్తిగా జీవిస్తూ ఉండేవారు శీనయ్య నిజాయితీకి సెటు సంవత్సరానికి ఒక జత బట్టలు భార్యాభర్తలకు ఇచ్చేవాడు. కొడుకు మరి నాలుగు నెలలకు పుడతాడనగా శీనయ్య నాలుగు రోజుల జ్వరంతో చనిపోయాడు. ఆ సమయంలో తనకు దిక్కెవరు? తన వాళ్లెవరూ లేరు. ఆయన వాళ్ళు - ఉన్న ఇల్లొకటి వాళ్లే పంచుకొని నాలుగు వందల అప్పు చూపించారు. ఆ పది రోజులయినా ఆదరించి నాలుగు మెతుకులు పెట్టేవారు లేక

# వెర్రితల్లి - కడుపు తీపి

కుమిలిపోయింది

శీనయ్య లౌక్యం మెరుగని మంచివాడు కనుకనే అతడికి మొదటి నుంచి కష్టాలు ఎదురయ్యేవని మంగతాయారుకి నమ్మకము కాని అతడి మంచితనమే ఆమెను ఈనాటికి కాపాడుతున్నదన్న విశ్వాసము ప్రబలంగా ఉన్నదామెకు. సెటు కుటుంబమే ఆమెకు దిక్కయింది. కాన్పు వచ్చినప్పుడు ఇరుగు పొరుగులు తోడు నిడలయ్యారు. అందరూ ఇచ్చిన సలహా ప్రకారం, యాత్రాస్థలమైన తిరుపతికి వెళ్లి జీవనోపాధి వెదుక్కోవటానికి నాలుగు నెలల బిడ్డని ఒడిన గట్టుకుని బట్టల మూటనెత్తిన పెట్టుకుని వచ్చింది.

కొత్త చోట ఉండటానికి చోటు లేదు. తినటానికి తిండి లేదు. అది ఆమెకు జీవన సమస్య అదొక పోరాటము ఈ పోరాటంలో తిని తినక బిడ్డకు పాలిచ్చి పెంచలేక - చిత్రవధ ననుభవించింది. బస్టాపు దగ్గర చెయ్యి చాపితే రూపాయ డబ్బులయినా దొరికేవి కావు. హోటళ్ల ముందర నిలబడితే వాళ్ళు విదిలించిన పాచి వంటకాలతో కడుపు నింపుకొలేకపోయేది. కళ్లల్లో ప్రాణాలున్న పిల్లవాడికి వర్షంలో తడిసినందువల్ల జ్వరం వచ్చింది వాడే తన ప్రాణమనుకుని దినాలు గడుపుతున్న మంగమ్మకు చీకట్లు కమ్మి నట్లయింది.

అప్పుడు వారిని వీరిని అడిగి పేరు తెలుసుకుని డాక్టరు బాబు యింటికి వచ్చి కాళ్ల మీద పడ్డది. ఆయన ఆమె పరిస్థితికి జాలిపడి నాలుగు పూటలు మందిచ్చాడు. తన యింట్లో నుంచి అన్నం పెట్టించాడామెకు.

ఆ దైవము చూపిన దారి ఒక స్కూలు ముందర పలకలూ, బలపాలు అమ్మమని. పది రూపాయలు పెట్టుబడి పెట్టి, పలక ఎంతకమ్మాలో బలపాలెట్లా ఇవ్వాలో లెక్క చెప్పి ఇచ్చాడు అట్లా వెనుసుమ

రోజుకు రెండు రూపాయలు మిగిలేవి దానితో ఒక ఇంటి పక్క సందులో గంజి కాచుకుని తాగేవారు. కొన్నాళ్లకు పలకల బేరంతో పాటు వేరుసెనక్కాయలు వేయించి, బడిపిల్లలకు అమ్మటం మొదలుపెట్టింది. దాంతో ఆ ఇద్దరి పరిస్థితి కొంత మెరుగైంది. పిల్లాడికి ఐదో ఏడు కూడా వచ్చింది.

'అన్నిటికి డాక్టరు బాబే గతి' అనుకుంటూ ఆయన దగ్గరికి వెళ్లింది ఆయన పిల్లవాడికి రెండు జతల బట్టలకు డబ్బిచ్చి స్కూల్లో చేర్పించాడు పనిలో మరో మెట్టు ఎక్కమని డాక్టరు బాబు సత్రంలో వెనక వరండాలో కాస్త చోటు ఇప్పించాడు. అప్పటి నుంచి ఆమె జంతికలు చిన్న చిన్న చుట్టలుగా చేసి ఒక గంపలో పలకలూ, వేరుసెనక్కాయలూ జంతికల చుట్టలూ అమ్మేది పిల్లవాడికి ఫీజు లేదు తల్లి యిచ్చిన పలకా బలపంతో చదువు ప్రారంభించాడు. అతడికి తన తండ్రి పేరు వెంకటసామి అని పెట్టింది

క్రమంగా క్లాసు తరువాత క్లాసులోకి వచ్చినప్పుడు పాత పుస్తకాలు కొని యిచ్చేది వెంకటసామి చురుకైనవాడు. శ్రద్ధగా బుడ్డి దీపం దగ్గరా వీధి లైటు కిందా చదువుకునేవాడు. నెల నెలకూ డాక్టరు బాబుకు తన చదువు సంగతి చెప్పేవాడు ఆయన తన కొడుకులకి చాలని ప్యాంట్లూ, బుష్షర్టులూ ఇచ్చేవాడు. అలా పాసయ్యాడు వెంకటసామి. స్టేటు బ్యాంకలో అలాగే డాక్టరు బాబు మాట మీద ఉద్యోగం కూడా వచ్చింది. అప్పుడు రెండు గదుల ఇల్లొకటి తీసుకుని డాక్టరు బాబు ఇంటి దగ్గర పెట్టింది కాపరం మంగమ్మ.పగటి పూట తీరిక వేళల్లో వెళ్లి వాళ్ల యింట్లో ఏమయినా పనులుంటే చక్కపెట్టేది టిఫిన్లు కూడా చేసిపెట్టేది ఆమె-యిచ్చిన ప్లేటు టిఫిన్ పిల్లవాడు రాగానే పెట్టేది అట్లా రెండేళ్ళు గడిచింది కొడుక్కు ఇరవై రెండేళ్ళు వస్తున్నాయని పెళ్లి మాట మనసులో తిరగలాడటం మొదలుపెట్టి, డాక్టరు బాబు చెవిన వేసింది

"ఇలా రెండేళ్ళు గడవనీ. కాస్త డబ్బు కూడా దాచు పెళ్లి ఖర్చులకు కావద్దూ" అన్నాడు ఆయన

వెంకటసామికి వచ్చే జీతంలో మంచి మంచి బట్టలు కుట్టించుకో మనేది. మంచి బట్టలు వేసుకుని ఉద్యోగానికి వెళ్లే కొడుకుని కంటి నిండా చూసుకొని మురిసిపోయేది మంగమ్మ

అలా ఎంత కాలం గడిచిందని?

పట్టుమని మూడేండ్లయినా గడవలేదు. వెంటసామికి బదిలీ అయింది.

"అమ్మా ఆఊరు వెళ్లి ఇల్లు తీసుకున్న తరువాత నిన్ను తీసుకువెళతానమ్మా ముందే వస్తే ఇల్లు వెంటనే దొరక్కపోతే నీవుఇబ్బందిపడ్తావు" అన్నాడు.

నాకు ఇబ్బందేమిటి? చెట్టు కింద బతికినదానికి? ఎక్కడో నాలుగు రోజులు సర్దుకుందాము ఇల్లు దొరికేవరకు"

'కాదులే అమ్మా నీవు చెప్పేదంతా ఇదివరకూ



మాట. ఇప్పుడట్లా చేస్తే బావుండదు నేను వెళ్ళి ఉత్తరం రాస్తాను". అని వెళ్ళాడు. వెళ్ళే ముందు డాక్టరు బాబు దగ్గర దీవెనలు తీసుకుని వెళ్ళాడు. వెళ్ళగానే చేరినట్లు ఉత్తరం రాశాడు.

నెల రోజుల తరువాత డాక్టరు బాబు అడిగాడు కొడుకు దగ్గర్నుంచి ఉత్తరం వచ్చిందా అని.

"లేదు బాబూ. కొత్త చోట ఏం చిక్కుల్లో ఉన్నాడో ఏమో?"

"మంగమ్మా. నీవు ఉంటున్న ఇల్లు ఖాళీ చేసి మా పెరట్లో ఉన్న రేకుల షెడ్డులోకి రా. కొడుకు దగ్గర్నించి ఉత్తరం రాగానే వెళ్ళిపోదువు గాని" అన్నాడు.

ఆయన చెప్పినట్లే ఇల్లు ఖాళీ చేసింది మంగమ్మ కాని ... బట్టల మూట తలకింద పెట్టుకొని చాపమీద ఆ మర్రి చెట్టు నీడన పడుకొనేది. ఒక పూట వంట చేసుకుని రెండు పూటలూ తినేది. ఉత్తరం కోసం ఎదురు తెన్నులు చూసి కళ్ళు కాయలు కాశాయి.

తన కేసుల తొందరలో ఉన్న డాక్టరు బాబు ఒకనాడు మంగమ్మను పిలిచి "నీవు చెట్టు కింద ఉంటున్నావా? నాకెవరో చెప్పారు. గిద్దెడు బియ్యం వండుకొని రెండు పూటలా తింటున్నావని. మా షెడ్‌లో వచ్చి ఉండు" అని మందలించాడు.

ఆనాడు అడుగుపెట్టింది డాక్టరు బాబు యింట్లో. చెట్టు నీడన కూర్చుని వండితే వడలు దారినపోయే వాళ్ళు కొంటారని అక్కడ వడలుచేయటం మొదలుపెట్టింది.

రోజులు గడుస్తున్నాయి. వడల బేరం బాగా సాగుతోంది. లోకం పోకడ తెలిసిన డాక్టరు బాబు వెంకటసామి మాట ఇప్పుడెత్తడంలేదు.

ఆ రోజు మంగమ్మకు ఊపిరాడడంలేదు. జన సందడి ఎక్కువయింది. ఆమె నానబెట్టిన నాలుగు శేర్ల పప్పు చాలలేదు. వడలు చేసే వ్యవధిలేదు. జనం బాదమాకులు చేతిలో పట్టుకుని క్యూలో నిలబడ్డారు. ఒక్కొక్కరినీ పంపేంచేసరికి సాయంకాలం నాలుగయింది.

ఆ ఒక్క రోజె డబ్బా నిండింది.

"డాక్టరు బాబూ, వచ్చిన వాళ్ళు కూర్చోటానికి మర్రిచెట్టు చుట్టూ అరుగులాంటిది కట్టిస్తే? వాళ్ళు నిలబడలేక నన్ను తొందర చేస్తున్నారు. వీలవుతుందా బాబూ?" చేతులు నలుపుకుంటూ అడిగింది.

రెండు రోజుల్లో గట్టు తయారయింది దాని మీద కూర్చుని రెండు నిమిషాలు ఆలస్యమయినా జనం వచ్చి పోతున్నారు డబ్బాలు నిండుతున్నాయి. డాక్టరు బాబు బ్యాంకి నింపుతున్నాడు.

"మంగమ్మా. నీ చేతికిందికి ఒక మనిషిని పెట్టుకో నీ పని సులభమవుతుంది? ఎంతకాలం ఒంటి రెక్కతో పని చేస్తావు?" అంటాడు డాక్టరు బాబు.

మంగమ్మకు అది ఎంతో కాలమనిపించదు. "బాబూ! ఇంకెంత కాలంముంటాను ఇక్కడ? అబ్బాయి దగ్గర్నుంచి ఉత్తర మొచ్చేదాకానేగా?" అంటుంది.

# వెర్రితల్లి - కడుపు తీపి

"అవునవును. ఇంకెంత కాలం?" అంటాడాయన.

డాక్టరు వెంకటసామిని గురించి ఆరాలు తీస్తూనే ఉన్నాడు. అతనిప్పుడు విశాఖపట్నం జిల్లాలో ఉన్నాడనీ, తన తోటి ఉద్యోగం చేసే అమ్మాయిని పెళ్ళి చేసుకుని ఇద్దరు బిడ్డల తండ్రి అయ్యాడనీ తెలిసింది. అందుకే మునుపటికంటె ఆమెను ఉత్సాహపరుస్తూ మాట్లాడుతున్నాడు.

ఒకనాడు - "మంగమ్మా. మన యింటికి దగ్గరగా బ్యాంకి వచ్చిందమ్మా. ఇంక నీవెప్పుడుడబ్బా నిండితే అప్పుడే వెళ్ళచ్చు" అన్నాడు డాక్టరు.

"నాకు లెక్కలు తెలుస్తాయా బాబూ!"

"పోనీలే. నేనే వెళ్తానుః అంటాడాయన.

బ్యాంకి దగ్గరకొచ్చినప్పటి నుంచిఒక జవాను వచ్చి వడలుపొట్లం కట్టించుకు పోతాడు. అవి ఖర్చు కాగానే మళ్ళీ వస్తాడు. అప్పటికప్పుడు బిల్లు తీసుకువస్తాడు. ఇది రోజూ తప్పకుండా వచ్చే ఆదాయము. ఇదిగాక తనకు ఎప్పుడూ వచ్చేవాళ్ళు ఉండనే ఉన్నారు.

ఒకనాడు బ్యాంకి స్టాఫు జవాను లేడని విసుక్కుంటూ వాళ్ళే వచ్చారు. కొందరు ఆడవాళ్ళు విడిగా వచ్చారు. జంటలుగా వచ్చారు కొందరు. అందరికీ కావలసినవి ఆగమనకుండా అందించింది.

మంగమ్మ చెట్టు నీడన ఉన్నా. ఎండకు దేహచ్ఛాయ కమిలినట్లయింది. ముఖం కొద్దిగా ముడతలు పడ్డది. తైల సంస్కారం లేని తల వెంట్రుకలు చాలావరకు ఊడిపోయాయి. ఉన్న వెంట్రుకలు జడలు కట్టినట్లయ్యాయి. ఎప్పుడూ పొయ్యి సెగన ఉండడం వల్ల కనుదృష్టి మందగించినట్లయింది. వచ్చిన దెవరో చూడకుండానే ఆమె బాదమాకుతో వడలు పెట్టి ఇస్తుంది. డబ్బు చేతిలో వేసుకుని డబ్బాలో పడేస్తుంది.

వారం రోజులకుగాని జవాను రాలేదు. ఉద్యోగులే వస్తున్నారు

ఉన్నట్లుండి ఒకనాడు మ్యునిసిపాలిటి వాళ్ళు వచ్చి "ఏయ్ అమ్మి. రోడ్డు మీద పొయ్యి పెట్టి వ్యాపారం చేస్తున్నావా? దారిలో తియ్యి" అంటూ కర్రలతో నిలబడ్డారు.

"సామీ. నా పొయ్యి పక్కనే ఉందిగా? చెట్టు నీడ ఉందని పొయ్యి పెట్టాను సామీ. నేను ఎవరికి అడ్డంగా లేను కదా?" అంది.

"అసలు వీధిలో పొయ్యి పెట్టటమే తప్పు. తియ్యి ముందు" బెదిరించారు.

"సామీ! ఈ పిండి అయ్యేవరకూ చేసి పొయ్యెత్తేస్తా, సామీ. మీరు రుచి చూడండి - ఈ వడలు" బాదమాకుల్లో రెండేసిపెట్టి యిచ్చింది.

"అమ్మి నీ వడలు మంచి రుచిగా ఉన్నాయి గాని - మా చేతిలో ఏముంది. మేము చెప్పిన మాట వినే నౌకర్లము. ఎవరో రోడ్డు మీద-నుంచి పొయ్యి తీయించమని రిపోర్టు ఇచ్చారట. మా ఆఫీసరు వెంటనే తీయించండ"ని పంపాడు. నిన్ను చూస్తే మనసు కరిగిపోతాఉంది కాని - ఏం చెయ్యము? రేపు మాత్రం ఇక్కడపెట్టకు" అని వెళ్ళిపోయారు.

డాక్టరు బాబుకి కబురు చేరగానే కనుబొమలు ముడిపడ్డాయి. ఆయన కంతకుముందు తల్లిచేత ఆ పని మాన్పించమని రెండు మూడు ఉత్తరాలు కొడుకు దగ్గర నుంచి వచ్చాయి. ఆయన లెక్కచెయ్యలేదు. అది కూడా మాన్పిస్తే ఆమెకు జీవనం గడవాలి కదా. అదిగాక - ఆమెనా పని నుంచి తప్పిస్తే ఏమి తోచక పిచ్చిదయిపోతుంది. కొడుకు ధ్యాస ఎక్కువయిపోతుంది.

ఆ మరునాడు తను హాస్పిటల్‌కు వెళ్ళక ముందు - "మంగమ్మా, ఈ వీధిలో తొమ్మిది వేలకు రెండు గదుల ఇల్లొకటి అమ్మకానికి వచ్చింది. వీధిలోనే ఉన్నట్లుగా రెండు అరుగులు కూడా ఉన్నాయి. పెరడు చాలా చిన్నది. వాళ్ళ అవసరంకొద్దీ చౌకగా అమ్ముతున్నారు. బేరం చెయ్యమంటావా?" అడిగాడు.

"డాక్టరు బాబూ నాకంత డబ్బెక్కడిది? అయినా నాకు ఇల్లెందుకు బాబూ!"

"ఎందుకో నేను తరువాత చెప్తాను. డబ్బు సంగతి కూడా తరువాత చూద్దాం. ఏమంటావు?"

"డాక్టరు బాబూ. నేనేమంటాను.? మన డబ్బులెన్ని ఉన్నాయి బ్యాంకిలో ?"

"అదంతా నేను చూస్తాలే. ఒప్పుకున్నావు కదా?"

"మీ ఇష్టం బాబూ!"

డాక్టరు ఆ ఇంటిని ఎనిమిదిన్నర వేలకే బేరం చేసి, వెయ్యిరూపాయలు పెట్టి బాగు చేయించి సున్నం వేయించాడు. మంగమ్మ పేరున రిజిస్టరు చేయించాడు.

★ ★ ★

మంగమ్మ ఇప్పుడు అరుగుమీద ఇసకపోసి పొయ్యిపెట్టింది.

చెట్టు కింది నుంచి మంగమ్మ అరుగెక్కిందని అందరూ ఆమెను "ఏం మంగమ్మా? అరుగెక్కావు? ఇల్లు కొన్నావా?" అని అడగటం సాగించారు.

మంగమ్మ కేం తెలుసు? ఆయిల్లు తనదేనని? తన కంత డబ్బుందా బ్యాంకిలో? ఏమో? అయినా ఎవరిముందరా బయటపడదు.

అరుగుల ఇల్లు వచ్చిన తరువాత వచ్చిపోయే జనానికి కొంచెం సౌలభ్య మనిపిస్తోంది. అరుగు మీద కూర్చొని సావకాశంగా తినవచ్చు. మంగమ్మను మోసం చేసే అవకాశం చాలా ఉంది. కాని- ఆమె దీన వదనం చూసి ఎవరూ ఇంతవరకూ మోసం చెయ్యలేదు. డబ్బులు వేసుకునే డబ్బా మాత్రం డాక్టరు బాబు మార్చి వేశాడు. ఒక చిన్న స్టూలు పీటకు ఒక రేకు పెట్టెను మేకులతో బిగించాడు. డబ్బులు వెయ్యటానికి ఒక రూపాయ పట్టేటంత చిల్లి చేయించి పెట్టెకు తాళంవేసి ఆమె చేతికిచ్చాడు. ఈ పెట్టె రెండు రోజులకొకసారి డాక్టరు బాబు ఇంటికి తీసుకు వెళ్ళుతుంది.

"డాక్టరు బాబూ! ఇంటికి డబ్బు సరిపోయిందా? మీ చేతి నుంచి ఏమీ పడలేదు కదా? నాకు ఏ సంగతి చెప్పండి బాబూ!" అంటుంది ఆయనకు డబ్బా

యిచ్చినప్పుడల్లా.

"మంగమ్మా, నీవు ఇవాళ మొదలు పెట్టావా ఈ పని? ఇంటికి పోను ఇంకా రెండు వేల పైన ఉంది బ్యాంకిలో. కొత్త యింటికి వచ్చిన తరువాత గిరాకి పెరిగింది. ఎందుకోగాని నిన్ను చూడగానే మా అమ్మ జ్ఞాపకం వస్తుంది. ఆమె నేను డాక్టర్ని కాక ముందే చనిపోయింది" తల వంచుకున్నాడు

"డాక్టరు బాబూ. నాకు మిమ్మల్ని చూడగానే నా పెద్ద కొడుకనిపిస్తుంది. మొదటి చూపులోనే ఇలాంటి భావం కలిగింది. అందుకే అంత చనువు తీసుకుంటున్నాను".

"ఎక్కువ కష్టపడటం తగ్గించుకో మంగమ్మా నీకు ఏమి లోటు లేదు. నీవు తినగలవు. ఇంకొకరికి పెట్టగలవు" డాక్టరు బాబు టిఫిన్ తిని వెళ్లాడు.

మరో రెండేళ్ళు గడిచినా మంగమ్మకు కొడుకు జాడ తెలియలేదు. ఉత్తరం రాస్తాడు. లేదా తనైనా వస్తాడు వాడికి మాత్రం తల్లిని చూడాలని ఉండదూ?" అనుకుంటుంది మంగమ్మ.

మంగమ్మ ఉంటున్న యింటికి పక్క భాగంకూడా అమ్మి ఆ యింటివాళ్ళు చిత్తూరులో వ్యాపారం చేయాలనుకున్నారు. ఆ సంగతి డాక్టరు బాబుకు తెలియజేశారు. వెనక అమ్మిన ధరకే ఇవ్వమని డాక్టరు అడిగాడు. కాని ధరలెక్కువయ్యాయని వాళ్ళు మరో రెండు వేలడిగారు. బేరం తెగలేదు నెల రోజుల తరువాత వాళ్లే దిగి వచ్చారు.

మంగమ్మ డబ్బు లెక్క చూస్తే తక్కువ వుంది ఇప్పుడది మంగమ్మ చేత కొనిపించకపోతే మరొకరు కొని ఈమెను ఇబ్బంది పెడతారు. డాక్టరు తన డబ్బు మూడు వేలకు పైన వేస అది కూడా మంగమ్మ పేరున రిజిస్టరుచేయించాడు. ఆ భాగంలో వచ్చే అద్దెను తన అప్పు కింద జమ చేసుకోసాగాడు.

ఇప్పుడాయనకు మంగమ్మను గురించిన బెంగలేదు. తన తల్లి ఊరగాయలూ పచ్చళ్లూ తయారు చేసి అమ్మేది. వడియాలు ఇళ్లకు వెళ్లి పెట్టి వచ్చేది తను ఆమెకు సహాయం చేసేవాడు తన ఎం బి బి ఎస్. పూర్తి అయింది. కాని రిజల్టు రాక ముందే తల్లి కన్నుమూసింది. ఇప్పుడు మంగమ్మ కొన్న యింటి అరుగు మిదనే తను చదువుతుండేవాడు అందుకే ఆ యింటి మిద అభిమానమూ తన తల్లిలా బ్రతుకుతున్న మంగమ్మ మిద అంతభక్తి ఆదరమూను

ముసురు పట్టిసన్నటి చినుకు పడటంతో ఆ ఊరంతా చిత చితలాడుతున్నది. సూర్యభగవానుడు దర్శనము లేక ఉపవాసాలుంటున్నారు కొందరు. అయినా ప్రకృతికేమి సానుభూతి? అటువంటి సన్నటి చినుకు రోజుల్లో రాత్రి ఎనిమిది గంటలకు మంగమ్మ యింటి తలుపులెవరో కొడుతున్నారు. పగలంతా పొయ్యి దగ్గరున్న మంగమ్మ బాగా అలిసిపోయి నిద్రపోతున్నది. తలుపు చప్పుడధికమైంది. మంగమ్మ కళ్ళు నలుపుకుంటూ లేచి దీపం చేతబట్టుకొని తలుపు తీస 'ఎవరు బాబూ' అంది ముఖం చూస్తూ.

"అమ్మా. నేను వెంకటసామిని. నీ కొడుకునే మరిచావా అమ్మా?" అంటూ తల్లి చేతిలో దీపం అందుకుని మరొక చేత్తో ఆమె భుజమ్మీద చెయ్యేసి లోపలికి తీసుకు వెళ్లాడు.

"నాయనా - ఇన్నాళ్లెక్కడున్నావు? కోడలు పిల్లలు బాగున్నారా? అన్నట్టు భోజనం చేశావా? నీవు కాళ్ళు కడుక్కో అంటూ స్టౌ వెలిగించింది.ఆ మధ్య ఒక స్టౌ కొని కిరసనాయిలు డబ్బాతో గూట్లో పెట్టి వుంచింది.

"ఇప్పుడొద్దులే అమ్మా రైల్లో ఏదో కొని తింటునే ఉన్నా".

"అవి ఎన్ని తిన్నా అన్నంతో సమానమవుతాయిట్రా?"

ఆ మాటా యీ మాటా చెప్పి అన్నం ఉడికినతరువాత నాలుగు వడియాలు వేయించి అన్నం వడ్డించింది. ఊరగాయ దగ్గరగాపెట్టింది.

"నాయనా! లేచి అన్నం తిను"

పక్కవేసి తాను చాప పరచుకుని పాత చీర తల కింద పెట్టుకుంది మంగమ్మ.

"అమ్మా. నేను మళ్లీ రేపు పది గంటలకు వెళ్లిపోవాలి. నిన్ను తీసుకు వెళదామని వచ్చానమ్మా. అక్కడంతా సౌకర్యంగాఉంది. పెద్ద పిల్లవాడు స్కూలుకు కూడా వెళ్తున్నాడు. చిన్న పిల్లలిద్దరినీ ఒక మనిషి చూసుకుంటుంది. నీవు రామ్మా నాతోటి. ఎన్నాళ్ళు ఇలా ఒంటరిగా ఉంటావు?" అన్నాడు మంచంమ్మీద పడుకుని.

మంగమ్మ కొడుకు రమ్మన్నాడన్న సంతోషంతో కళ్ళు నిండు కుండలయ్యాయి. "నాయనా. అలాగే వెళదాము." అంటూ అతడి కుటుంబాన్ని గురించి అన్ని విషయాలూ అడిగింది.

ఒకొక్క దానికీ తృప్తినిచ్చే జవాబులు చెప్తూ "అమ్మా చీకటితో లేచి అన్నం వండు. తిని పోదాం. అక్కడికి పొయ్యేసరికి రెండు గంటలు దాటుతుంది." నిద్రలో లోకి జారుకున్నాడు.




వెంకటసామి ఉలిక్కపడ్డాడు. అప్పటి వరకూ మంచం మ్మీద కూర్చుని, ఇల్లు నాలుగు మూలలా కలయజూసి 'ఈ యిల్లెవరిదో? ఈ రెండు గదులకు అద్దె యిచ్చేటంతగా అమ్మ డబ్బు సంపాదిస్తున్నదా? అమ్మ యింకా వడలు అమ్ముతున్నదా? ఏమిటో నాకు అర్థం కావటంలేదు. అమ్మను నేను మరిచాను. కాని - అమ్మ నన్ను మరువలేదు. అమ్మకెట్లా తెలిసింది - తనకు పెళ్లయినట్టు, పిల్లలు పుట్టినట్టూ? అనుకుంటూ ఆలోచిస్తున్న వెంకటసామి దిగ్గున లేచి కాళ్ళు కడుక్కుని పీట మిద కూర్చున్నాడు.

"నాయనా. కొంచెం నెయ్యి వేసుకో. ఊరగాయ వడ్డిస్తాను" అంటూ ఆవకాయ వేసింది

"అమ్మా. ఇల్లు బాగుంది రోడ్డు మిద. నీవు అద్దె కట్టగలుగుతున్నావమ్మా?"

"నాయనా. అంతా డాక్టరు బాబు చేతి చలువ ఎలా ఉంటున్నానో - ఏం తింటున్నానో?" అన్నది.

భోజనం చేసిన తరువాత కొడుక్కు మంచమ్మీద

మంగమ్మ చీకటితో లేచి వాచి పని చేసుకుని ఒకఇరవై రూపాయలు కొంగున కట్టుకొని, డబ్బా డాక్టరుబాబుకి ఇస్తూ "బాబూ! రాత్రి వెంకటసామి వచ్చాడు. ఈ పది గంటల బస్సులో నన్ను తీసుకుపోతానంటున్నాడు. మి సలహా చెప్పండి బాబూ?" అన్నది.

"వెళ్ళు వెళ్లి కొన్నాళ్ళుండి చూడు. నీకు అనుకూలంగా ఉంటే ఉండు. లేకపోతే వచ్చెయ్యి. ఇక్కడి సంగతులేమిచెప్పకు. నిన్ను ఏదోపని వుండే తీసుకుపోతున్నాడు. జాగ్రత్తగా మసలుకో.మళ్లీ రావటానికయినా ఓ పాతిక దగ్గరుంచుకో" అన్నాడు.

"ఇరవై ఉంచాను బాబూ. నా బట్టలు రెండూ సంచిలో పెట్టుకుని సిద్ధం చేశాను. ఇక స్నానం చేసి అన్నం వండి కూర చేస్తా. వెంకటసామి మితో చెప్పటానికి వస్తాడు " అంటూ వెళ్లిపోయింది.

తొమ్మిది గంటలయేసరికి వెంకటసామి స్నానం చేసి తల్లి ఇచ్చిన కాఫీ తాగి డాక్టరు బాబు దగ్గరికెళ్లి నమస్కారం చేశాడు. ఏవో చిన్న చిన్న

ఊళ్ళలో పని చేస్తూ వచ్చాడు. కనుక తల్లిని తీసుకు వెళ్ళలేకపోయినానని చెప్పాడు. తన తల్లి క్షేమ సమాచారాలు కనుక్కున్నందుకు కృతజ్ఞ తలు చెప్పాడు. తల్లిని తనతో పది గంటలు బస్సులో తీసుకు వెళ్ళుతున్నానని చెప్పాడు.

"మంచిది బాబూ. కన్నతల్లిని జాగ్రత్తగా చూసుకుంటానంటే ఎవరయినా వద్దంటారా?నీ కర్తవ్యము నీవు నెరవేరుస్తున్నావు. సంతోషము" అన్నాడు డాక్టరు బాబు.

బయలుదేరేటప్పుడు ఇల్లు తాళం వేసి తాళం చెవులు డాక్టరు బాబుకిచ్చింది. ఆ యిల్లు ఆయనది కాబోలనుకున్నాడు వెంకటసామి.

దారిలోతల్లీకొడుకులిద్దరూ కున్నాడు వెంకటసామిఒకచో ట ఇద్దరూ కాఫీ తాగారు. మధ్యాహ్నం రెండున్నరకు ఊరు చేరారు. ఇంటికి వెళ్ళగానే పెద్ద పిల్లవాడు శ్రీనివాసు ఎదురుగా వచ్చాడు. వాడి నెత్తుకుని లోపలికి వెళ్లాడు తల్లితో.

ఆయా చేతిలో రెండేళ్ళ పిల్ల ఉంది మూడో కాన్పు వచ్చింది కాబోలు.పసి పిల్ల తొట్టిలో నిద్రపోతున్నది. కాన్పయి నాలుగు నెలలయినట్టుంది. ఏం సుస్తియో గాని మంచమ్మీద పడుకున్నది కోడలు.

"ఏమ్మాపడుకున్నావు? ఒంట్లోబాగాలేదా?" అడిగింది మంగమ్మ.

"ఒంట్లో బాగుండలేదమ్మా ఈ కాన్పయినప్పటి నుంచి ఒకటే జ్వరం" అన్నాడు వెంకటసామి.

"మందులు తీసుకుంటున్నావా అమ్మాయీ?" అడిగింది మంగమ్మ మళ్ళీ కోడల్ని.

"తీసుకుంటొందమ్మా. నాల్గైదు నెలలపాటు హాస్పిటల్‌లో ఉంటే 'ఇంజక్షనులిస్తాము ఎక్సురే తీసి చూస్తూ ఉంటాము అన్నారు డాక్టర్లు" అన్నాడు వెంకటసామి.

"అయ్యో. నాకు తెలియలేదే సంగతి. తెలిస్తే వచ్చే దాన్నప్పుడే." అంటూ మంగమ్మ పెరట్లోకి వెళ్ళి కాళ్ళు కడుక్కుని వచ్చింది. వంట యింట్లోకి వెళ్ళి తొంగి చూసింది. స్టౌ మీద పాలు పెట్టి వున్నాయి.

"వెంకటసామి. పిల్లవాడు స్కూలు నుంచి రాగానే పాలు తాగుతాడా? లేకపోతే కొద్దిగా అన్నం వండనా?" అడిగింది

"వాడు బ్రెడ్ తింటాడులే పిల్లకూడా పాలల్లో బ్రెడ్ వేసుకు తింటుంది. ఆయా చేస్తుందిలే. నీవు కాసేపు పడుకో. తెల్లవారు ఝాముున లేచావు. నేనలా బైటికి వెళ్ళి వస్తా"నని వెళ్లాడు

మంగమ్మ బస్సులో రావటం వల్ల అలిసిపోయినట్లయి మూలనున్న చాప తెచ్చుకొని వసారాలో తల కింద చెయ్యి పెట్టుకొని పడుకుంది. వెంకటసామి వచ్చేసరికిఆరు కావచ్చింది "అమ్మా అమ్మా అంటూ లేపాడు,

ఆమె లేచే లోపల కూరలు తెప్పించి వంట యింటి ముందర పోశాడు. "అమ్మా రేపు నీ కోడలిని హాస్పిటల్లో చేర్చే ఏర్పాటు చేశాను.తొమ్మిది గంటలకు తీసుకు వెళ్తాను చీకటి పడుతోంది బియ్యం పొయ్యి మీద పెట్టి ఏదయినా కూర

# గణపతయ్యా

భాద్రపద శుద్ధ చవితిని పండుగనుచు
అమ్మ నాన్నల అయ్యయ్యో అందవదలి
పుడమినందలి పూజలు పొందగోరి
ఎలుకనెక్కియు వచ్చావ ఈశపుత్ర

తండులాల ధరలు దండిగ పెరుగంగ
ఉండ్రాలు నీకేమి వండగలము?
ప్రతి నిత్యము ధరలు పట్టుదప్పుచునుండ
ఎట్లు మృష్టాన్నాలు పెట్టగలము?

పాలు చక్కెర ధర ప్రాకె చుక్కలదాక
పాయసం నీకేమి ఈయగలము?
పండు ఫలాలును మెండుగా నీకును
అర్పించలేనట్టి అర్భకులము?

పూలు పత్రులె దండిగా పూజ కొరకు
తెచ్చినామని కోపము తెచ్చుకొనక
ఎల్లవేళల అందర్ని చల్లగాను
కాచుచుండుము కరుణతో గణపతయ్యా.

—రాయప్రోలు వామనమూర్తి

# వెర్రి తల్లి - కడుపు తీపి

చెయ్యమ్మా. తొందరగా అన్నం తిని పిల్లలుపడుకుంటారు" భార్యకు మందు ఇవ్వటానికి వెళ్తూ అన్నాడు.

అలాగే మంగమ్మలేచి కాళ్ళు కడుక్కుని పట్టుబట్ట కట్టుకొని పొయ్యి వెగించింది అన్నం పొయ్యి మీద పెట్టి కూరతరిగింది. ఆమెకు నాలుగు గంటలకు కాఫీ తాగే అలవాటు ఇవాళ నాలుగు గంటలకు ఆదికడుపులో పడలేదు సన్నగా తలనొప్పి మొదలయింది

వెంకటసామి పిల్లతో ఏడు గంటలకే వంట యింట్లోకి వచ్చాడు "అమ్మా. ఈ రెండు పళ్ళేలలో వడ్డించు. పిల్లలకు పెట్టి మనిద్దరం భోజనానికి కూర్చుందాము" అంటూ పళ్లాలు పట్టుకు వచ్చాడు.

"పాపకునేను పెట్టనా నాయనా"

"నీవు కొత్తగదమ్మా. రెండు మూడు రోజులయితే నీ దగ్గరకి వస్తుంది" అంటూ కలిపి అన్నం పాపకు తినిపించాడు. పిల్లవాడికి కొత్త మనిషిని చూడగానే సందేహమొచ్చింది

"ఎవరు నాన్నా" అని చెవిలో నోరు పెట్టి అడిగాడు.

"మా అమ్మరా నీకు బామ్మవుతుంది".

నవ్వుతూ ఆమె ముఖంలోకి చూశాడు

"నీ పేరేమిటి నాయనా?" అడిగింది ముద్దొస్తున్న బాబును మురిపెంగా చూస్తూ.

"నారాయణ" అన్నాడు తల వంచుకుని బాబు

"నీ చెల్లెలు పేరు?"

"నీల"

"బాగుంది భోజనం చేయండి. తిని పడుకుందురుగాని" వడ్డించి యిచ్చింది.

తల్లీ కొడుకులు భోజనాలు చేసేటప్పుడు వెంకటసామి ఎక్కువగా మాట్లాడలేదు. ఏదో బాధలో ఉన్నాడనుకుంది మంగమ్మ.

తెల్లవారి లేస్తూనే స్నానం చేసి పాలు కాచి కాఫీ చేసి కొడుకును పిలిచింది. అతడే అందరికీ అందించాడు.

"అమ్మా పిల్లవాడు స్కూలుకు వెళతాడు. నేను నీ కోడలిని హాస్పిటల్లో చేర్పించి వస్తాను. వంట తొందరగా కావా అమ్మా.చిన్న పిల్లలు ఆడ నౌకరు 'యింట్లో ఉంటారు" గబ గబా పిల్లలకు స్నానాలు చేయించి బట్టలు వేశారు.

మంగమ్మ వేగంగా వంట చేసింది. నారాయణ స్కూలుకు వెళ్లాడు. భార్యతో బయలుదేరిన కొడుకును చూసి మంగమ్మ వాకిట్లోకి వచ్చింది. ఆటోలో ఎక్కుతున్న కోడలిని చూసి"ఒళ్ళు నయం చేసుకొని తొందరగా ఇంటికి రామ్మా" అంటూ ఆటో రోడ్డు దాటే వరకూ నిలబడి చూసింది.

"ఏమిటో చిన్నతనంలో ఈ జబ్బులు? ఈ బిడ్డలతో జబ్బు భార్యతో ఎంత కష్టపడుతున్నాడో నాయన? వాడికి సుఖమ్మాట దేవుడెరుగు. కంటి నిండా నిద్రయినా లేదు. చిక్కిపోయాడు బిడ్డ' పదిసార్లనుకుని కంట తడిబెట్టింది. ఆమెకు అన్నం సహించలేదు. తినీ తిననట్లుగా చేసి విశ్రమించింది. పిల్లలిద్దరూ నిద్రపోగానే ఆడ నౌకరుకు అన్నం పెట్టింది. చాపవేసుకుని నడుం వాల్చింది

తను అల్లారుముద్దుగా పెంచిన తన కొడుకు అనేక రకాలుగా ఇబ్బంది పడుతున్నాడు. ఒక రోజుకే అతడి సంసారాన్ని, ఆ సాగరాన్ని, అతడు ఈదే విధానాన్ని చూసి భరించలేకపోతున్నది. వేళకు అన్నం నీళ్ళు లేకుండా ఎంత కష్టపడుతున్నాడు? వీడి కష్టాలు ఎప్పుడు గట్టెక్కుతాయి?

అంతలో పిల్లలు లేచారు. పాలు కలిపి నౌకరు చేతికిచ్చింది. తను కాఫీ తాగి కొడుకు కోసం ఫ్లాస్కులో పోసింది. అతడొచ్చేసరికి ఏదయినా టిఫిన్ చేద్దామని వంట ఇల్లంతా వెతకటం మొదలెట్టింది ఎంత వెదికినా టిఫిన్ చేయదగ్గ వస్తువులే కనపడలేదు. ఇది నెలాఖరా? కాదు.

నౌకర్ని దగ్గరికి పిలిచి మెల్లగా మంచి మాటలతో ఇంటి సంగతులన్నీ అడిగింది. ఇంట్లో వంట లేదా?పిల్లలకేనా నౌకరు చేసే వంట? వాళ్ళిద్దరికి హోటలు భోజనమా? అంతా విన్న తరువాత ఆమెకు కలిగిన సందేహాలూ ప్రశ్నలూ కడుపులో పెట్టుకుంది. ఏదో ఆవేదన

వెంకటసామి బ్యాంకి నుంచి హాస్పిటల్‌కు వెళ్లిభార్య ఆరోగ్యవిషయాలను డాక్టర్లను అడిగి తెలుసుకొని, ఆమెను పలకరించి, కబుర్లు చెప్పి ఆరు గంటలు సుమారుగా ఇంటికి వస్తాడు. తల్లి యిచ్చిన కాఫీ తాగుతాడు. పిల్లల సంగతి చూసుకొని భోజనం చేసి పడుకుంటాడు.

'ఒరే వెంకటసామి' అంటూ తల్లి భోజనం చేసేటప్పుడు ఏదో ప్రస్తావించబోతుంది. అతడు పరధ్యానంతో ఉండి జవాబు చెప్పడు. ఏదో

చూస్తాడు. ఏదో ఆలోచిస్తాడు.

పాపం చిన్నవాడు. భార్య హాస్పిటల్‌లో ఉందన్న దిగులేమో? చేతిలో డబ్బు లేదన్న దిగులు కూడా ఉందేమో? కన్నతల్లి కదా. చెప్పకూడదూ?

"నాయనా కోడలికి ఎట్లా ఉందిరా? కాస్త నయంగా ఉందా?" ఆదుర్దాతో అడుగుతుంది.

"తగ్గుతోందంటున్నారు డాక్టర్లు. మనిషి కూడా అంత నీరసంగా లేదు. కోడిగ్రుడ్లు, పళ్ళు పాలు బాగా తినమంటున్నారు. ఒకటి రెండు నెలల్లో ఇంటికి పంపుతారట." అన్నాడు తల వంచుకుని.

"రెండు నెలలే కదా? ఫరవాలేదు నీ అదృష్టం పిల్లల అదృష్టం. నాయనా - మీరిద్దరూ బాగుంటేనే సంసారం సుఖంగా సాగుతుంది.పది కాలాలపాటు పచ్చ పచ్చగా సాగిపోతుంది".

భోజనం చేసి నిద్రలోకి జారుకుంది. తెల్లవారా - పొద్దుగూకా - ఇలా రెండు నెలల మంగమ్మ రోజులు లెక్క పెట్టుకోగా భారంగా గడిచాయి. మంగమ్మ ఇంతవరకూ ఎరగని అనుభవము - వెంకటసామి ఇంటికి కావలసినవి ఒక్కసారి తెచ్చి పడెయ్యడు. నాలుగుసార్లు చెబితే రెండు రోజుల సామాను తెచ్చి పడేస్తాడు. తను కన్నకొడుకే అయినాతనకెంతో అభిమానమనిపిస్తున్నది. అమ్మ దుబారా ఖర్చు చేస్తోందని అనుకోవటంలేదు కదా?

పెద్ద పిల్లవాడు నారాయణకు, పిల్లకూ వారం వారం తలంట్లు పోస్తున్నది. పసి పిల్లను కాళ్ళ మీద పడుకోబెట్టుకుని తన పద్ధతిలోనే స్నానం చేయిస్తున్నది. వారానికి ఒకసారి ఇల్లు కడిగిస్తున్నది. రంగవల్లులు తీర్చిదిద్దుతున్నది.

కోడలు యింటికి వచ్చేనాడు మంగమ్మ చాలా ఆర్భాటం చేసింది. ఇల్లంతాదుమ్ము లేకుండా దులిపించి ఆమెకు పక్క వేయించి బాగా ఉతికిన దుప్పటి వేసింది. కిటికీలకు పరదాలుకట్టింది. పది గంటలకు వంట చేసి పిల్లలకు పెట్టి కోడలు రాక కోసం ఎదురు చూస్తోంది.

పన్నెండు గంటలు దాటి ఒంటి గంటకావచ్చింది. కొడుకూ కోడలితో భోజనం చేయాలని వీధి వాకిట్లోనే కూర్చుంది.

కొడుకూ కోడలూ రెండు గంటల సుమారుకు లోపలికి వచ్చారు. కోడలు తొట్టిలో ఉన్న పాపనొకసారి చూసుకుంది. ఎడపిల్లను ఆయా దగ్గర్నించి తీసుకుని ఎత్తుకుంది. పాపతో మాట్లాడుతూ గదిలోకి వెళ్ళిపోయింది. కొడుకు బట్టలపెట్టె బుట్టలోపలికి తీసుకువచ్చాడు.

"నాయనా! భోజనానికిరండి". కొడుకుతో చెప్ప కోడలి గదిలోకి వెళ్ళి"అమ్మాయి. క్షేమంగా ఇంటికి తిరిగి వచ్చావు. అదే పది వేలు. నీ బిడ్డల అదృష్టం. పొద్దు పోయింది. భోజనం చేద్దువుగాని రా అమ్మా" పిలిచింది.

"మేము భోజనం చేశాము" అన్నది కోడలు ముఖం అటు తిప్పుకుని.

మంగమ్మ ముఖం కడుక్కుని తుడుచుకుంటున్న కొడుకు నడిగింది - "నాయనా! భోజనం చేసి వచ్చారా? నేను వంటచేసి మీకోసం కనిపెట్టుకుని ఉన్నానురా". అన్నది.

"అలాగా? ఎందుకు ఆగావమ్మా ఇంతవరకు? ఇప్పుడయినా భోజనం చెయ్యి" అంటూ గదిలోకి వెళ్లాడు.



## వెర్రి తల్లి - కడుపు తీపి

మంగమ్మ కాళ్ళీడ్చుకుంటూ వంట యింట్లోకి వెళ్ళి విస్తరి వేసుకుని మంచినీళ్ళు పెట్టుకుంది. ఎందుకో మనసు చిన్నబోయింది. అన్నం సహించలేదు. అప్పటికి ఆకలి కూడా చచ్చిపోయింది. మజ్జిగన్నం తిని లేచింది. వసారాలో చాప పరచుకుని తల కింద చెయ్యి పెట్టుకుని పడుకుంది. అప్పట నుంచి కూర్చునే ఉంది కనుక మేను వాల్చగానే విశ్రాంతనిపించింది గాని మనసు ఊరుకోవటంలేదు.

కొడుకూ కోడలికీ కూడా కలిపి తను వంట చేసింది. ఎక్కడో తిని వస్తారని తనకు మాత్రం ఏం తెలుసు? ఆ వంటంతా ఏం చేసుకుంటుంది? రాత్రికి నౌకరుకు పెట్టితాను తినవచ్చు. పిల్లలకు మళ్ళీ వంట చేస్తే వేడిగా తింటారనుకుంది.

కాని - ఏడు గంటలు కాక ముందే ఆయా పిల్లలకు వంట చేసింది. బల్లమీద భోజనాలు పెట్టింది.

తను ఎవర్ని అడుగుతుంది? వెంకటసామి హోటల్లో భోజనం చేసి భార్యకు టిఫిన్ కారియర్‌లో తీసుకు వచ్చాడు. పిల్లలు భోజనాలు చేసి పడుకున్నారు. నౌకరికి భోజనం పెట్టి తాను మజ్జిగ తాగి పడుకుంది. కాని - నిద్రపట్టలేదు. చిరు చలి ప్రవేశించింది. ఆ వరండాలో నిద్రపట్టడానికి ఒక దుప్పటయినా ఉంటే నిద్ర వచ్చునేమో? తలుపులు వేసి ఉన్నాయి.

★ ★ ★

తెల్లవారింది. ఎవరి దినచర్య వారిది. వెంకటసామి గదిలో నుంచి బయటికి రాడు.

కోడలు డ్యూటీలో చేరింది. తమ గదికి తాళం వేసుకున్నారు. పిల్లల కోసం హాలు తెరిచి ఉంచారు. వంట చేసుకోటానికి వంట యిల్లుకూడా వదలిపెట్టారు.

కొడుకుకు తనతో మాట్లాడే తీరికలేదు. కోడలు మాట్లాడదు. తను ఒక్కతే కూర్చుని వండుకుని తినటానికా ఇంత దూరం వచ్చింది? తను ఖైదులో ఉన్నట్లు అనిపించింది.

ఆనాడు స్నానానికి పోయేటప్పుడు "నాయనా వెంకటసామి!" అని పిలిచింది.

"అమ్మా తొందరగా వెళ్ళాలి. టైము లేదు. సాయంత్రం నేను వచ్చిన తరువాత మాట్లాడుకుందాము" అన్నాడు.

సాయంత్రపువేళ పిల్లవాడిని "నారాయణా" అని పిలిచింది.

"ఆడుకోవాలి. నా ఫ్రెండు వచ్చాడని" పరుగెత్తాడు.

వారానికొకసారి పాటలు పాడుతూ నలుగుపెట్టి తలంటి పోసేది.ఇప్పుడది లేదు. పిల్లలయినా దగ్గరికి వస్తే కొద్దిగా కాలక్షేపం.

సాయంత్రం కొడుకూ కోడలూ ఆఫీసు నుంచి. రాగానే కాఫీ చేసి ఇద్దామనుకుంది. కాని సరుకులు లేవు.

"అమ్మాయీ, సామాను తెప్పిస్తే వంట చేసి పెడతాను. నీకు వంట్లో కులాసాగా ఉందా?" అంటూ ఎదురుగా వెళ్ళింది.

"ఇప్పుడు సామానెందుకు? మేము హోటల్లో భోజనం చేస్తాము. ఇవాళ్టి నుంచి పిల్లలకు కూడా అక్కడి నుంచే తెస్తాము" అన్నది.

ఇంక ఆమెతో మరో మాట మాట్లాడటానికి అవకాశంలేదు.

వెంకటసామి స్నేహితులొచ్చారు. వాళ్ళతో మాట్లాడి లోపలికి వస్తూనే కోడలిని తీసుకుని బయటికు వెళ్ళాడు.

మంగమ్మకు పట్టలేని దుఃఖం వచ్చింది. తను ఒక్కతే అన్నం వండుకుని తింటూ మూగగా ఉండలేననుకుంది.

కొడుకు కంటికి కనబడగానే "వెంకటసామి. నేను వెళ్తానురా. కొండ మీద దేవుణ్ణి చూడ్దామనిపిస్తోంది. నేను వచ్చి చాలా రోజులయింది. నన్ను పంపించు" అన్నది.

"సరేలే అమ్మా. నీకు వెళ్ళాలని ఉంటే వెళ్ళు. ఈ సాయంత్రం ఎలా వెళ్తావు? బాగా చీకటిపడుతుంది వెళ్ళేసరికి. రేపు వెళ్ళు" అన్నాడు.

"నీవు యింట్లో ఉండవుగా? బస్సయినా ఎక్కిస్తే వెళ్తాను" అంది.

"ఎట్లాగమ్మా బాంకిలో పని ఎక్కువగా ఉంది" అన్నాడు మళ్ళీ కొంచెం సేపాలోచించి "అమ్మా ఎవరిని అడిగినా బస్టాండు ఎక్కడుంటే చెపుతారు" అన్నాడు.

"తెల్లవారగానే ముఖం కడుక్కుని స్నానం చేసింది. తనకు వంట ఎందుకు? ఆడ నౌకరు కూడా టిఫిన్ కారియరు భోజనమే చేస్తోందిప్పుడు. తన బట్టలు ఉతికి ఆర వేసుకుని మడత వేసుకుంది. తొమ్మిది గంటలు కాగానే సంచి పట్టుకుని వీధి వాకిట్లోకి వచ్చింది.

"వెంకటసామి. నేను పోతున్నానురా. అమ్మాయి. వెళ్ళి వస్తాను. ఎప్పుడయినా మీ క్షేమం రాస్తూ ఉండండి" అన్నది. గదిలో నుంచి వాళ్ళు బయటికి వస్తారేమో చూసి వెళ్దామని కాసేపు ఆగింది.

"సరేనమ్మా" అన్నాడు వెంకటసామి గదిలోపల నుంచే.

కంటి చూపు కూడా కరవేనా అనుకుంటూ వీధి గుమ్మం దాటింది. కనబడిన వారినందరినీ అడిగి బస్టాండుకు చేరుకుంది. ఉపవాసాలతో నీరసమనిపించింది నడవటానికి. రెండరటి పళ్ళు కొని తిన్నది. కళ్ళల్లో ఊరుతున్న నీళ్ళను పదే పదే వత్తుకుంటూ బస్సు రాగానే టికెట్టు తీసుకుని ఎక్కింది.

"ఎంత మేలయింది తను వచ్చేటప్పుడు ఇరవై రూపాయలు తెచ్చుకోవటం? ఈ ఇరవై లేకపోతే తన గతి ఏమయ్యేది? ఎవరిని అడిగితే ఇస్తారు?"

ఆమెకు అంతకంటే దూరంగా ఆలోచించ లేక పోయింది. వెంకటసామి తన కన్న కొడుకు. అష్ట కష్టాలు పడి పెంచింది. తను ఒకపూట తినక పోయినా కొడుక్కు లోపం లేకుండా పెంచింది. వెంకటసామి తమలా కష్టపడకూడదని ప్రాణాలు కళ్ళల్లో పెట్టుకు చదివించింది. పెళ్ళి అతడే చేసుకున్నాడు. బిడ్డలు పుట్టారు. సుఖంగా ఉన్నాడు.

"అవును. తన కింత కంటే ఏం కావాలి?" బస్సు కుదుపుకు కునుకు పట్టింది. "దిగమ్మా. తిరుపతి వచ్చిందని" కండక్టరు అరుపుతో లేచింది. కళ్ళు నులుపుకుంటూ లేచి సంచీ పట్టుకు దిగింది. అపరాహ్నం దాటింది. బస్టాండులో మళ్ళీ అరటిపళ్ళు కొనుక్కుని తిని కడుపు నిండా నీళ్ళు తాగింది. ఆవేళప్పుడు ఇంటికి వెళ్ళినా డాక్టరు బాబు ఉండరు. తాళపు చెవులు ఆయన దగ్గర ఉన్నాయి. మెల్లగా వెళ్ళచ్చు ఏం తొందర? అక్కడే ఒక అంగడి ముందర సంచీ పట్టుకుని కూర్చుంది– వీధివెంట నడిచే జనాన్ని చూస్తూ.

రాత్రి ఎనిమిది గంటలయిన తరువాత వీధిదీపాల వెలుగులో ఇంటి దారి పట్టింది. డాక్టరు అప్పుడే ఇంటికి వచ్చినట్టున్నారు. వీధి తలుపు తెరుచుకుని కుర్చీలో కూర్చున్నాడు విశ్రాంతిగా.

"ఓహో మంగమ్మా? ఎప్పుడొచ్చావు? అందరూ బాగున్నారా? లోపలికి రా"

గడప దగ్గరగా కూర్చుంది మంగమ్మ. అందరూ బాగున్నారు బాబూ. నేను మధ్యాహ్నం రెండు గంటలకే వచ్చాను. మీరు ఇంట్లో ఉండరని అక్కడే వీధిలో జనాన్ని చూస్తూ కూర్చున్నాబాబూ."

"అప్పుడే వచ్చావేం? ఇంకా కొన్నాళ్ళు ఉండలేకపోయావా? వెళ్ళక వెళ్ళక వెళ్ళావు"




అన్నాడు.

"ఆ మాట నిజమే ననుకోండి. అక్కడ తోచలేదు బాబూ. చేతినిండా పనిచేసిన దాన్నికదా. పొద్దున పది గంటల నుండి సాయంత్రం ఆరు గంటల వరకూ పని చేస్తూ పొయ్యిదగ్గర ఉన్నదాన్ని. అక్కడ ఆ కొద్ది పనీ చేసి కూచోటమేగా. బొత్తిగా కాలం గడవలేదు. వెంకటసామి అక్కడే ఉండమని బలవంతం చేశాడు. కోడలు బయలు దేరనివ్వలేదు. ఏం జబ్బోగాని ఐదు నెలలపాటు హాస్పిటల్లో ఉండి మందులు తీసుకుంది. ఇవాళ్టికి రెండుమూడు రోజుల కిందనే ఇంటి కొచ్చింది. పని మనిషి ఎప్పుడూ ఇంట్లోనే ఉండి పిల్లలను చూసుకుంటుంది. మరి నాకేం పనుంది? అందుకని వచ్చేశాను" అన్నది.

"మంచి పని చేశావు. నిన్ను కష్టపడకుండా ఇంట్లో కూర్చోమన్నా కూర్చోలేవు. రేపటి నుంచే నీ మామూలు పని చేసుకో. నీకు సామానుకూడా ఉన్నట్టు జ్ఞాపకం" అన్నాడు.

తాళపు చెవులు తీసుకుని యింటికి వెళ్ళిన మంగమ్మ మంచమ్మీద తన పక్క వేసుకుని పడుకుంది. ఎంత రాత్రయినా నిద్రరాదు. ఏదో వెలితి– ఏదో అసంతృప్తి కడుపులో మసులుతున్నది. తను కన్న కొడుకు. తండ్రి లేని బిడ్డను ఎంత కష్టపడి పెంచింది? బట్టలో తిండిలో తన కొడుక్కు ఏ లోపం రాకుండాపెంచిందే? ఎస్. ఎస్. సి.లో చేరితే అడ్రస్సు ఉతికి గంజిపెట్టి ఇస్త్రీ చేయించి చేతికిచ్చిందే? తను కడుపుకు తిండి చూసుకోలేదు. ఒంటికి సరైన బట్ట చూసుకోలేదు. తల వెంట్రుకలకు నూనెలేదు. కాని– తన కొడుక్కు తండ్రి లేడన్న లోపమేగాని మరేలోపం ఉండకూడదన్న పట్టుదలతో పెంచింది.. తను పడ్డ కష్టాలు తను కొడుకు పడకూడదన్న ఆశయము.

కొండంత ఆశతో పెంచింది. కడుపార కన్నతల్లి మనసార మాట్లాడుతాడని ఆశించింది. "అమ్మా ఎట్లా ఉన్నావు ఒక్కదానవు? ఎందుకింకా కష్టపడతా"వని అంటాడనుకుంది.

ఒక్కమాటంటే ఒక్క మాట మాట్లాడితే కొండంతగా సంతోషించేది." నాయనా వెంకటసామి అన్నప్పుడల్లా గదిలోకి దూరకపోతే అమ్మా అంటూ ఆప్యాయంగా నాలుగు మాటలు మాట్లాడితే తన కడుపునిండేది. మాట్లాడక పోయినా కంటితో చూసుకు బతుకుదామనుకుంటే అదీ కరువయింది.

మంగమ్మ కడుపులో ఉన్న బాధను పట్టలేక వెక్కి వెక్కి ఏడ్చింది. ఎంత కన్నీరు కారినా ఆ అగ్ని చల్లారదు. ఏం చేస్తుంది? చేతులు పిసుక్కుంది. తల కొట్టుకుంది. నేల మీద పడి దొర్లింది.

తెల తెలవారు తుండగా లేచి మామూలుగా స్నానం చేసి పాచిపని చేసుకుని ఇటు అన్నం వండుకుంటూ అటు పప్పు రుబ్బుతుంది. మళ్ళీ మామూలు దినచర్య.

మంగమ్మ ఇన్నాళ్ళూ లేదని ఎవరూ రాకుండా ఉండలేదు. మామూలుగా వస్తూనే ఉన్నారు. కాని– మంగమ్మలో మునుపటి ఉత్సాహం లేదు. డబ్బా నిండిందన్న సంతోషము లేదు. అంతా యాంత్రికం.

"మంగమ్మా. కొడుకుదగ్గరి కెళ్ళి వచ్చినప్పటి నుంచి ఏమంత ఉత్సాహంగా లేవెందుకు? కొడుకు మీదికి మనసు మళ్ళిందా?" అడిగాడు డాక్టరు.

ఈసారి పట్టలేక పోయింది మనసును మంగమ్మ. బావురుమని ఏడ్చేసింది. డాక్టరు భార్య మంగమ్మ దగ్గర కూర్చుని "ఏమిటి మంగమ్మా. అలా కంట తడి పెట్ట వచ్చునా? కొడుకు సంసారాన్ని చూసి సంతోషించాలి 'గాని బాధపడతారా?" ఓదార్చ బోయింది.

దుఃఖాని కుండే గుణమే అది – ఓదార్చిన కొద్దీ ఎక్కువవుతుంది. మంగమ్మ ఆపుకోలేకపోతోంది.

పొంగు చల్లారని అన్నట్టు డాక్టరు భార్యకు సైగ చేశాడు. ఆయన నిబ్బరంగా కూర్చున్నాడు. వెంకటసామి రాసిన ఉత్తరం ఆ క్రిందటి రోజే చేరింది ఆయనకు. 'డాక్టరు బాబూ! నేనేం చెయ్యను? ప్రాణంలో ప్రాణంగా చూసుకుంటూ పెంచిన అమ్మతో మనసారా మాట్లాడటానికి నేను

# గెలవండి! రూ 20,000/-ల విలువైన బహుమతులు!



## కలువబాల

## చందాదారులకు లక్కీడిప్:

## ఆగస్టు 1 నుండి నవంబరు 1 వరకు.

మొదటి బహుమతి

★ ఒక కలర్ టి.వి.

రెండవ బహుమతులు

★★ రెండు బ్లాక్ అండ్ వైట్ టి.వి.లు

మూడవ బహుమతులు

★★★ మూడు "కిచెన్ మెషిన్"లు (మిక్సర్‌లు)

నాలుగవ బహుమతులు

★★★★ నాలుగు "లేడీస్ రిస్ట్ వాచీ"లు

రు. 60లు చందా కట్టగానే అందమైన 'కలువబాల' పత్రిక నెలకి రెండుసార్లు మీ యింటికి అందుతుంది. ఆదిగాక మీరి క్రింది బహుమతులు గెలుచుకోవచ్చు. "చిరుకానుక" తప్పకుండా అందరికీ వుంటుంది.

మీరేం చెయ్యాలి? చేయవలసిందల్లా "కలువబాల"కు ఏడాది "చందాదారులుగా" చేరడమే! కాకపోతే మీ చందా సైకంతో పాటు యిక్కడ యిచ్చిన కూపన్ పూర్తి చేసి పంపాలి!

అంతేకాదు ఈ బహుమతి పథకంలో పాల్గొన్న చందాదారులందరికి కలువబాల నుంచి ఒక "చిరుకానుక" కాలక్రమంలో అందుతుంది



కలువబాల

నవ వనితా పక్షపత్రిక

# కలువబాల లక్కీడిప్ చందాదారులకు నిబంధనలు సూచనలు.

1 చందా ఫైకము రు 60లు మనియార్డరు ద్వారా గాని, డిమాండు డ్రాఫ్టు ద్వారా గాని పంపవచ్చును

2 ఎమ్ ఒ లు పంపేవారు వారి కూపన్‌తో పాటు, ఎమ్ ఒ పంపిన తేదీ తెలుపుతూ, దాని రశీదు జతచేసి మరీ కూపన్ పంపాలి లేదా డి డి ని కూపన్‌తో జతచేయాలి

3 చందా భారత దేశంలో వున్న వారెవరైనా కట్టవచ్చును

4 చందా ఫైకము నేరుగా విజయవాడ, ఆంధ్రపత్రిక కార్యాలయంలో కూడా కట్టవచ్చును

5 ఎమ్ ఒ లు, డి డి లు వ్యక్తుల పేర పంపించకూడదు

6 కూపన్‌లు రిజిష్టర్డు పోస్టులో పంపరాదు లక్కీడిప్ గడువు పూర్తి అయిన తర్వాత యిందులో పాల్గొన్న చందాదారులకు చీట్లుతీసి, పైన తెలిపిన బహుమతులను ప్రకటించుతాము ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు

7 కూపన్‌మీద, మనియార్డరు కూపన్ మీదా కూడా పంపేవారి పేరు, చిరునామా స్పష్టంగా, పూర్తిగా వ్రాయాలి వారు ఇదివరకే చందాదారులైతే కూడా, వారి స్నేహితులెవరికైనా, "కలువబాల" చందాను బహుమతిగా కట్టవచ్చును డి డి లు "ఆంధ్రపత్రిక- విజయవాడ-3 పేర తీసుకొని పంపించాలి

---

కత్తిరించాలి



నిజమయితే ✓
కాకపోతే x
అని గుర్తు పెట్టాలి

ఆంధ్రపత్రిక బొంబాయి నుంచి వెలువడుతూ వుండేది ( )

దినపత్రిక కన్నా వారపత్రిక ముందే పుట్టింది. ( )

"భారతి" సాహితీప్రియుల పక్ష పత్రిక ( )

బాలరంజని పిల్లల పత్రిక ఆంధ్రపత్రిక ప్రచురణ ( )

కలువబాల చందాదారుల 'లక్కీడిప్' చందా కట్టిన వారి పూర్తి పేరు :..............................

..............................

చిరునామా :..............................

..............................

..............................

ఎమ్ ఒ పంపిన తేది ..............................

లేదా

**డి డి జత చేయడమైనది**

---

8. "లక్కీడిప్" 1-11-1986 లేదా ఆ లోపల కట్టే చందాలకి మాత్రమే వర్తిస్తుంది. కూపన్‌లు, చందాలు పంపవలసిన చిరునామా : కలువబాల, కేరాఫ్; ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ-3కి పంపాలి.

9. ఈ పథకంలో పాల్గొనే వారికి స్థానిక ఏజెంట్ ద్వారా పత్రిక సప్లయి చేస్తాము
గమనిక · ఏజెంట్ లేనిచోట పోస్టులో పంపిస్తాము

10. ఆంధ్రపత్రిక సంస్థలోని ఉద్యోగులు, వారి బంధువులు ఈ లక్కీ డిప్‌లో పాల్గొనరాదు.

## గడుసులోకం —బాబు







నోచుకోలేదు. ఇంతకాలమూ నా కోసం కష్టపడిన తల్లిని సుఖపెట్టే అదృష్టంలేదు. అమ్మ దీనవదనం కళ్లకు కట్టినట్టుగా ఉంటుంది నాకెప్పుడూ. ఆమె ముఖమే నన్ను, వెంటాడుతుంది. ఒకోసారి ఆ బాధను భరించలేను. ఉద్యోగమిస్తూ నన్ను ఆఫీసరు అలవిగాని భార్యను అంట గట్టాడు. నా స్వాతంత్ర్యం అమ్ముడు పోయింది. నేనొక కీలుబొమ్మను. చెప్పినట్టు ఆడే ఆట బొమ్మను. అమ్మ వెళ్లిపోతే గాని ఇంటికి రానని పట్టు బట్టింది. భార్యామణి. అమ్మతో ఎట్లా చెప్పను నా నోటితో? అందుకే మాట్లాడలేక పోయాను. అమ్మ అంత మాత్రం గ్రహించ లేని మనిషికాదు. అమ్మ వెళ్తానన్నది. నా పాపిష్టి చేతులతో అమ్మకు బస్సు ఖర్చుకూడా ఇవ్వలేని అసమర్థుడిని. డాక్టరు బాబూ. అమ్మ మనసు నొచ్చుకోకుండా సర్ది చెప్పండి". అంటూ తన మనసులో ఉన్న వేదనంతా వెళ్లబోసాడా ఉత్తరంలో.

"మంగమ్మా. నేనొకటి చెబుతాను వింటావా?మమత అనేది ముందుకు సాగిపోతుంది. కాని వెనక్కు తిరిగి ప్రవహించదు. అందులోను మమత అవసరాలను బట్టి సాగిపోతుంది. బాల్యంలో తల్లికి బిడ్డ మీద విపరీతమైన మమత. అంత మమత ఉంటేగాని ఆ బిడ్డ పెరగదు. బిడ్డకు తల్లి మీద కూడా అట్లాగే ఉంటుంది. కాని క్రమేణా తల్లి మమత అట్లాగే ఉంటుంది. ఎప్పటికి మారదు. కాని– బిడ్డకు పెరుగుతున్న కొద్ది మమతలో మార్పు కలుగుతుంది. యౌవనంలో భార్య అవసరం. మమత అటువైపు మళ్లుతుంది. మళ్లాలి. అట్లా మళ్లితే గాని అతడికి సంసారం సాగదు. సంతానం కలుగుతుంది. వాళ్లను మమతతో పెంచాలి. కనుక మమతలో ముందు చూపే గాని వెనక్కు తిరగలేదు మనిషి. అయితే ఇది అందరికీ వర్తించదు. కొందరు మమతతో పాలు భక్తి గౌరవాలు కూడా పెంపొందించు కుంటారు. ముందూ వెనకా కూడా సమర్థించుకో గలుగుతారు. అయినా మంగమ్మా. నీవు అంత ప్రాణాధికంగా



ప్రేమించి – అంత త్యాగం చేసి ప్రాణాలన్నీ కొడుకు మీద పెట్టుకుని ఎందుకు పెంచావు కొడుకును? చెప్పు?" ఆమె ముఖం చూస్తూ ప్రశ్నించాడు.

కళ్లు ఒత్తుకుంటూ "బాబూ. మమకారాన్ని పట్టలేక అలా పెంచాను. తండ్రిని పుట్టకముందే పోగొట్టుకున్నాడన్న దుఃఖంతో తండ్రి లేని లోపం కనబడకుండా తండ్రిలా తెచ్చి పెట్టాను. కన్న తల్లి మమకారంతో అపురూపంగాపెంచాను."

"నీ మమకారాన్ని పట్టలేక ఏలోపం లేకుండా పెంచావు. కనుక– అలా పెంచాను. ఇలా పెంచానని అతడితో అనకు. అంటే 'నేనలా పెంచమన్నానా?' అంటాడు. నిష్కామకర్మ చేశాననుకో. అంతే. ఎక్కడో బాగున్నాడు కదా అని సంతోషించు".

"బాబూ. అంతేనా? అప్పుడు నేనలా పెంచాను కనుక పెత్తనంలో నన్ను చూసుకోవాలను కోవటం తప్పా బాబూ? కన్న తల్లి దండ్రులను కొడుకులు చూడకపోతే మరెవరు చూస్తారు? ఆశపడటం తప్పా బాబూ! రేపు లేవలేనినాడు నాగతేమిటి?మ్యునిసిపాలిటీ వాళ్ళు ఈడ్చి పారెయ్యటమేనా?వాడిని చూస్తూ అయినా రోజులు గడుపుదామనుకున్న ఆశకూడా నిరాశయింది." దుఃఖం కట్టలు తెంచుకుంది.

డాక్టరు కళ్లు చెమ్మగిల్లాయి. ఆమె మాటలకు జవాబు చెప్పలేక పోయాడు.

"మంగమ్మ వయసు మీద పడుతున్న కొద్దీ ఈ మమకారాలన్నీ తగ్గించుకుని రామా కృష్ణా అంటూ గడిపెయ్యాలి శేషజీవితాన్ని".

"ఈ మమకారాన్నెట్లా చంపుకోను? కంటికి కనబడని ఆ రాముడి మీద– ఆ కృష్ణుడి మీద మనసు ఎట్లా నిలపను?" మంగమ్మ కంటి ఎదుట అన్నం తిననని మారాం చేస్తున్న వెంకటసామి మెదిలాడు.

"వెంకటసామి లోనే వాళ్లను చూసుకుని ఇంతకాలం బతికాను".

"ఇప్పుడలా కాదు. కనబడని వాళ్లను కనబడేటట్టు చేసుకోవాలి మంగమ్మా."

"బాబూ. నావల్ల కాదు. నేనంతటి భక్తురాలిని కాదు. మామూలు మనిషిని. కొడుకును చూడాలని ఆరాటపడే తల్లిని. సామాన్యురాలిని."

"మంగమ్మా. నన్ను పెంచుకోరాదూ? నిన్ను చూడటానికి నేనే రెండు పూటలా వస్తూ ఉంటాను".

కళ్లల్లో నీళ్లు – ముఖంలో నవ్వు మంగమ్మకు.

"ఇవాళ నాకు టిఫిన్ పెట్టలేదుకదూ?" గునిసాడు డాక్టరు.

"అవును బాబూ. ఇవాళ అన్ని వడలు చేయలేనన్న అధైర్యం తోచి పప్పు కొద్దిగా పోశాను. అదితొందరగా అయిపోయింది. నేను మూడు గంటలకే పొయ్యి ఎత్తేశాను. నేను దానిలోనే మీకు రెండు ప్లేట్లు ఉంచాను. ఎవరో తొందరగా నలుగురు వచ్చి తొందరపెట్టారు. ఉన్నవే సర్దిపెట్టాల్సి వచ్చింది.

"పోనీలే. రేపు పప్పు నిండుగా పోసి వడలు చెయ్యి. నాకు పెట్టకుండా మాత్రం ఖర్చు చెయ్యకు. ఎన్ని తిన్నా నాకు నీ చేతి వడలు తింటేనే గాని ఆకలి తీరదు. ముందే చెబుతున్నా" అన్నాడు.

"నిజమే బాబూ. నాక్కూడా మీకు పెట్టకుండా అన్నీ ఖర్చయిననాడు ఏదో లోపం జరిగినట్లు మనసు బాధపడుతుంది. ఇంక నుంచి అట్లా జరగనివ్వను బాబూ".

"నన్ను మీరు మీరు అంటూ దూరం చెయ్య కూడదు మరి. అమ్మను కొడుకునూ దూరం చేస్తుందా పిలుపు"

"అవును బాబూ అవును. ఇంక నుంచి అట్లా అనను".

మంగమ్మకు ఆ పప్పు దానికి తగిన మసాలా ఎప్పుడూ ఒక్క మాదిరిగా పడతాయి. ఒకో రోజు విసుగు పుడుతుంది. పరధ్యానంగా తయారు చేస్తుంది. అయినా అవి సమపాళంగా

కుదురుతున్నాయి.

ఋతువులు తిరుగుతున్నాయి ఒకదాని తరువాత ఒకటి. వెంకటసామిని ఆఫీసరు ట్రైనింగ్‌కని దూరపు ఊరికి పంపించారు బాంకువారు. వెళ్ళే ముందు ఒక రాత్రివేళ వచ్చాడు.

అతడిని గుండెకదుముకుని వెక్కి వెక్కి ఏడ్చింది మంగమ్మ. "నాయనా! నాయనా! నన్ను చూడడానికి వచ్చావా తండ్రీ. ఇవాళ ఎంత మంచి రోజురా. నిన్ను చూడగలిగాను" అతడి దేహమంతా నిమిరి నిమిరి తన మంచమ్మీద కూర్చోబెట్టుకుంది.

"నాయనా, కోడలు పిల్లలూ బాగున్నారా బాబూ? అప్పుడు చిన్న పిల్ల. ఇప్పుడు పెద్దదయి ఉంటుంది. మాటలూ నడకా బాగా వచ్చాయా? అబ్బాయి బాగా చదువుతున్నాడా?" ఆప్యాయంగా ఎన్నో వివరాలు అడిగినవే మళ్ళీ మళ్ళీ అడిగింది.

"అమ్మా. నేను ట్రైనింగ్‌కని దూరంగా మరో వూరు వెళ్తున్నాను. రెండేళ్ళకు వస్తానమ్మా ఆ తరువాత మళ్ళీ ఎక్కడ వేస్తారో నన్ను? నిన్ను చూడాలనే వచ్చానమ్మా. రేపు తెల్లవారకుండా వెళ్తాను. అమ్మా జాగ్రత్తగా ఉండు." అమ్మా అమ్మా అంటాడు ఆవేదనతో. అదేమిటో మాటల రూపంలో బయటికి రావటంలేదు. తల్లి కదా అని పదిసార్లు రావాలని మనసులో ఉన్నా రాలేని అశక్తతతో ఏమిటో అతడికే అర్థంకాలేదు.

తల్లి ఎంతో ప్రేమతో అతడికి ఇష్టమని తనకు తోచిన వంటచేసింది. కొసరి కొసరి వడ్డించింది. తనెప్పుడూ పెరుగు వేసుకోదు. డాక్టరు యింటి నుంచి ఒకకప్పు పెరుగు తెచ్చి వడ్డించింది. తన ఆప్యాయతనూ మమతనూ మాటల్లో చేతల్లో కురిపించింది.

తన కొడుకు తనను చూడటానికి వచ్చాడు!

తన మీద వాడికెంత ఆపేక్షో?

ఆ సంభ్రమంలో తబ్బిబ్బయి పోతున్న మంగమ్మ ఆ రాత్రంతా నిద్రపోలేదు. అతడు పడుకున్న మంచమ్మీద కళ్ళు తెరుచుకుని కూర్చుంది. తెల్లవారక ముందు లేచి వెంకటసామి స్నానం చేస్తాడని వేడినీళ్ళు కాగబెట్టి కాఫీ ఉప్మా తయారుచేసింది.

"నాయనా. నీ కోసం చేశానురా. కడుపు నిండా తిను. మళ్ళీ వచ్చేటప్పుడు ఇలాగే వచ్చి నీ తల్లిని చూసిపో" అంది అతడు బూట్లు వేసుకుంటుంటే.

"వస్తానమ్మా వస్తాను" తల్లి భుజాలమీద రెండు చేతులూ వేసి, ఆప్యాయంగా ఆమె కళ్ళల్లోకి చూశాడు.

వెంకటసామి కంటికి కనబడేటంతవరకూ చూస్తూ కన్నీళ్ళతో నిలబడిపోయింది మంగమ్మ.

"ఏంది మంగమ్మా. అట్లా నిలబడిపోనావు? ఇయ్యేళ వడలు ఉండవా అందరికీ?" అడిగాడు దారిన పోయే కూరగాయలవాడు.



# ఈ 'వేమన' పద్యాలు







గుణిని కోరిమేలు గోరంతజేసిన
కొండయగును వాని గుణముచేత
గుణవిహీనునకిల కొండంత మేలును
జేయువాని గుణము జెఱుచు వేమా.

"ఉంటాయి ఉంటాయి అలా అంటావేం? ఏమిటో అలా నిలబడి పోయాను అంతే అంతే" కొంగుతో కళ్లద్దుకుని లోపలికి నడిచింది మంగమ్మ

కొడుకు వచ్చిన రాత్రినే మరి మరి తలుచుకుంటూ కొన్నాళ్లు ఉత్సాహంగా గడిచింది. 'మంగమ్మకు కాస్త బెంగ తీరింది కొడుకు వచ్చి వెళ్లటంతో' అనుకున్నాడు డాక్టరు

కాలం దొర్లిపోతుంది వేగంగా - అతి వేగంగా.

మంగమ్మ కొడుకు వచ్చిన నాటి జ్ఞాపకాలు మరుగున పడిపోయినా ఆనాటి తన సంతోషాన్ని స్మృతిపథంలో నిలుపుకోవటానికి విఫల ప్రయత్నాలు చేయటం సాగించింది.

"మంగమ్మా ఏవీ వడలు రాలేదు. నన్ను మర్చిపోతున్నావా?" అని డాక్టరే ఒక సాయంత్రం

## వెర్రితల్లి - కడుపుతీపి

మంగమ్మ ఇంటికి వచ్చాడు. ఆయనతో పది రోజుల నుంచి మంగమ్మ ఏమిటోగా ఉంటోంది మతిలేనట్టుగా ఒకసారి వెళ్లి పలకరించి రండని" భార్య పదే పదే అంటోందని బయలుదేరాడు. ఆయన వచ్చేటప్పటికి మంగమ్మ మంచమ్మీద కప్పుకుని పడుకుని మూలుగుతోంది.

"ఏం మంగమ్మా, ఈవేళప్పుడు పడుకున్నావు? మూలుగుతున్నావెందుకు?" అడిగాడు ఆమె నుదుటి మీద చెయ్యి వేసి.

మంగమ్మ కళ్లు తెరిచి మళ్లీ మూసుకుంది. ఆమె దేహం వణుకుతున్నది. డాక్టరు థర్మామీటరుతో జ్వరం కొలిచి చూశాడు. నూట మూడు దాటుతున్నది జ్వరం తగ్గటానికి మాత్ర వేసి కప్పు కాఫీ తాగించాడు - తన ఇంట్లో పనిచేసేఆడ నౌకరిని ఆమె దగ్గర ఉంచాడు.

ఆ మరునాడు కూడా డాక్టరు వచ్చి చూస్తే మంగమ్మ పరిస్థితి అలాగే ఉంది. మరొక మాత్ర వేసి మంగమ్మకు మజ్జిగన్నం ఇంటి నుంచి తెప్పించి పెట్టించాడు ఆ రోజుకు మంగమ్మకు జ్వరం తగ్గింది. కాని మనుష్యులను గుర్తుపట్టలేక పోతున్నది. సందర్భములేని మాటలు మాట్లాడటం మొదలుపెట్టింది ఎన్ని ప్రశ్నలు వేసినా తగిన జవాబు చెప్పలేకపోతున్నది.

"ఏమిటి మంగమ్మా? లేచి కూర్చోగలవా? కళ్లు తెరిచి చూడు" డాక్టరు ఆమెను లేవదీసి కూర్చోబెట్టాడు. కాని ఆమెకు కూర్చునే శక్తిలేక మళ్లీ వాలిపోయింది డాక్టరు ఆమె శక్తిలేక వాలిపోతున్నదని ఒక ఇంజక్షను ఇచ్చి ఆమెను కనిపెట్టుకుని ఉండమని చెప్పి నౌకరు నుంచి వెళ్లాడు

నాలుగు రోజులపాటు ఆమె పాలు పండ్లరసం మజ్జిగన్నం తీసుకున్నది గాని అసందర్భంగా మాట్లాడటం పోలేదు.

'వెంకటసామీ, వచ్చావా? ఎన్నాళ్లకు వచ్చావురా? అమ్మను చూడాలనిపించలేదూ ఇన్నాళ్లూ? నేను చేసిన వంట బాగా లేదా? చిన్నప్పుడు ఇష్టంగా తినేవాడివి కదరా? నీకిష్టమేగా వడలు? నీ కోసమేరా రోజంతా చేస్తూ కూర్చుంటాను కోడలిని పిల్లలనూ తీసుకురారా వెంకటసామి. నీ కోసమేరా ఈ యిల్లు కొన్నది. కొంత పైకం కూడా బ్యాంకులో ఉండాలి. అంతా నీ కోసమేరా వెంకటసామి" ఈ మాటలే పదే పదే గొణుగుతూ ఉంటుంది ఎవరినీ గుర్తుపట్టే స్థితిలో లేదు. ఒక వారం రోజుల పాటు అదే స్థితిలో ఉంది.

డాక్టరుకి అనుమానం తోచింది. ఆమె పరిస్థితి దిగజారిపోతున్నదని గ్రహించాడు వెంకటసామి ఎక్కడున్నా వెంటనే తల్లి సంగతి తెలపమంటూ హెడ్ ఆఫీసుకు టెలిగ్రామ్ ఇచ్చాడు

ఆ రాత్రి కలవరింతలు ఎక్కువయ్యాయి. వెంకటసామి స్మరణ తప్ప మరొకటి లేదు. గొంతులో పోసిన పాలు సరిగా మింగుడు పడడంలేదు.

ఉదయం ఎనిమిది గంటలకు డాక్టరు చూడడానికి వచ్చాడు. వెంటనే నౌకరు లేచి "అమ్మా వెంకటసామి వచ్చాడు చూడండి" అంటూ రెండు మూడుసార్లు చెవిలో బిగ్గరగా చెప్పింది

అప్రయత్నంగా చేతులు చాపింది మంగమ్మ

"అమ్మా. నేను వచ్చాను. వెంకటసామిని చూడు. కళ్లు తెరు.అంటున్నాడు డాక్టరు.

వెంకటసామి వెంకటసామి .. ఎత్తబోయిన చేతులు వాలిపోయాయి మంగమ్మ కళ్లు తెరుచుకొనే ఉన్నాయి.

వెంకటసామిగా నిలబడిన డాక్టరు జాలిగా చూశాడు ఆమె వైపు. ఆయన కళ్లలో నీరు రెప్పలను దాటి చెంపల మీదుగా ధారలు కట్టాయి.

(అయిపోయింది)

# ట్రస్ట్

# మీ పళ్ళను అనేక విధములుగా సంరక్షిస్తుంది



ట్రస్ట్‌లోని చురుకైన పదార్థములు నోటి దుర్వాసనను దూరము చేసి మీ శ్వాసను తాజాగా ఉంచటమే గాక మీ పళ్ళను శుభ్ర పరచి తెల్లగా మెరిసేలా చేస్తాయి.

ట్రస్ట్ పళ్ళపొడిలోని ఫ్లోరైడ్ మీ పళ్ళ మీదఎనామిల్‌ను గట్టి పరచి, మీ పళ్ళను బలంగా ఆరోగ్యంగా ఉండేలా చేస్తుంది. ట్రస్ట్‌లోని నురుగు మీ పళ్ళను శుభ్రపరచి తెల్లగా మెరిసేలా చేస్తుంది.

ట్రస్ట్ లాంగ్ రీచ్ టూత్ బ్రష్ తక్కువ కృషితో మీ పళ్ళను సంపూర్ణముగా శుభ్రపరచును. దీని బ్రిసిల్స్ యొక్క మృదువైన చివర్లు మీ చిగుళ్ళను మర్దన చేసి మీ పళ్ళను శుభ్రముగా మరియు ఆరోగ్యముగా ఉంచును.







AKSHARA/330/TP

ట్రస్ట్

## సంపూర్ణ దంత రక్షణ

# బృందావనం

## మధురాంతకం రాజారాం

అసలింతకూ నేను బృందావనం వెళ్లడం ఎలా జరిగిందో చెబుతాను...

నాకొక పబ్లిషరు దొరికాడు – అంటే మీకది చాలా సాదా విషయంగా తోచవచ్చు. కాని నేనొక రచయితనని తెలిస్తే అందులోని విశేషమేమిటో మీకు బోధ పడక తప్పదు. భక్తుడికి భగవంతుడి పాదాలు ఎలాగో, నిరుద్యోగికి నచ్చిన ఉద్యోగం లభించడం ఎలాగో, అమ్మాయికి అనుకూలమైన సంబంధం రావడం ఎలాగో, రచయితకూ పబ్లిషరు దొరకడం చాలా గొప్ప విషయం. ఇంతకూ నాకు నేనై అతణ్ని వెదుక్కుంటూ వెళ్లలేదు. అతడే నన్ను పిలిపించాడు.

"మీ నవల ఒకటి వేయాలనుకుంటున్నానండీ! రెండు నెలల్లో ప్రెస్ కాపీ నా చేతిలో వుండాలి...." అన్నాడు.

రెండు నెలల్లో ఒక నవల రాసి ముగించడం సాధ్యం కాదనుకుంటే, ఒక మహదవకాశం చేయి జారిపోవడం ఖాయం. ఏ వృత్తిలో ఎదురయ్యే సవాళ్లు ఆ వృత్తిలో వుంటాయి. ఏకధాటిగా రాస్తే చెయ్యి నొప్పెడుతుందని, బుర్ర వేడెక్కుతుందని, పాత్ర పోషణ దెబ్బ తింటుందని – యిలా కుంటి సాకులు చెప్పడంలో అర్థం లేదు.

నా అంగీకారాన్ని పొందిన తర్వాత అడిగాడు పబ్లిషరు – "మరైతే సబ్జక్టు మాటేమిటి?"

అవునవును. నవల రాయాలంటే సబ్జక్టు అంటూ ఒకటి వుండి తీరాలి. అందుకని "పరవాలేదు. దొరక్కపోదు. ఆలోచిస్తాను లెండి" అన్నాను.

"అక్కర్లేదు. ఒక కథా వస్తువు రెడీగా వుంది. దాన్ని మీరు నవలగా రాసిస్తే చాలు..."

"మంచిదండీ! వస్తువు కోసం జీవితాన్ని తరచి చూడవలసిన పనిగానీ, సామాజిక సమస్యల్ని అవగాహన చేసుకోవలసిన శ్రమగానీ నాకు లేకుండా చేశారు. మీ మేలు జన్మజన్మాలకూ మరచిపోలేను. ఆ కథేమిటో సెలవివ్వండి" అన్నాను.

పది నిమిషాల్లో చెప్పి ముగించి "అయ్యా! ఇదేనండి సినాప్సిస్" అన్నాడాయన. "ఈ పాయింట్లు మనసులో వుంచుకుని రాసుకుంటూ పోండి, నవల తనంతటదే తయారైపోతుంది" అన్నాడు. నా శక్తి యుక్తుల పట్ల పబ్లిషరుగారికున్న విశ్వాసానికి నేనెంతో సంతోషించాను. కానీ అందుకు నేను అర్హుణ్ని కానని మాత్రం నాకు నికరంగా తెలుసు. పొర్టికోకు బాల్కానీకి తేడా ఏమిటో స్పష్టంగా తెలియనివారు కథను ఒక పెద్ద ప్రాసాదంలో ఎలా నడిపించగలడు? పేవ్‌మెంటు పైన నడుస్తూ రోడ్డు పైన వెళ్లే కారును ఒక ప్రయాణ సాధనంగా మాత్రమే గుర్తించిన వాడు తన కథను కారుల్లో ఎలా త్రిప్పగలడు? ఎవరిని గురించి రాయాలో వాళ్ల వేషభాషలు, నిత్యకృత్యాలు, అలవాట్లు, గుణదోషాలు, రాగద్వేషాలు, పరస్పర అనుబంధాలు మొదలైన వాటిని గురించి రచయితకు క్షుణ్ణంగా తెలిసి వుండాలి గదా! నేను పల్లెలో పుట్టి పెరిగాను. అక్కడే స్థిరపడ్డాను. పని మీద ఎప్పుడైనా పట్టణానికి వచ్చినా సాయంకాలానికల్లా తిరిగి పోవడం ఒక విధిగా పెట్టుకున్నాను. పల్లె ప్రాంతాలలోని రైతులు, కూలీలు, బడిపంతుళ్లు, వృత్తి పనుల వాళ్ళు, యింకా మరికొందరు అలాంటి వాళ్లే యింతవరకు నాకు కథా వస్తువును సరఫరా చేస్తూ వచ్చారు. శకునాలు పలికే బల్లిని కుడితితొట్టిలోకి తోసినట్టుగా మా పబ్లిషరు ఒక అలివిమాలిన పనిని నా నెత్తిపైన మోపారు. ఏది గతి నాకు?

ఈ పరిస్థితిలో మా వూరి హైస్కూల్లో హెడ్మాస్టరుగా పని చేసి రిటయిరైన రంగధామరావు గారు నన్ను ఆదుకున్నారు. ఒక శ్రీమంతుని భవంతిలో కొద్ది రోజులు మకాం పెట్టగలిగినట్టయితే అక్కడి వ్యక్తుల జీవన విధానమంతా యిట్టే ఆకళింపుకు వచ్చేస్తుందని చెప్పి, అందుకోసం ఒక ఏర్పాటు కూడా చేసి పెట్టారు.

ఆ శ్రీమంతుడి నివాస గృహమే బృందావనం.

ఆ ఇంటిని గురించి, ఇంటి ఖామందును గురించి రంగధామరావుగారు కొన్ని కీలకమైన అంశాలను చెప్పి వుంచారు.

"మునిసిపాలిటీ స్థాయిని అధిగమిస్తూ సిటీ కావడానికి అర్రులు చాస్తున్న .... నుంచి, కొంచెం దూరానికి విసిరి వేయబడి నట్టుంటుంది బృందావనం. లంకంత ఆవరణ మధ్య రెండంతస్తుల పెద్ద మేడ. మేడ చుట్టూ తీర్చి దిద్దినట్టుండే పూలతోట. ఆ యిల్లూ, ఆ ప్రదేశమూ ఎంతో చల్లగా, ప్రశాంతంగా, మనోహరంగా వుంటాయి. ఏ రచయితకైనా నాలుగు రోజులుండాలనిపించే చోటు" అన్నారాయన బృందావనాన్ని గురించి.

ఇంటి యజమానిని గురించి గూడా వివరించారు – "దినపత్రికలు చదివే వాడివి గనుక ఎప్పుడో ఒకప్పుడు, ఎక్కడో ఒకచోట నీకు ఎస్. వి. నారాయణప్పగారి పేరు తారసిల్లే వుంటుంది. పూర్తి పేరు సింధూరం వెంకటనారాయణప్ప. 'పేరులోన నేమి పెన్నిధి గలదయా' అని నువ్వనుకోవచ్చు. ఒప్పుకుంటాను. పేరులో పెన్నిధులుండవు. మరెక్కడుంటాయి? పొలాల్లో, తోటల్లో, బ్యాంకుల్లో, ఇనప్పెట్టెల్లో వుంటాయి. అవన్నీ నారాయణప్ప గారికి పుష్కలంగా వున్నాయి. చతుర్భుజాల్లా నలుగురు కొడుకు లతనికి! వాళ్లు గూడా తమకు తగిన బిజినెస్సు లేవో చేసుకుంటూ బాగా సంపాదిస్తున్నారు. ఇంటి యజమాని, ఆయన భార్య, నలుగురు కొడుకులు కోడళ్లు వాళ్ల బిడ్డలు, ఇంకా వచ్చిపోయే బంధుమిత్రులు – ఇంత మంది వుంటారు గదా! ఒకరితో ఒకరికి 'క్లాష్' రాకుండా అందరికీ అన్ని ప్రత్యేక ఆగారాలు – బెడ్‌రూం, డ్రాయింగ్ రూం, అటాచ్‌డ్ బాత్‌రూంలతో సహా! విశేష సందర్భాల్లో కుటుంబ సభ్యులందరూ ఒకచోట సమావేశం కావాలంటే అందుకోసం మినీ థియేటరు లాంటి చావడి, ఉమ్మడిగా ఒక డైనింగు హాలు... అయినా తినబోతుండగా రుచులు చెప్పడమెందుకు? వెళుతున్నావు కదా, చూస్తే నీకే తెలుస్తుంది...."

రావుగారు రాసి యిచ్చిన ఉత్తరం జేబులో పెట్టుకుని ఒక నాటి వుదయం ఎనిమిది గంటలప్పుడు నేను బృందావనం ఎదుట వాలిపోయాను.

గేటు లోపల చిన్న బెంచి పైన మరబొమ్మలా కూర్చున్నాడు గూర్ఖా. నేను కనిపించగానే అతడి పెదవులు కదిలాయి. 'క్యాహోనా?' అన్నాడు హిందీలో.

"అయ్యగారి కోసం వచ్చాను. ఆయన్ని కలుసుకోవాలి" అన్నాను.

"అయ్ గార్? గర్‌మే నహీ హై" అన్నాడు.

మంత్ర కవాటం మూసుకపోయింది. ఇంక దాన్ని తెరిపించే శక్తి నాకు లేదు. బహుశా ఈ నాటి కింక అతడు నోరు తెరవకపోవచ్చు.

వచ్చినంత దూరం తిరిగి వెళ్లాలంటే నగరంలోని బస్ స్టేషను కెంత లేదన్నా అయిదు కిలో మీటర్ల దూరముంటుంది. బస్సు గానీ, మరేదైనా వాహనం గానీ దొరుకుతుందేమోనని తారు రోడ్డు పైకి వచ్చాను. ట్రింగు, ట్రింగు మంటూ బెల్ వినిపించింది. తిరిగి చూచాను. ఒక సైకిలు రివ్వున నా ప్రక్కన్నుంచే దూసుకపోయి గేటు ఎదుట ఆగింది. గూర్ఖా అటెన్షనులో నిలబడి సెల్యూట్ చేశాడు. తర్వాత తలుపులు తీయడం కోసం గేటు వైపు నడిచాడు.

సైకిలు పైన వచ్చిన వ్యక్తి నన్ను చూచి క్రిందికి దిగాడు.

"ఏమండీ! ఎవరి కోసమైనా వచ్చారా?" అని పలకరించాడు.

బాబ్బాబూ! నువ్వెవరివో గానీ సమయ సంజీవిలా

దొరికావు – అనుకున్నాను. "అవునండీ! నారాయణప్ప గారి కోసం వచ్చాను. రిటయిర్డు హెడ్మాస్టరు రంగధామరావుగారు ఆయనకో ఉత్తరం రాసి యిచ్చారు" అన్నాను.

"అట్లాగా, అయితే రండి" అంటూ అతడు ముందుగా దారి తీశాడు. పూల మొక్కల నడుమ ఉదయకాలపు నీడలు పరచుకున్న సిమెంటు బాట గుండా నడుస్తున్నాము.

"రావు గారు బాగున్నారు కదండీ! చాలా రోజులయింది చూచి. ఏ రెండేళ్లకో, మూడేళ్లకో వస్తుంటారు. వచ్చిన రోజు రాత్రి ఆయనకు, మా అయ్యగారికి నిద్రుండదు. చిన్ననాటి సంగతులు నెమరు వేసుకోడంతో నే సరిపోతుంది. రావుగారి పైన మా అయ్యగారి కొకందుకు కోపం వుందిలెండి! ఎందుకంటే ఆయన ఈయన్నెప్పుడూ ఏ సహాయం కోసంగాని అర్థించలేదట! నీ డబ్బు, నీ హోదా నీ దగ్గరే వుండనీ. వాటితో నాకేమి అక్కర్లేదు – అనేది రావుగారి దృక్పథం. మొత్తం మీద భలే స్నేహితులు...."

బృందావనంలో యిలాంటి వ్యక్తి ఒకతను వున్నట్టు చెప్పనందుకు ఆ క్షణాన నాక్కూడా రావుగారి పైన కోపం వచ్చింది. అయితే అవతల వ్యక్తి ఆవులిస్తే ప్రేవులు లెక్కబెట్టే వాడు గావడం వల్ల నా పని కాస్త సుగమమైపోయింది.

"నేను నారాయణప్ప గారి పి. ఎ. నండి! నా పేరు లాజరస్" అంటూ అతడు నాకు సందేహ నివృత్తి చేశాడు.

"ఆయన యింట్లో లేరని గూర్ఖా మూలంగా తెలిసింది" అన్నాను.

"అవును. ఏదో కంపెనీ డైరక్టర్ల మీటింగుందని మద్రాస్ వెళ్లారు. సాయంకాలానికి రావచ్చు. అన్నట్టు మీ రేం పని మీద వచ్చారో? రహస్యం గాకపోతే నాతో చెప్పొచ్చు...."

"అబ్బే, రహస్యమేమీగాదు. రావుగారు కూడా కవరతికించకనే ఉత్తరం నా చేతి కిచ్చారు. చదివితే మీకే తెలుస్తుంది...."

ప్లాట్‌ఫారంలా ఎత్తుగా వున్న వసారాలో రోడ్డుకు అభిముఖంగా వున్న గదే లాజరస్ ఆఫీసు. అంతే వెడల్పున్న వసారాలో ఆ కట్టడం కుడి ఎడమలకు అర్ధచంద్రాకారంగా విస్తరించి వుంది.

సైకిల్‌కు తగిలించు కొచ్చిన సంచుల్లో నుంచి లాజరస్ రకరకాల వస్తువులను పైకి తీశాడు. కాలింగ్ బెల్ నొక్కగానే పరుగెత్తి వచ్చిన నౌకరుతో "ఇదిగో గంగన్నా! ఈ పెట్టె అమ్మగారి కివ్వు. ఈ పత్రికలు సులోచనమ్మ గారికి. ఈ పార్సెల్ హేమాదేవిగారికి. ఈ కేసెట్స్ తీసుకెళ్ళి చినబాబు గారి టేబిల్ పైన పెట్టు" అన్నాడు. ఆయా వస్తువులతో గంగన్న గుమ్మం దాటిపోయాక "ఏమోయ్ గంగన్నా! మాకు రెండు కాఫీలు" అని పురమాయించాడు.

కాఫీ వచ్చేలోగా అతడు రావుగారి ఉత్తరాన్ని చదివేశాడు. ముగింపు దగ్గరికి వచ్చేసరికి సన్నగా ఒక లేనవ్వు అతడి పెదవి పైన చిందులాడింది. "అయ్యగారితో పనిబడి ఎందరెందరో వస్తుంటారు. కాని యిలాంటి పనిమీద మాత్రం ఎవ్వరూ రాలేదు" అన్నాడు.

అతడి అభిప్రాయం పైన నేనేమి వ్యాఖ్యానించలేదు.

గంగన్న కాఫీలు పట్టుకొచ్చేసరికి లాజరస్ నా విషయంలో ఒకనిర్ణయం తీసుకోగలిగాడు – "గంగన్నా! ఇదిగోనయ్యా తాళం చెవి. తూర్పు వైపు గదుల్లో మొదటిది తెరువు. అక్కడేదైనా సర్దవలసి వుంటే చూడు. అదో, మేష్టరు గారి బ్రీఫ్ కేసు తీసుకెళ్లి గదిలో పెట్టు...."

"అతిథులకోసం బృందావనంలో నాలుగు గదులున్నాయి లెండి మేష్టరు గారూ!" నా వైపు తిరిగి కొనసాగించాడు– "అందులో అయ్యగారి కోసం ఎవరైనా వస్తే వుండే గది ఒకటుంది. అందులో మీరుండొచ్చు. ఎలాగూ మీరొక వారం రోజులైనా వుండాల్సిన పని గదా! మీ అవసరాలన్నీ గమనించే పూచినాదే! అందులో ఏదైనా లోపం జరిగితే అయ్యగారికి నేను జవాబు చెప్పుకోవలసి వస్తుంది. రండి. చెబుతాను...."

చెప్పడాని కేముంది! సర్వాలంకరణ భూషితురాలై విభునికోసం వేచివున్న వాసవసజ్జికలా ఆ గది నా కోసం సిద్ధంగా వుంది. దిన, వార పత్రికలు కొన్నిట్ని తెచ్చి లాజరస్ బల్లపైన పడేశాడు. "ఇదేనండీ గది! మీకేదైనా కావలిస్తే కాలింగ్ బెల్ నొక్కండి. గంగన్న పలుకుతాడు. కాఫీ, టిఫిన్లు యిక్కడికే వస్తాయి. మీరు డైనింగ్ హాల్లోకి వెళ్లి భోంచేసినా సరే. లేదా ఇక్కడికి తెప్పించుకున్నా సరే. గంగన్న తెచ్చి పెడతాడు. నేను మధ్యాహ్నం పన్నెండు దాకా



యిక్కడుంటాను. ఆపైన టౌనుకు వెళ్ళి అయిందిటికో, అరింటికో తిరిగొస్తాను. ఏమండీ మేష్టరు గారూ! సరేనా! మళ్ళీ కలుసుకుందాం...."

నియమబద్ధంగా పని తర్వాత పనిలోకి దూకే సర్కస్ మేనేజరులా లాజరస్ తన తరువాతి కార్యక్రమాన్ని గమనించడానికి వెళ్ళి పోయిన తర్వాత నేనా గదిలోని పేము కుర్చీలోకి ఒదిగి పోయాను. కానీ ఊరికే కూర్చోడం సాధ్యం కాదు గదా! కిటికీలు చూచాను, కిటికీలకు గట్టిన తెరల్ని చూచాను. గోడల్ని చూచాను, గోడలకు తగిలించిన చిత్రపటాల్ని చూచాను. పాలుబోసి పాలెత్తుకోవచ్చునని పిస్తున్న గది నేల వైపు చూచాను. దానిపైన పరచిన తివాచీని చూచాను. అద్దంలా మెరిసి పోతున్న పైకప్పును చూచాను, ఆ పైకప్పు నుంచి వ్రేలాడుతున్న దీప సముదాయాన్ని చూచాను. ఇంకా సోఫాలు, మంచం, పరుపు, నిలువు టద్దం, వాష్ బేసిన్, నీళ్ల కూజా లాంటి వస్తు సామగ్రినంతా చూచాను. ఒక చిన్న సైజు మ్యూజియంలో వున్నట్టే వుంది అప్పటి నా పరిస్థితి. ఒక అరగంట క్రితం నడి రోడ్డుపైన నిరాశ్రయుణ్ణిగా వున్నవాణ్ణి, యిప్పుడీ గదిలో వుండడం తలచుకుంటే అదొక నమ్మరాని విషయంగానూ, పరమాద్భుతమైన ఉదంతంగానూ తోస్తూ వుంది.

కొంతసేపు పత్రికలు తిరగేశాను. చేతిలోని పత్రికను అలాగే జారవిడిచి కుర్చీలోనే కునుకు తీశాను. భోజనం గదిలోకే తెప్పించు కున్నాను. తిని లేచేసరికి భుక్తాయాసం ముంచు కొచ్చేసింది. రెక్క తలుపులు ఒర వాకిలిగా వేసి సోఫాపైన సోలిపోయాను. గాఢంగా నిద్ర పట్టేసింది. మెలకువరాగానే వులికి పడ్డట్టుగా వాచీ వైపు చూచుకున్నాను. గంట నాలుగున్నరయింది. నేను నిద్రలో వుండగా గంగన్న గదిలోకి వచ్చి వెళ్ళి నట్టున్నాడు. టీపాయ్ పైన ఫ్లాస్కు కనిపించింది. కానీ లేచి వెళ్ళి ఫ్లాస్కులోని కాఫీ తీసుకోడానికి సైతం బద్ధకం అడ్డు తగిలింది. కనురెప్పలు మళ్ళీ బరువెక్కి క్రిందికి వ్రాలి పోయాయి. అలా కొద్ది నిమిషాలు గడచి వుండొచ్చు. నిశ్చల కాసారంలో

# బృందావనం

చిన్న గులకరాయి ఒకటి పడి మెల్ల మెల్లగా అలలు బయల్దేరినట్టుగా దగ్గర్లో చిన్న కదలిక ఏదో వినిపించినట్టై కళ్ళు తెరిచాను. మల్లె పందిరిలో ఆకుల చాటు నుంచి ఈవలికి వచ్చిన ఒకే ఒక మల్లె మొగ్గలా, తోటంతా తిరిగి తిరిగి చివరకు పొదరింటి పూల రెమ్మపైన వాలిన సీతాకోక చిలుకలా ఒక ఆరేడేళ్ల అమ్మాయి – కడిగిన ముత్యంలా కుర్చీలో కూర్చుని వారపత్రికలో బొమ్మలు చూస్తోంది.

ఉన్నట్టుండి మనసులో కొన్ని విచిత్రమైన ఊహలు పుదుతుంటాయి. అందుకు కారణ మేమిటో స్ఫురించదు. ఆ అమ్మాయి కనిపించేసరికి నాకు చేజారిన అమూల్యమైన వస్తువేదో దొరికినట్టయింది. ఎండ దెబ్బ తగిలిన వాడికి చల్లటి ఆశ్రమం లభించినట్టయింది. దాహంతో నాలుక పిడచ గట్టుక పోయినవాడికి చలిచెలమ ఒకటి చేరువకు వచ్చినట్టయింది.

"అమ్మాయ్! నీ పేరేమిటమ్మా?" అని అడిగాను.

పత్రికలో నుంచి తల పైకెత్తకనే, ఒక కంటిని మాత్రం నా వైపు త్రిప్పి ఆ పాప చెప్పింది – "రాధిక"

"గుడ్. బాగుందమ్మా! బృందావనిలో రాధిక– అందమైన ఒక బాలిక– నవ్వడిలేని పూలతోటలో రవళించెను ఒకగీతిక...."

ఆ పాప కళ్ళు పెద్దవై పోయాయి. వారపత్రిక మూసేసింది. – "ఏమండీ! మీరు పాటలు చెప్పేస్తారా అండీ?"

"ఎప్పుడైనా నోటి కొస్తే చెప్పేస్తాను. కానీ ఇప్పుడిది నేను చెప్పింది గాదు. నువ్వే చెప్పించుకున్నావు...." అన్నాను.

కాసేపు తటపటాయించి ఆమె అడిగింది– "ఏమండీ! ఆ పాట నాకు రాసిస్తారా? కాన్వెంటులో పాటల పోటీ జరిగితే పాడ్డానికి...."

"ఇది నిన్ను చూచి ఇతరులు పాడే పాటమ్మా! కావలిస్తే నువ్వు పాడే పాటలు మళ్ళీ తిరిగ్గా రాసిస్తాను... అన్నట్టు బడికి సెలవులా ఏమిటి? ఇంటి దగ్గరే వుండి పోయావే...."

"మా కాన్వెంటుండడం యిక్కడ కాదండీ! బెంగుళూర్లో. నాకు జబ్బొచ్చిందిగా! మా డాడీ యింటికి తీసుకొచ్చేశారు."

పాప నీరసంగా వుండడానికి, ముఖం పాలిపోయి వుండడానికి కారణం బోధపడింది. "ఏం జబ్బొచ్చిందమ్మా? నయమై పోయింది గదా? పథ్యం పుచ్చుకుంటున్నా వేమిటి?" అని అడిగాను.

"ఇంకా పదేను రోజుల దాకా కాన్వెంటుకు వెళ్ళొద్దన్నారు– డాక్టరు గారు. ఏమండీ! మీరు పాటలేనా, కథలు గూడా చెబుతారా?"

"నీకు వినాలనుంటే కథలు గూడా చెబుతానమ్మా! ఎలాంటి కథలు కావాలి నీకు?"

పాత జ్ఞాపకాలేవో నెమరు వేసుకుంటున్నట్టుగా పాప ఆలోచనలో పడి పోయింది. ఆ ఆలోచన ఒక కొలిక్కి రావడానికి కొద్ది నిమిషాలు పట్టింది. "ఏమండీ! తల్లిని కాపాడిన రాజకుమారుడి కథ తెలుసా మీకు? కాన్వెంటులో మా టీచరు చెప్పింది. సాయంకాల మైందట. పొద్దు పోయిందట. చీకటి పడిందట. చుట్టూరా కొండలేన్న. మధ్యలో దారి. ముందుగా పల్లకి పోతోందట. వెనుకన్నే గుర్రంపైన రాజకుమారు డొస్తున్నాట్ట. అప్పుడే మైంది? దొంగలు సింబొగ్గుల నల్లగా, యింతింత లావు మీసాలతో, కేకలేస్తూ వొచ్చి వొచ్చి పల్లకి మీదపడ్డార్ట. అప్పుడేమో రాజకుమారుడు కత్తి తీశాట్ట. దొంగలపైన దూకాట్ట. ఏటు కొక్కణ్ణి నరికేశాట్ట. ఏమండీ! అలాంటి రాజకుమారుడి కథ తెలుసా మీకు?"

"తెలుసమ్మా! కానీ అది చాలా పెద్ద కథ. ఇప్పుడు కాదు. రేపుదయం నువ్వొస్తావా యిక్కడికి?"

"వస్తానుగా! మరిచేపోను. కథలంటే నాకు చాలా యిష్టం. పోనీ, ఇప్పుడొక ఆటుంది. భలే తమాషా ఆటది. మీరొకదాన్ని మనసులో తల్చుకోవాలి. అదేమిటో నేను చెప్పేస్తాను...."

కొద్ది క్షణాలాలోచించి నేనన్నాను– "అట్లాగేనమ్మా! తల్చుకున్నాను...."

"ఇప్పుడు నేను కొన్ని ప్రశ్న లడుగుతాను. అవును, కాదు, వుంది, లేదు అని మాత్రం జవాబు చెప్పాలి...."

"అట్లాగే!"

"మీరు తల్చుకున్న దానికి ప్రాణముందా?"

"ఉంది."

"దానికి రెండు కాళ్ళుంటాయా?"

"ఊఁహూ...."

"నాలుగు కాళ్ళుంటాయా?"

"ఉంటాయి...."

"అది అడివిలో వుంటుందా?"

"ఊఁహూ...."

"ఊళ్లో వుంటుందా?"

"ఉంటుంది."

కాసేపు ఆలోచనలో పడిపోయాక అడిగింది, "అదెక్కువగా వీధుల్లో వుంటుందా? అంటే ఇంటికి బయటుంటుందా అని"

"ఊఁహూ."



"ఇంట్లో వుంటుందా?"

"అవును."

"తెల్సిపోయింది. చేతులు తడుతూ అంది పాప 'అది పిల్లి!'"

"భలే, భలే! ఎలా కనిపెట్టేశావమ్మా!" అంటూ నేనూ నవ్వేశాను.

"ఇప్పుడు నేను తల్చుకుంటాన్న. మీరు చెబుతారా?" మళ్ళీ ప్రారంభించింది పాప.

"సరేనమ్మా! మరి నేనోడిపోతే నువ్వు నవ్వగూడదు."

"అబ్బే. మీరోడిపోరుగా! గెలుస్తారు. నాకు తెల్సు. ఉండండి. నేనో కటితల్చుకున్నాను...."

"మంచిదమ్మా! దానికి ప్రాణముందా?"

"లేదు." ఎంతో గుంభనంగా చెప్పింది జవాబు.

నా గొంతుకలో వెలక్కాయ పడ్డట్టయింది. ప్రాణం లేని వస్తువులు ప్రపంచంలో చాలా వున్నాయి. రాళ్ళు, ఇళ్ళు, కుర్చీలు, బల్లలు, బట్టలు....

"ఫస్టయింగదా! మీకు తెలిసుండదు. నేను చెప్పిస్తా నంకుల్! అది నేలపైన వుంటుందా అని అడగాలి."

"సరేనమ్మా! నీ అడుగుజాడల్లోనే నడుస్తాను. అది నేలపైన వుంటుందా?"

"ఊఁహూ."

"నీటిలో వుంటుందా?"

"ఊఁహూ."

ఏమిట్రా యిది! నేలా నీరూగాక ఈ భూ ప్రపంచకంలో యింకే ముంది? ఆఁ! జ్ఞప్తి కొచ్చింది. "ఏమమ్మా! ఆకాశంలో వుంటుందా అది?"

"ఊఁ. ఉంటుంది."

"పగల్లో కనిపిస్తుందా?"

"ఊఁహూ."

"రాత్రుల్లో?"

"వొచ్చేస్తున్నారూ. దగ్గిరి కొచ్చేస్తున్నారూ. రాత్రులో కనిపిస్తుంది...." ధీర్ఘాలు తీస్తూ అంది పాప.

విజయగర్వంతో నేనడిగాను– "ఏమమ్మా! అది పిల్లలందరికి నేస్తమా?"

"భలే భలే! మీ రోడి పోలేదు. కనిపెట్టేశారు...."

"ఈ ఆట చాలా బాగుందమ్మా! నేనిక్కడి నుంచి వెళ్ళాక మా ఊళ్ళో వాళ్ళ కందరికీ నేర్పిస్తాను...."

"మీకు నేను ఆట నేర్పించానా! మీరు నాకు కథ చెప్పాలి అంకుల్!"

"చెబుతానమ్మా! రేపుదయం నువ్వు రావడమే తరువాయి."

"ప్రామిస్...." పాప చెయ్యి సాచింది.

చేతిలో చెయ్యి వేసి "ప్రామిస్‌గా చెబుతాను" అన్నాను.

"వొస్తానంకుల్! గుడీవినింగ్...."

ఆ నాటి సాయంకాలం ఆరు నుంచి ఎనిమిదింటి దాకా నాకు లాజరస్‌తో కాలక్షేపం జరిగింది. నేనతడి గదిలో వుండగానే మదరాసు నుంచి ఫోను వచ్చింది. నారాయణప్పగారు ఏదో కోర్టు వ్యవహారంపైన



వినాయకుడు
చిత్రకారుడు: బి. వెంకటేశ్వరరావు

## బృందావనం

మదరాసు నుంచి అట్నాగే హైదరాబాదు వెళ్తున్నారట. రెండు మూడు రోజుల్లో తిరిగొస్తారట. "రంగధామరావు గారు ఒకాయన్ని మీ దగ్గిరికి పంపారు. ఆయన కొద్ది రోజులు మన యింట్లోనే వుంటారు. ఇప్పుడిక్కడే వున్నారు. మాట్లాడుతారా?" అని అడిగాడు లాజరస్. 'వద్దొద్దు. తరువా తొచ్చి మాట్లాడతాను. ఆయన కన్ని వసతులూ కుదిరేటట్టు చూడు" అన్నారట నారాయణప్పగారు.

రాయల్ గెస్టునుగా నాకు లాజరస్ ద్వారా లాంఛన ప్రాయమైన గుర్తింపు లభించింది. ఇప్పుడా ఫర్మా న్పైన నారాయణప్ప గారి ఆమోదముద్ర గూడా పడింది. ఇంక పరవాలేదు. చొచ్చుకపోవచ్చు.

"ఏమండీ లాజరస్ గారూ! నన్ని యింట్లో వాళ్ళకు పరిచయం చెయ్యగూడదా?" అని అర్థించాను.

"మేష్టరుగారూ! నేనూ అదే ఆలోచిస్తున్నా. నారాయణప్పగారి నలుగురు కుమారుల్లో యిప్పు డొక్కరు మాత్రమే ఊళ్ళో వున్నారు. పెద్దబ్బాయి కంట్రాక్టరు. ఆయన నెల్లూరులో ఒక సినిమా థియేటరు కట్టిస్తున్నారు. ఇంటి కెప్పుడు వస్తాడో, ఎప్పుడు వెళ్తాడో చెప్పలేము. రెండో అబ్బాయిది వ్యవసాయ శాఖ. ఆయన ట్రాక్టరు కొనుక్కురావడం కోసం కోయంబత్తూరు వెళ్ళాడు. ఆయన తిరిగి రావడం వెళ్ళిన పని పూర్తి కావడంపైన ఆధారపడి వుంటుంది. మూడో అబ్బాయి కిక్కడే ఎలక్ట్రికల్ గూడ్స్ వ్యాపారం. ఉదయం టిఫిన్ చేసి వెళ్తే యిక రాత్రి పది గంటల తర్వాతనే ఆయన తిరిగి రావడం. మధ్యాహ్న భోజనం కారియర్‌లో వెళ్ళి పోతుంది. పోతే చినబాబు సంగతి. ఈయన రకరకాల ప్రయోగాలు చేసి చివరికి ఐసు ఫ్యాక్టరీలో స్థిరపడ్డాడు. ఇటీవలే ఒక కారు కొన్నాడు లెండి! ఈ యింటికది అయిదో కారు. ఈ రోజు తెల్లవారు జామున కొత్త వెహికల్‌ను తీసుకుని తిరుపతి కొండకు వెళ్ళాడాయన– స్వామివారికి అర్చన చేయించడం కోసం...."

"పోనీ, సాహిత్యాభిరుచి కలిగిన వాళ్ళెవరైనా వుంటే చెప్పండి...." అన్నాను. రచయిత ఉనికికి యింత పరిగణన, మన్నన లభించేది పాఠకుడి సాన్నిధ్యంలోనని నా నమ్మకం.

"సాహిత్యం! అంటే పత్రికలు చదివే వారిని గురించా మీరడిగేది! రావడానికి యింటికి అన్ని పత్రికలూ వస్తాయి. కానీ నాకు తెలిసి సినిమా పత్రికలకే డిమాండు ఎక్కువ. హేమాదేవిగారు ఇంగ్లీషు పత్రికలు మాత్రమే చూస్తారు. తెలుగు పత్రికల కోసం ఎదురు చూచేది ఒక సులోచనమ్మ గారే. ఏజంటు పంపేదాకా ఆమె ఓపిక పట్టదు. సీరియల్ నవల లంటే ఆమెకు చాలా యింటరెస్టు. సస్పెన్సు, హారర్ అంటే మరీనూ...."

కోటలో ప్రవేశించాలని నా ప్రయత్నం. ఏవైపు నుంచి ప్రవేశించాలన్నా కవాటం మూసేవుంది.

"ఏమండీ లాజరస్ గారూ! ఈ యింట్లో అందరూ ఒకచోట కూర్చుని భోజనం చేయడంగానీ, కలిసి మాట్లాడుకోడంగానీ ఎప్పుడైనా వుంటుందా?" అని అడిగాను.

"ఎందుకుండదు? ఉగాది నాడందరూ కలిసి భోం చేశారు. ఇక దీపావళికే! అన్నట్టు వాళ్ళలో వాళ్ళ కేమీ విరోధాలు లేవండీ బాబూ! అస లందుకు చోటే లేదు. వంట చేయడానికి, వడ్డించడానికి మనుషు లున్నారు. ఎవరి కిష్టమైనప్పుడు వాళ్ళు వెళ్ళి భోజనం చేస్తారు. ఎదురైతే పలకరించు కుంటారు. విడిపోతే పట్టించుకోరు. అసలొక వస్తువు లేకపోతేనే గదండీ దానికోసం వెంపర్లాడడం! అన్నీ వున్నప్పుడు యింక పేచీ ఎందు కుంటుంది? పోతే కాలం గడవడ మెలాగంటారా? అందుకుండనే వున్నాయి గదా రేడియోలు, టేప్‌రికార్డర్లు, టి.వీ.లు, వీడియోలు...."

లాజరస్‌ను వదిలిపెట్టి నేను నా గదిలోకి వచ్చేశాను. గంట తొమ్మిది కాబోతుండగా గంగన్న వచ్చి, "భోజనం గదిలోకి తెమ్మంటారా?డైనింగ్‌హాలు కొస్తారా?" అని వాకబు చేశారు. అతని కంఠంలో ఆర్ద్రత లేదు. "ఇది నా పని. దీన్ని నెరవేర్చడం నా బాధ్యత, అన్న కర్తవ్యస్ఫురణ మాత్రమే వుంది.

ఆ ముచ్చట గూడా తీర్చుకుందామని గంగన్న వెంట డైనింగుహాల్లోకి వెళ్ళాను. నేను వెళ్ళేసరికి అక్కడ యిద్దరు మహిళలు భోజనం చేస్తున్నారు. వాళ్ళు నావైపు ఎగాదిగా చూచారు. తరువాత ఒకరివైపొకరు చూచుకున్నారు. ఆగంతుకు డెవరో నాకు తెలియదంటే నాకు తెలియదన్న భావం ఆ చూపుల్లో ధ్వనించింది.

"చపాతీలు, ఇడ్లీలు, భోజనం. ఏది పెట్ట మంటారు?" అన్నాడు వంట మనిషి. ఇడ్లీలే పెట్టమన్నాను. ఒక యిడ్లీ తిని తిరిగి చూచేసరికి కుర్చీలు ఖాళీగా వున్నాయి. ఇందాకా అక్కడ భోజనం చేస్తూ వుండినవాళ్ళు వీలైనంత వేగిరంగా ఆ పని ముగించి వెళ్ళి పోయారేమోనన్న అనుమానం ఒక్కపట్టాన నన్ను వదిలిందిగాదు.

రాత్రి పడుకోడానికి ముందుగా నా నోట్‌బుక్‌పైకి

తీసి అందులో కొన్ని ముఖ్యమైన అంశాలు వ్రాసుకున్నాను. 1. పన్నెండు గంటల క్రితం నేనీ యింట్లో ప్రవేశించాను. అప్పటినుంచీ నా పాలిటికి కాల చక్రం ఆగి పోయినట్టుంది. 2. ఇక్కడ నాకు సమకూరిన సదుపాయాల్ని తప్పు పట్టి జూడడం చెక్కర తిని చేదనడమే! ఎటొచ్చీ మొదటి తరగతి రాజకీయ ఖైదీకన్నా నా పరిస్థితి మెరుగ్గా లేదు. 3. ఈ యింటికి సంబంధించిన విలక్షణం యిక్కడ మనుషు లున్నారనేందుకు దాఖలా లేకపోవడమే! ఎంతో జాగ్రత్తగా ఆలకిస్తే మాత్రం ఎప్పుడైనా వినిపించే అడుగుల చప్పుడు, వంటింట్లో పాత్రలు కడిగే శబ్దం, ఉండి వుండి తోటలో నుంచి వినిపించే పక్షుల కూతలు, గాలిని కోస్తున్నట్టుగా మేడ దగ్గరికి వచ్చి, మళ్ళీ అట్లాగే దూరమై పోయే కార్ల అలికిడి, యిది తీసేస్తే యిదొక స్వప్న ప్రపంచం. 4. ఇట్లాగే వారం రోజులు గడిస్తే నా బుద్ధి గూడా స్వప్నమై పోయే ప్రమాదం వుంది. ఈ ప్రమాదం నుంచి నన్ను రక్షించ గలిగితే ఒక ఏడేళ్ళ అమ్మాయి మాత్రమే రక్షించాలి....

మరునాటి ఉదయం నాకు చాలా ఆలస్యంగా పది గంటలకు తెల్లవారింది. బాల భానుబింబం "రాధిక" అనే అమ్మాయి రూపంలో ప్రత్యక్షమై గదిలో వెలుగులు విరజిమ్మింది.

"ఏమమ్మా! ఇక్కడ నాకేమి పాలుపోవడం లేదు. ఎప్పు డెప్పు డొస్తావా అని ఎదురు చూస్తున్నా! ఇప్పుడా రావడం? ఎందుకమ్మా ఆలస్యం?" పసిపాపతో నిష్ఠూరాలాపాలు ఆడగూడదన్న యింగితం గూడా నాకు లేకపోయింది.

"రాత్రి నాకు "లయిటు"గా జొర మొచ్చిందట! మమ్మి నన్ను కదలకుండా పడుకోమని చెప్పింది...."

"మరైతే నువ్వొచ్చేశావే!"

"మమ్మీ లేదుగా! ఇందాకా కారు శబ్దం వినిపించలా, అందులో ఎళ్ళి పోయింది. నేను మెల్లగా లేచొచ్చేశాను...."

"అయ్యో. అట్లాగా! నేను నువ్వింకా మరిచి పోయావేమో అనుకున్నాను...."

"లేదంకుల్! కథ చెప్పరూ? రాజకుమారుడి కథ...."

"చెబుతానమ్మా! నువ్వు ముందా కుర్చీలో కూచో...."

పేము కుర్చీ పెద్దది. పాప చిన్నది. కుర్చీలో పాప బుడుంగున మునిగిపోయి నట్టయింది.

"అమ్మాయ్ రాధికా! నువ్వెప్పుడైనా బాల నాగమ్మ అనేపేరు విన్నావా?"

తెలియదన్నట్టుగా క్రింది పెదవి ముందుకు సాచి, అడ్డంగా తలాడించింది రాధిక.

"పానుగంటి పట్నానికి ఏడుగురు రాజులు. ఆ ఏడుగురు రాజులకూ ఏడుగురు రాణులు. రాజుల్లో చిన్న రాజు కార్యవర్ధి రాజు. రాణుల్లో కడగొట్టు రాణి బాలనాగమ్మ. ఆ బాలనాగమ్మ ఎటువంటిది? గొప్ప సౌందర్యవతి. అంటే ఎంతో అందంగా వుంటుందన్న మాట! ఆమె అందచందాలను గురించి మాయల మరాఠీకి తెలిసింది. మాయల మరాఠీ అంటే ఎవరు? పరమ దుర్మార్గుడు. జడల జుత్తు, జీబురు గడ్డం, మిడిగ్రుడ్లు – అమ్మో, వాడి పేరు చెబితే పసిపిల్లలు పాలు తాగేవాళ్ళు కారు. మంత్ర తంత్రాల్లో వాడు నిపుణుడు. తలచుకుంటే వాడు మట్టి ముద్దను రవ్వలడ్డుగా మార్చెయ్య గలడు. వేపాకుల్ని ఎర్ర తేళ్ళుగా మార్చెయ్య గలడు. రాతిని కోతిగా మార్చెయ్య గలడు. అలాంటి మాయల మరాఠీ మారు వేషం వేసుకుని, శంఖం ఒకటి చేతబట్టుకుని, శంభో శంకర.... శంభో శంకర అనుకుంటూ బాలనాగమ్మ కోసం బయల్దేరాడు...."

అమ్మాయి కళ్ళల్లో ఆందోళన.

"అప్పుడు పానుగంటి పట్నంలో ఒక్క రాజైనా లేడు. అందరూ యుద్ధానికి వెళ్ళి పోయారు. మాయల మరాఠీ రాచనగరు ముందు నిలబడి "శంభో శంకర" అంటూ శంఖం పూరించాడు. పెద్ద రాణి భిక్షం తీసుకొచ్చింది. "ఛీ, పో. సంతానం లేని స్త్రీ భిక్షం పెడితే నేను స్వీకరించను" అన్నాడు. ఏడుగురు రాణుల్లోనూ అప్పటికి బిడ్డతల్లి బాలనాగమ్మ మాత్రమే. ఆమె భిక్షం తీసుకొచ్చింది. మాయల మరాఠీ జోలిలో నుంచి మంత్ర దండాన్ని పైకి తీసి ఓం హ్రీం క్లీం అంటూ మంత్రాన్ని బాలనాగమ్మ పైకి ప్రయోగించాడు. ఆమె నల్ల కుక్కగా మారిపోయింది. మెడకు తాడు తగిలించి ఆ నల్ల కుక్కను లాక్కుంటూ మాయల మరాఠీ తాను నివసించే నాగళ్ళపూడి గట్టుకు వెళ్ళి పోయాడు...."

ఈ కొట్టడంలో క్రమ క్రమంగా స్థాయి తగ్గుతూ రావడం గమనించి, ఒకటి రెండు క్షణాలు ఆగి, "అమ్మాయ్, రాధికా! వింటున్నావా?" అని హెచ్చరించాను.

పాప వులికి పడింది. "వింటున్నా, వింటున్నా నంకుల్!" అంటూ కుర్చీలో సర్దుకుని కూర్చుంది.

కానీ బాలవర్ధి రాజు పెరిగి పెద్దవాడై, తల్లిని చెర విడిపించడం కోసం బయల్దేరి, దారిలో పులిరాజు పట్నం చేరుకునే సరికి, రాధిక పూర్తిగా అవశురాలై నిద్రలోకి జారి పోయింది.

దగ్గరికి వెళ్ళి చెంపపైన చేయి వేసి చూచాను. ఒళ్ళు వెచ్చగా వుంది.

కాలింగ్ బెల్ నొక్కగానే గంగన్న పరుగెత్తు కొచ్చాడు. అమ్మాయిని తీసుకెళ్ళి మంచం పైన పడుకో బెట్టమన్నాను.

అప్పటి నుంచి ఒక ప్రశ్న నన్ను వెంటాడసాగింది. బిడ్డ ఈ స్థితిలో వుండగా, తల్లి ఆమెను వదిలి పెట్టి యింటినుంచి బయటకు ఎలా వెళ్ళగలిగింది? ఆ రోజు సాయంత్రం లాజరస్‌ను అడిగాను. అలవాటు పడిపోవడంవల్ల అక్కడి వ్యవహారాలన్నీ చాలా సహజంగానే వున్నట్టు అతనికి తోస్తున్నాయి.

"మేష్టారుగారూ! ఏమనుకున్నారో మీరు?హేమాదేవి గారంటే లేడీస్ క్లబ్ సెక్రెటర్ కదండి! ఈ నెలాఖర్లో ఎప్పుడో వాళ్ళ యానివర్సిరి వుందట! ఆమె కెన్ని పన్లుంటాయి, ఏంకథ! నారాయణప్పగారి కోడలన్నాక సోషల్ యాక్టివిటిస్ లేకపోతే ఎలాగండి! ఒకవేళ ఆమె వదులుకోవాలంటే మాత్రం లేడీస్ క్లబ్బువాళ్ళు ఆమెను వదిలి పెడతారా? ఎం. ఎ. దాకా చదువుకున్నావిడ సెక్రెటర్‌గా వుందంటే క్లబ్బుకెంత పరువు, ఎంత ప్రతిష్ఠ......"

నా ప్రశ్నకు, తన సమాధానానికి పొంతన కుదరలేదని అతడు కొంచెం ఆలస్యంగా గ్రహించినట్టున్నాడు. అందుకని మళ్ళీ కొనసాగించాడు–" బిడ్డకు జబ్బుగా వుందే అనుకోండి! దగ్గర తల్లి వుండిమాత్రం ప్రత్యేకంగా చేయగలిగిందేముంది? ఫోన్‌చేస్తే డాక్టరొచ్చి మందులిచ్చి వెళ్తాడు. పాలు, బ్రెడ్డూ యిస్తూ చూపెట్టుకోడానికి పనిమనుషులుండనే వున్నారు....."

ఏ ప్రశ్నకైనా లాజరస్ దగ్గర రెడిమేడ్ సమాధానాలున్నాయి. ఒక సందర్భంలో నేను నోరుజారి "ఇంత పెద్ద యింట్లో పది పన్నెండుమందిదాకా బిడ్డలుండి వుండొచ్చు. ఇదొక పెద్ద వెలితిగా తోస్తూ వుంది" అన్నాను. లాజరస్ నవ్వేశాడు–" భలేవారే? బిడ్డలు లేకేమండోయ్! వాళ్ళు రెసిడెన్సియల్ స్కూళ్ళల్లో, కాన్వెంటుల్లో వున్నారు. సెలవులొస్తే అమ్మమ్మగారి యిండ్లకు, యింకా బంధువుల ఊళ్ళకూ వెళ్తారు.






పనిని సాధించడానికి పట్టుదల ఎంతో అవసరం. అది ప్రజోపయోగకరమైన పని విషయంలోనూ, సత్కార్యాచరణలోనూ ఉండడం ఉత్తమం. అనవసరమైన విషయాల జోక్యంలోనూ, నిష్ప్రయోజనమైన వాటిలోనూ ఉంటే శ్రమ, చెడ్డపేరు, వ్యయం మాత్రమే మిగులుతాయి. పనిపాటలు లేక, అనాయాసంగా లభించిన ఆహారం తిని, అది అరగక లేనిపోని కయ్యాలకు దిగేవారు మూర్ఖపు పట్టుదలలు పట్టి చిక్కులకు పాలుకావడం చూస్తున్నాం. ఎవరినో ఒక వ్యక్తిని పురస్కరించుకొని అతనికి ఆస్తి ఉన్నదా? అప్పు ఉన్నదా? అతడు మంచివాడా? చెడ్డవాడా? అనే అంశాలపై వాద వివాదాలకు దిగి, ఎదుటి వారితో కలహాలు పెట్టుకొని, కోర్టులకెక్కి కష్టాలను అనుభవించే మూర్ఖులు ఎందరో ఉన్నారు. అట్టివారి కోవలో చేరి మొండి పట్టుదల పట్టి, వ్యయ ప్రయాసలకు లోనయి గౌరవం పోగొట్టుకొనకుండా ఉండడం ఉత్తముల లక్షణం.

మొండి పట్టుదలవలన అనర్థానికి మన పురాణ గాథలే ప్రబల సాక్ష్యం. "భూలోకంలో ఎట్టి పరిస్థితిలోనూ ఆడితప్పని రాజు ఎవరు?" అని దేవతల రాజు ఇంద్రుడు సభ్యులను ప్రశ్నించినప్పుడు "హరిశ్చంద్ర చక్రవర్తి" అని వసిష్ఠ మహాముని చెప్పగా, ఆ మహారాజు సత్యవ్రతాన్ని గుర్తించిన మహామునులందరూ, వ్యతిరేకభావాన్ని వెల్లడించకుండా ఊరుకున్నారు. కాని విశ్వామిత్ర మహర్షి మాత్రం ఊరుకోక "ఆ రాజుచేత అసత్యం పలికించి తీరుతా"నని మొండి పట్టుపట్టినాడు. అంతేకాదు. ఆ రాజుచేత అబద్ధం పలికించలేకపోతే తన తపోభాగాన్ని ధారాదత్తం చేస్తున్నట్లు, సమస్త ద్వీపాలతో కూడిన భూమండలాన్ని ఏక ఛత్రాధిపత్యంగా పాలింప చేసేటట్లు, అనంతరం ఇంద్రునితోపాటు స్వర్గ సింహాసనాన్ని అధిష్ఠింప చేసేటట్లు ప్రతిజ్ఞ చేశాడు. ముక్కు మూసుకుని అడవిలో తపస్సు చేసుకునే మునికి, హరిశ్చంద్రుడు నిజం పలికినా, లేక అబద్ధమాడినా ఒరిగేది ఏమిలేదు. ఇతర మహర్షులవలెనే ఊరుకోక, శపథంపట్టి చివరికి ఓడిపోయి చెడ్డపేరు తెచ్చుకున్నాడు. తన పంతం నెగ్గించుకునే ప్రయత్నంలో ఉత్తమ శీలుడైన ఆ చక్రవర్తి రాజ్యాన్ని కుటిల యుక్తులతో అపహరించి, భార్యాపుత్రులతో కూడా అడవులపాలు చేశాడు. అగ్ని చుట్టు ముట్టుకొన జేశాడు. ఆ రాజు భార్య చంద్రమతిని దాసిగా అమ్మించాడు. ఆ రాజును కాటి కాపరిగా చేశాడు. అతని ఏకైక పుత్రుని, పసి బాలుని చంపించాడు. చివరకారాజు తన భార్యను చంపుటకు సిద్ధ పడేటట్లు చేశాడు. ఇన్ని విధాలుగా కష్టపెట్టినా, ఆ రాజు తన సత్యవ్రతాన్ని విడువలేదు. నష్టపోయి, అవమానం పాలయినది విశ్వామిత్రుడు మాత్రమే! ఆ మహర్షి యీ పట్టుదలను ఏదైనా సత్కార్యం విషయమై చూపితే గొప్ప పేరు వచ్చేది. అనవసరంగా ఇలా మొండి పట్టుపట్టితే అనర్థం తప్పదు.

–బులుసు వేంకట రమణయ్య

## బృందావనం

ఇక్కడికొచ్చి గూడా కొద్దిరోజులుంటార్లెండి" అన్నాడు.

ఆకాశంలో మబ్బులు క్రమ్ముకోడంవల్ల సూర్యుడు కనిపించకపోయిన దినాన్ని దుర్దినం అంటారట! నా పరిసంభాషలో చెప్పాలంటే బృందావనంలో గడపిన మూడోరోజు నా పాలిటికి దుర్దినమై పోయింది. చూపులు కడపదగ్గరే కాపురం పెట్టేశాయి. కళ్లు కాయలు గాచాయి. బిడ్డ కెలావుందోనన్న బెంగ గుండెగూడులో గిరికిలు కొట్టింది. ఎడతెగని ప్రతీక్షకు చివర మధ్యాహ్నం మూడుగంటలప్పుడు మబ్బుల చిలికలోనుంచి సూర్యకిరణం ఒకటి తొంగిచూచినట్టుగా అడుగులో అడుగువేసుకుంటూ రాధిక గుమ్మంలోకి వచ్చేసింది. అక్కడామె నిలుచున్నదల్లా, ఒకటి రెండు నిమిషాలు మాత్రమే!

"గుడీవినింగంకుల్! రాత్రి నాకు మళ్లీ జొరమొచ్చిందట–! ప్రొద్దున్నే డాక్టరుగారొచ్చి చూచివెళ్లారు. బెడ్రెస్టు తీసుకోమన్నారు. రాత్రికి తగ్గిపోతుందట– డాక్టరే చెప్పారు. మమ్మి నిద్రపోతుంటే నే వొచ్చేశాను. రేపు నాకు జొరం లేకపోతే మమ్మి క్లబ్బుకెళ్లిపోతుంది. అప్పుడొస్తానంకుల్! మిగిలిన కథ చెబుతారా?"

"అలాగేనమ్మా! తప్పకుండా చెబుతాను" అన్నాను.

ఆనాటి సాయంకాలం హైదరాబాదు నుంచి ఒకవార్త వచ్చింది. నారాయణప్పగారి రాక మరింత ఆలస్యంగా వచ్చునట. మరునాటి ఉదయం గంగన్న చెప్పారు. బుల్లెమ్మగారిని నర్సింగ్‌హోంకు తీసుకెళుతున్నారట. అప్పుడింక నేను బృందావనంలో గోళ్లు గిల్లుకుంటూ కూచోవలసిన అగత్యమేమి కనిపించలేదు. లాజరస్‌తో చెప్పి, సెలవుతీసుకుని చక్కారోడ్డుపైకి వచ్చేశాను.

వస్తూ వస్తూ అనుకున్నాను. ఊరికి వెళ్లగానే పబ్లిషరుగారికి ఉత్తరం రాయాలి. ఆయన సూచించిన ఇతివృత్తంలో నవలరాయటం నాకి జన్మలో సాధ్యం గాకపోవచ్చు. కాని నా సంతృప్తికోసం నేను రాధికను గురించి మాత్రం కథరాస్తాను. నాలుగు రోజుల బృందావనం మజిలీలో నేనా ఒక్క అమ్మాయిని మాత్రం అర్థం చేసుకో గలిగాను. ఆరోగ్యం కుదుట పడగానే ఆమె యింటికి వెళుతుంది. గదిలో కథలు చెప్పే అంకుల్‌కోసం చూస్తుంది. అతడు కనిపించడు. ఇంతకూ అతడెవరో? ఎక్కడి నుంచి వచ్చాడో? మళ్లీ ఎప్పుడొస్తాడో? అసలొస్తాడో, రాడో? ఆమెకేమి తెలియదు. నాకైనా వీలయితే 'అమ్మా, రాధికా! బాలవర్ధిరాజు మాయల మరాఠి ప్రాణరహస్యం తెలుసుకున్నాడు. ఏడుసముద్రాల కావలినుంచి పంచవన్నెల చిలకను తసుకొచ్చి దాని గొంతు నులిమి మాయలమరాఠిని చంపేశాడు. తల్లిని చెరనుంచి విడిపించాడు'. అంటూ మూడు ముక్కల్లోనైనా కథను సంగ్రహంగా చెప్పి ముగించాలనుంది. చాలా చిన్నకోరికే! కానీ జీవితంలో ఒక్కొక్కప్పుడు చాలా చిన్న కోరికలు గూడా తీరవేమో?

ఇంతకు నే నెవరు? రాధిక ఎవరు? ఎవరికి వారే, యమునాతీరే....... □

# నవ్వుల గణపతి

గీతా సుబ్బారావ్












## విచిత్ర యథార్థ గాథలు

పులిగడ్డ విశ్వనాథరావు

# ఆత్మల దూత ఎలీన్ గారెట్

ఇది సుమారు డెబ్భై ఏళ్ళ క్రితం జరిగిన సంఘటన. అప్పుడు ప్రథమ ప్రపంచ యుద్ధం సాగుతోంది. ఎలీన్ గారెట్ అనే మహిళ సెవాయ్ హోటల్ భోజనశాలలో భోంచేస్తోంది. ఆమె ఒక సైనికాధికారి భార్య. భోజనశాల జనంతో కిటకిట లాడుతోంది. ఆమె యాదృచ్ఛికంగా తన భర్త బాంబుల దాడిలో క్షతగాత్రుడైనట్టు ఊహించింది. రెండు రోజుల తర్వాత బ్రిటిష్ మంత్రిత్వశాఖ ఆమె భర్త బాంబుల దాడిలో మరణించినట్టు తెలియ జేసింది.

గారెట్‌కు ఇదేమి కొత్త కాదు. తన ఆప్తుల జీవితాలలో జరుగబోయే సంఘటనలు ఆమెకు కళ్ళకు కట్టినట్టు కనబడేవి. ముప్ఫై ఏళ్ళ ప్రాయంగల గారెట్ యథార్థవాది. చింతనాశీలి. కానన్‌డాయల్, బెర్నార్డ్ షా, డి.హెచ్. లారెన్స్, జేమ్స్



ఎలీన్ గారెట్

జాయస్. హెచ్. జి. వెల్స్, ఆల్డస్ హక్స్‌లీ మొదలగు సుప్రసిద్ధ సాహితీవేత్తలు ఆమె స్నేహితులు.

ఒకసారి గారెట్ లండన్ స్పిరిట్యుయలిస్ట్ అలాయెన్స్‌లో మహిళా అధ్యయన బృందం సభ్యురాళ్ళతో కూర్చొని ధ్యానం చేస్తోంది. గారెట్ తన చైతన్యావస్థలో మార్పు రాగానే కాస్త స్పృహలో ఉంటూనే పరవశంగా మాట్లాడసాగేది. ఈ సారి మాత్రం తాను నిద్రావస్థలోకి జారుకుంటున్నట్టు అనిపించింది ఆమెకు. తర్వాత ఏమైందో ఆమెకు తెలియదు. గారెట్ నిద్ర నుంచి లేచాక ఆమె ఏదో చిత్రమైన మగ గొంతులో తూర్పు దేశాల యాసతో మాట్లాడినట్టు ఆమె స్నేహితులు ఆమెకు చెప్పారు. ఆ గొంతు తన పేరు ఉవాని అని చెప్పిందని, సభ్యురాళ్ళలో కొంత మంది ఆప్తుల ఆత్మల నుంచి వచ్చిన సందేశాలను ఆ గొంతు స్పష్టంగా పలికిందని వారు చెప్పారు. ఆ సందేశాలలో వివరాలు యథార్థమైనవని కూడా తేలింది. ఆ వివరాలు గారెట్‌కు తెలిసే అవకాశం ఎంత మాత్రమూ లేదు. అధ్యయన బృందం సభ్యురాళ్ళలో బీట్రిస్ అర్న్ అనే మహిళ కూడా ఉంది. ఆమెకు కూడా గారెట్ ద్వారా యుద్ధంలో చనిపోయిన ఆమె కొడుకు నుంచి విస్తృత సందేశం వచ్చింది.

బీట్రిసి అర్న్‌కు ఊజా బల్ల (ఆత్మలతో సంభాషించే సాధనం) ద్వారా ఆత్మలతో సంభాషించే అలవాటు ఉండేది. ఒకసారి ఆమె ఊజాబల్లను ఉపయోగిస్తూ బల్లపైగల సూచిక సూచించిన అక్షరాలను కూడబలికి చదువుకుంటే "ఒక మునిగిపోయిన మనిషికి మీరు సహాయం చేయగలరా?" అనే సందేశం వచ్చింది. "మీ రెవరు?" అని ఆమె ప్రశ్నించగా, "నేను ఎల్సీమాకే అనే ఆమెతో సహా మునిగి పోయాను." అనే జవాబు వచ్చింది.

వెంటనే అర్న్‌కు "ఎండేవర్" అనే చిన్న విమానంలో అరితేరిన వైమానికుడైన రేమండ్‌హించ్ క్లిఫ్, ఎల్సీమాకే అనే వ్యక్తులు మార్చి 1928లో ఇంగ్లండు నుంచి అమెరికాకు బైలుదేరి గమ్యానికి చేరుకోలేకపోయిన సంఘటన పత్రికల్లో చదివినట్టు గుర్తుకు వచ్చింది. అట్లాంటిక్ మహాసముద్రం మీదుగా ఇంగ్లండు నుంచి అమెరికాకు ఆకాశమార్గాన బైలుదేరిన ప్రపథమ వైమానికులు వారే. పాపం వారు దారిలోనే మాయమయారు. ఎల్సీమాకే నటి, సంపన్నురాలు. రేమండ్‌హించ్ క్లిఫ్‌కు పదివేల పౌన్ల బహుమానంతో పాటు, అతని జీవితాన్ని మరో పదివేల పౌన్లకు భీమా చేయించే ఏర్పాటు చేసి ఎల్సీమాకే హించ్‌క్లిఫ్‌ను తనతో సహా ఈ సాహసయాత్రపై బైలుదేర దీసింది. కాని ఆమె పంపిన చెక్కు చెల్లలేక పోవడం వలన భీమా కాలేదు.

విమానం అంతర్ధానం అయి భర్త తిరిగి రాకపోయేసరికి రేమండ్ హించ్‌క్లిఫ్ భార్య ఎమిలీ హించ్‌క్లిఫ్‌కు ఆర్థిక ఇబ్బందులు వచ్చి పడ్డాయి. ఎల్సీమాకే ఆస్థి ఆమె తండ్రి లార్డ్ ఇంచ్‌కేప్ అజమాయిషీలోకి వెళ్ళింది. ఎమిలీ హించ్‌క్లిఫ్ లార్డ్ ఇంచ్‌కేప్‌కు సహాయం చేయమని ఉత్తరం రాసింది. కాని అతడు ఏమి పట్టించుకో లేదు. ఈ వివరాలన్నీ అర్న్‌కు తెలియవు. రేమండ్ హించ్‌క్లిఫ్, ఎల్సీమాకే ప్రయాణం చేస్తున్న విమానం మాయమైందని మాత్రమే ఆమెకు తెలుసు. మరల ఊజాబల్లను సంప్రదించగా, "నేను ఆమెతో మాట్లాడ దలిచానని నా భార్యకు చెప్పండి." అనే సందేశం వచ్చింది. "ఆమె ఎక్కడ ఉంటుంది?" అని అర్న్ అడగగా, ఎమిలీ హించ్‌క్లిఫ్ యొక్క వకీళ్ళ కంపెనీ పేరు "డ్రమండ్స్" అని ఊజాబల్ల సూచించింది. అర్న్ టెలిఫోన్ డైరెక్టరిలో ఆ పేరు చూసి చిరునామా కనుక్కొని ఆ కంపెనీ ద్వారా ఎమిలీ హించ్‌క్లిఫ్‌కి వివరాలన్నీ తెలుపుతూ ఉత్తరం రాసింది. ఎందుకైనా మంచిదని నేరపరిశోధనా రచయిత, తన మిత్రుడైన కానన్‌డాయల్‌కి కూడా ఈ విషయం తెలియ జేసింది. అతడికి అతీంద్రయ శక్తులలో ఆసక్తి ఉండేది.

కానన్‌డాయల్ తన మిత్రురాలైన గారెట్ ద్వారా ఈ విషయాన్ని పరిశీలింప జేయాలని నిశ్చయించాడు. బీట్రిస్, అర్న్, ఎలీన్‌గారెట్‌లు మిత్రురాళ్ళే. కానన్‌డాయల్ వారిని సమావేశ పరిచాడు. గారెట్‌ను ఉవానీ ఆత్మ ఆవహించి, "అతడు (అనగా రేమండ్ హించ్‌క్లిఫ్) తన భార్యతో మాట్లాడాలని ఆరాటపడు తున్నాడు. గాలి తీవ్రత వలన విమానాన్ని మరో వైపు మళ్ళించాడట. తర్వాత ఇంధనం ఐపోయిందట. అతడి భార్య ఇంగ్లీషు మహిళ కాదుట. వారికి ఇద్దరు పిల్లలట." అని చెప్పింది. కానన్‌డాయల్ ఎమిలీ హించ్‌క్లిఫ్‌కు ఉత్తరం రాసి ఉవానీ ఆత్మ తెలిపిన వివరాలను తెలియ జేశాడు.

ఉవానీ ఆత్మ చెప్పినట్టు ఎమిలీ హించ్‌క్లిఫ్ ఇంగ్లీషు మహిళ కాదు. ఆమె హాలండ్ దేశానికి చెందినది. ఆమెకు ఇద్దరే పిల్లలు. ఆమె అర్న్, కానన్‌డాయల్‌ల ఉత్తరాలను అందుకుని అర్న్‌ని కలుసుకుంది. అర్న్ ఊజాబల్ల కంటె ఎలీన్‌గారెట్ ద్వారా రేమండ్ హించ్‌క్లిఫ్ ఆత్మతో సంభాషించడం సులువుగా ఉంటుందని చెప్పింది. వారు గారెట్‌ను కలుసు కున్నారు. ఎమిలీ హించ్‌క్లిఫ్ అర్న్ స్నేహితురాలిగా పరిచయం చేసుకుంది. కాని ఫలానా అని చెప్పలేదు.

వారిద్దరూ కోరగా అర్న్ స్నేహితురాలి అనగా ఎమిలీ హించ్‌క్లిఫ్ (ఆమె రేమండ్ హించ్‌క్లిఫ్ భార్య అని గారెట్‌కు తెలియదు) భర్త ఆత్మను గారెట్ ఆవహింప జేసుకుంది.

ఎమిలీ వాళ్ళ పాప జోన్‌కు వాళ్ళ తండ్రి యాత్రపై వెళ్ళాడని చెప్పగా, అతడు ఎప్పుడు తిరిగి వస్తాడని జోన్ ప్రశ్నించిందనీ, తాను ఎమిలీ చిత్రించిన పిల్లల పెయింటింగ్ చూసాననీ, దాది బెట్టి పిల్లలను బాగా చూస్తోందని రేమండ్ హించ్‌క్లిఫ్ ఆత్మ గారెట్

ద్వారా చెప్పింది. ఈ వివరాలన్నీ నిజమేనని ఎమిలీ తర్వాత ఒప్పుకుంది. అలాగే ఎమిలీ ఇల్లంతా గాలించినా దొరకని రేమండ్ చొక్కా చేతి లింకులు అలమరలో ఫలానా డబ్బాలో ఉన్నాయని, బైలుదేరేముందు తాను విమానం ప్లగ్గులు మార్చానని రేమండ్ ఆత్మ తెలియ జేసింది. ఎమిలీ ఇంటికి వెళ్ళి అలమరలో డబ్బాలో చూడగా లింకులు దొరికాయి. విమానం ప్లగ్గుల విషయం వాకబు చేయగా రేమండ్ నిజంగా ప్లగ్గులు మార్చాడని తెలిసింది. అలాగే తన ఇంటి ప్లాటుకు సంబంధించిన సర్వే మ్యాపు కూడా ఫలానా జాగాలో ఉందని రేమండ్ ఆత్మ చెప్పగా ఎమిలీకి అది దొరికింది.

తనతో ప్రయాణం చేసిన ఎల్సీమాకే తండ్రి ఇంచ్‌కేప్‌ని "ఎక్స్‌ప్రెస్" పత్రిక ద్వారా వేడితే ఎమిలీకి అతడు ఆర్థిక సహాయం చేయగలడని, జూలై 25 తేదీన ధన సహాయం లభిస్తుందని రేమండ్ హించ్‌క్లిఫ్ ఆత్మ చెప్పింది. ఆమె అలాగే చేసింది.

ఎల్సీ మాకే యావత్ ఆస్తి 45 ఏళ్ళ తర్వాత ప్రభుత్వానికి సంక్రమించేలా ఆమె తండ్రి లార్డ్ ఇంచ్‌కేప్ నిర్ణయం తీసుకొన్నాడు. కాని ఎమిలీహించ్‌క్లిఫ్‌కి ఆర్థిక సహాయం చేస్తున్నట్లు పేర్కొనలేదు. దాంతో పత్రిక శీర్షికతో "ఎక్స్‌ప్రెస్" పత్రిక ఎమిలీ దీనావస్థ గురించి వార్త ప్రచురించింది. ఈ విషయం పార్లమెంటులో చర్చకు వచ్చింది. తుదకు లార్డ్ ఇంచ్‌కేప్ ఎమిలీ హించ్‌క్లిఫ్‌కు పదివేల పౌన్లు ఇస్తున్నట్లు ప్రకటన చేశారు. ఎమిలీ సంతోషంతో గారెట్ వద్దకు వెళ్ళి తన కృతజ్ఞత చెప్పుకుంది.

అలాగే గారెట్ జీవితంలో మరొక ముఖ్యమైన సంఘటన జరిగింది. ఈ సంఘటనకు హించ్‌క్లిఫ్ సంఘటనకు సంబంధం కూడా ఉంది.

గారెట్ 1928 లో ఒక రోజు హాలండ్ పార్కు ప్రక్కగా నడుస్తూ ఉండగా ఆమెకు ఆకాశంలో చిత్రమైన దృశ్యం కనబడింది. ఆమెకు మబ్బుల లోంచి బైటకు వచ్చి నెమ్మదిగా పడమటి దిక్కుగా పయనిస్తున్న పెద్ద ఆకాశ నౌక కనబడింది. చూస్తూండగా అది కంపిస్తూ పతనమవసాగింది. వెండిలా తళతళలాడే ఆ ఆకారంలోంచి పొగ మేఘాలు బైలుదేరి దాన్ని కప్పేశాయి. ఆమెకు ఈ దృశ్యం 1926 లో కూడా కనబడింది కాబట్టి ఆమె చాలా కలత చెందింది. అప్పుడు బ్రిటన్‌లో చిన్న చిన్న విమానాలే తప్ప ఎక్కడా అంత పెద్ద విమానాలు ఎగరడం లేదు. ఐతే అప్పుడే బ్రిటన్ అమెరికా, జర్మనీలతో పోటీగా రెండు విశాలమైన ఆకాశయానాలను తయారు చేస్తోంది. వీటిని డిరిజిబల్ అనే వారు. ఇవి అడుగున ఇంజన్లు గల పెద్ద గ్యాసు బెలూన్ల లాంటివి. ఈ రెండింటిలో ప్రభుత్వరంగంలో తయారు అవుతున్న ఆర్. 101 అనే డిరిజిబల్‌ను ఆకాశ మార్గాన ఐదారు రోజులలో భారతదేశానికి చేర్చి యావత్ ప్రపంచాన్ని సంభ్రమాశ్చర్యాలతో ముంచెత్తాలని బ్రిటిష్ ప్రభుత్వాధికారులు, రాజకీయ నాయకుల ఆశయం. అందుకని వాళ్ళు ఆర్. 101 ను అతి శీఘ్రంగా సిద్ధం



రేమండ్ హించ్‌క్లిఫ్, ఎమిలీ హించ్‌క్లిఫ్

చేయాలని తహతహ లాడుతున్నారు.

డిరిజిబల్ లోపల ఎత్తైన సంచులలో హైడ్రోజన్ గ్యాసు నింపేవారు. ఆ సంచులలో కొన్ని పదేసి అంతస్థుల మేడంత ఎత్తు ఉండేవి. ఈ సంచులను ఎద్దుల పేగుల పైపొరతో తయారు చేసేవారు. ఈ సంచులను కదలకుండా పట్టి ఉంచడానికి ఇనుప దూలాలు, తీగల వల అమర్చేవారు. డిరిజిబల్ మొత్తం ఆకారాన్ని బట్టతో కప్పేవారు. డిరిజిబల్ అడుగున ఇంజన్లను అమర్చేవారు.

ఎమిలీ హించ్ క్లిఫ్ తన కృతజ్ఞత తెలుపుకోవడానికి గారెట్ వద్దకు వచ్చినప్పుడు ఆమె గారెట్‌ను తన భర్త రేమండ్ హించ్ క్లిఫ్ ఆత్మతో మాట్లాడించమని కోరింది. గారెట్ ఒప్పుకుని రేమండ్ హించ్‌క్లిఫ్ ఆత్మను తనలోకి ఆవహింప జేసుకుంది. అతడి ఆత్మ ఈ విధంగా పలికింది.

"ఆర్. 101 డిరిజిబల్ పైబట్టను పట్టి ఉంచే తీగలు గట్టిగా లేవు కాబట్టి అవి కూలిపోతాయి. అదికాక దాని ఇంజన్లు కొత్త రకంవి. అవి పని చేయవు. అందువలన ఆ డిరిజిబల్ ఎగురకుండా ఉంటేనే క్షేమకరం." ఎమిలీ ఈ విషయాన్ని కానన్ డాయల్‌కు చెప్పింది. డాయల్, జాన్‌స్టన్ అనే సంబంధ వైమానిక శాఖ అధికారితో ప్రస్తావించగా, "మరేం ఫరవాలేదు. అన్ని జాగ్రత్తలు పాటిస్తున్నాం." అని అతడు చెప్పాడు.

ఎలీన్ గారెట్ ద్వారా ఎమిలీకి డిరిజిబల్ గురించి ఇంకాహెచ్చరికలు వచ్చాయి. గారెట్ కూడా బ్రాంకర్ అనే వైమానిక శాఖ అధికారికి ఈ విషయం తెలపగా అతడు ఈ ప్రయాణాన్ని వాయిదా వేసే ప్రసక్తి లేదని చెప్పాడు.

ఆర్. 101 అక్టోబర్ 4, 1930 సాయంకాలం కార్డింగటన్ నుంచి ఇండియాకు బైలుదేరింది. ఏడు

ఆర్.101 డిరిజిబల్



గంటల తర్వాత అర్ధరాత్రి అది ఫ్రాన్సులో కొండలపై కూలి పేలిపోయింది. దాంట్లో ప్రయాణం చేస్తున్న 54 మందిలో ఆరుగురు మాత్రమే ప్రాణాలతో బైటపడ్డారు.

ఇది జరిగిన కొద్ది రోజులకు గారెట్ ఒకసారి ఉవాని గొంతులో, "అతడు ఇర్విన్‌ట. డిరిజిబల్ భారం దాని ఇంజన్ల సామర్థ్యానికి మించి ఉందని, ఇంజన్ల బరువు కూడా ఎక్కువ అనీ అతడు చెబుతున్నాడు. ఆ రోజు దీర్ఘ ప్రయాణానికి వాతావరణం బాగులేదట. డిర్జిబిల్‌లో నీరు చేరి అది "ఆచి"లో ఇళ్ళ కప్పులను రాసుకుంటూ వెళ్ళిందిట" అని చెప్పింది. ఇర్విన్ డిర్జిబల్‌లో చనిపోయిన ఒక వైమానికుడు. ఐతే "ఆచి" అనే ఊరు ఫ్రాన్సులో ఉన్నట్లు ఉవాని ఆత్మ చెప్పింది విన్న వాళ్ళలో ఎవరికీ తెలియదు. తర్వాత ప్రైస్ అనే అతడు బ్రిటిష్ మ్యూసియమ్ లైబ్రరీలో రైల్వే మ్యాపు చూడగా బ్యూవాయి అనే పట్టణానికి ఉత్తరాన "ఆచి" దొరికింది.

ఆర్. 101 డిరిజిబల్ దుర్ఘటన గురించి దర్యాప్తు కోసం ప్రభుత్వం ఒక సమితిని నియమించింది. డిరిజిబల్ నిర్మాణం తొందరపాటుగా జరిగినా, దాంట్లో ఎన్ని లోపాలున్నా ఆ సమితి ఎవరినీ బాధ్యులిగా ప్రకటించలేదు. గ్యాసు లీకయింది. అదెలా అయిందో తెలియలేదు అని నిర్ధారించి దర్యాప్తు ముగించింది.

మేజర్ ఒలివర్ విలియర్స్ అనే వైమానిక మంత్రిత్వశాఖ అధికారి గారెట్‌ని కలుసుకున్నప్పుడు ఆమెకు ఇర్విన్ ఆత్మ పూని "డిరిజిబల్ చాలా బరువుగా ఉంది. ఎవరో నైపుణ్యంలేని వారు నిర్మించినట్లు ఉంది. గ్యాసు ఉండే సంచులు గట్టిగా లేవు. అవి కదలడం వలన లోని గ్యాసు ఒత్తిడి పెరిగి గ్యాస్ లీకయింది. డిరిజిబల్ ముక్కులో ఒక దన్ను కర్ర కూలి డిరిజిబల్ పైపొరలో కన్నం ఏర్పడింది. డీజల్ ఇంజను నుంచి కూడా అగ్ని వెలువడింది. ఆ అగ్ని లీకవుతున్న గ్యాసును రగిల్చింది" అని ఇంకా పెక్కు సాంకేతిక వివరాలతో సహా డిరిజిబల్‌కు సంబంధించిన ఎన్నో విషయాలు పేర్కొంది.

ఆర్ 101 డిరిజిబల్ నిర్మాణానికి సంబంధించిన అధికారి విల్ చార్ల్టన్, ఇర్విన్ ఆత్మ గారెట్ ద్వారా చెప్పిన వివరాలను అధ్యయనం చేశారు. వాటిలో 40 జటిల సాంకేతిక రహస్యాలున్నాయని కనుగొన్నాడు. గారెట్ లాంటి సామాన్య వ్యక్తికి అటువంటి సాంకేతిక వివరాలు తెలిసుండడం నమ్మశక్యం కాదని అతడు అభిప్రాయపడ్డాడు.

ఎలీన్ గారెట్ 1970 లో చనిపోయింది. చనిపోయే వరకు ఆమె భౌతిక శాస్త్రాలను అతీంద్రియ శక్తులతో మేళవించే ప్రయత్నాలను ఆర్థికంగాను, ఇతర విధాలగాను సమర్థిస్తూ ఉండేది. ఆమె సాంగత్యంలోకి వచ్చిన మనుషులంతా ఆధ్యాత్మిక వాదులుగా మారేవారు. జాన్ ఫులర్ అనే రచయిత ఆమె గురించి విస్తారంగా పరిశోధన చేసి వివరాలను గ్రంథస్థం చేశాడు. ☐

సీరియల్

# కరిగినశిల

రావినూతల సువర్ణకన్నన్

(గత సంచిక తరువాయి)

మర్నాడు ఆయన చెప్పిన దానికి అరగంట ముందే వెళ్ళాను. ఆయన ఆప్యాయంగా ఆహ్వానించి కూర్చోపెట్టాడు.

కొంతసేపు మౌనంగా గడిచి పోయింది. నాకు ఆతృతగా వుంది.

"సర్! వాసన లేని బ్రాంది గురించి నేనెప్పుడూ వినలేదే!" అన్నాను కుతూహలంగా.

అతను చిన్నగా నవ్వి–

"వాసన అసలు లేకుండా ఏ లిక్కర్స్ వుండవు? క్వాలిటిని బట్టి కాస్త ఎక్కువ, తక్కువలు వుంటాయిగాని!" అన్నాడు.

"మ....రి...."

"తొందర పడకండి! చెప్పాలనేగా రమ్మన్నది!" మళ్ళీ నవ్వాడతను.

రెండు నిమిషాల తర్వాత అతను లోపలి కెళ్ళాడు. నాలో తిరిగి ఆత్మ విమర్శ మొదలైంది. నీ రూపం గుర్తొచ్చింది. అయితే ఆనాటి సుఖం వీటన్నింటినీ తరివిం కొట్టింది.

తాగుడు ఎంత తొందరగా అలవడుతుందో అర్థమైంది. క్షణం వెళ్ళి పోదామా అని కూడా అనిపించింది. కానీ.... కాళ్ళు కదల్లేదు.

నేనలా సంఘర్షణ పడుతూండగానే సాగర్ వచ్చి నన్నో గదిలోకి తీసి కెళ్ళాడు.

ఆ గది ఖరీదైన ఫర్నిచర్‌తో చాలా విశాలంగా వుంది. మధ్యగా ఓ డబుల్ కాట్ వుంది. దానికి పక్కగా అందమైన కార్పెట్ వుంది.

గదిలో కెళ్ళగానే ఓ విధమైన సువాసనలు వెదజల్లుతూ మనసుని ఏదో లోకానికి తీసు కెళుతున్నట్టని పించింది.

"ఆ మంచం మీద కూర్చోండి!" అన్నాడు సాగర్.

మంత్రించినట్టు కూర్చున్నాను.

అక్కడ బ్రాంది బాటిల్స్‌గానీ, ఐస్‌క్యూబ్స్ వగైరాలుకానీ.... కనిపించలేదు. సాగర్ ఓ పేకెట్‌లోంచి ఓ టేబ్లెట్ తీసి నాకిచ్చాడు.

"ఏమిటిది?" ఆశ్చర్యంగా అన్నాను, దాన్ని తిప్పి తిప్పి చూస్తూ.

"నీ క్కావల్సిన స్వర్గం!" నవ్వాడతను.

నాకేం అర్థం కాలేదు.

"ముందు వేసుకో!" మంచినీళ్ళ గ్లాసు అందిస్తూ అన్నాడు. నేను మౌనంగా వేసుకున్నాను.

నీకు తెలుసుగా నేను మాత్రలు మింగడానికి ఎన్ని అవస్థలు పడేవాణ్ణో.... సుస్తీ చేస్తే ఇంజక్షనైనా చేయించుకునే వాణ్ణిగానీ మాత్ర మాత్రం మింగేవాణ్ణి కాదు.

ఎలాగోలా ఆయనిచ్చిన టాబ్లెట్ రెండు గ్లాసుల నీళ్ళతో బలవంతంగా మింగి అతని కేసి చూశాను. నవ్వుతూ తాపీగా కూర్చున్నా డతను. ఏదో ఓ టేబ్లెట్ ఇచ్చి నన్నో ఫూల్ని చేశాడా అనిపించింది.

"సర్!...." ఏదో అనబోయాను.

"ష్! మాట్లాడకు!" అన్నాడతను కాస్త విసుగ్గా.

ఏకవచన ప్రయోగానికే విస్తుపోతున్న నేను అతనన్న తీరుకు మరిబిత్తర పోయాను.

నా మొహంలోకి చూసిన సాగర్ భయంకరంగా నవ్వాడు. ఆ నవ్వు.... కుందేలు పిల్లని చూసి సింహం నవ్విన నవ్వులా వుంది.

నాకు కాస్త చిరాకనిపించింది. మెల్లగా లేవబోయాను. కళ్ళు గిర్రున తిరిగాయి. ఒళ్ళంతా తేలిపోయింది.

మొన్న నానా అవస్థపడి బలవంతంగా తాగిన బ్రాందికన్నా పవర్‌ఫుల్‌గా వుంది. మరెంతో హాయిగా వుంది. ఆనందం తన్నుకొచ్చింది.

"ఏం టాబ్లెట్ సర్ ఇది?" అన్నాను వుత్సాహంగా.

"అదే రహస్యం!" నవ్వాడతను.

ఈసారి అతని నవ్వు భయంకరంగా అనిపించ లేదు. "చెప్పండ సర్!" అన్నాను చనువుగా.

"అది ఏ టాబ్లెట్ అయితే నీ కెందుకు.... నీ కెప్పుడు కావాలంటే అప్పుడు నా దగ్గరికిరా. నేనిస్తాను!"

"అలాగే సర్!.... కానీ...."

"చెప్పు!"

"నా కోసం ఇంత చేస్తున్నారు కదా! నా వల్ల మీకేం వుపయోగం?" అన్నాను ముద్ద ముద్దగా.

"నీలాంటి యువకుల్ని సంతృప్తి పరచడం నా కిష్టం...." నవ్వాడతను.

"కానీ.... మీకు.... నేనేం చెయ్యగలను!"

**జరిగిన కథ-10 :** రమణ దగ్గర నుంచి సరయుకి ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరంతోపాటు రమణ రాసిన శీను, చిన్నాల యదార్థ కథని చదవసాగింది. సరయు. వనజ అర్జంటుగా రమ్మని కబురు చేస్తే ఆమె వెళ్ళింది. వనజ సరయుకి ఒక పెళ్ళి సంబంధం చూసింది. తనకి యిప్పట్లో పెళ్ళి చేసుకొనే ఉద్దేశ్యంలేదని చెప్పేసింది సరయు. వనజ తను మాట ఇచ్చింది కనుక ఆ ఆదివారం పెళ్ళికొడుకుని తీసుకువస్తానని అప్పుడు మాత్రం మామూలుగా ప్రవర్తించమని, మిగతావన్నీ తాను చూచుకుంటానని చెప్పింది. అలాగేనంది సరయు. ఆ రాత్రి చదువుతూ ఆపేసిన కథ తిరిగి చదవడం మొదలుపెట్టింది సరయు.

"ప్రస్తుతం ఏవీ ఒద్దు! అవసరం అయితే నేనే అడుగుతాను." గంభీరంగా అన్నాడతను.

"థాంక్యూ సర్!" అన్నాను కృతజ్ఞతగా.

ఆ తరువాత నాకు స్పృహ తప్పుతున్నట్టు అనిపించింది.

"పడుకో! గుడ్‌నైట్!" అని నన్ను పడుకోబెట్టి బ్లాంకెట్ కప్పినప్పుడు ఆయనలో నాకు దైవం కనిపించాడు.

మళ్ళీ మర్నాటిగ్గానీ మెలకువ రాలేదు. వచ్చాక ఆత్మ విమర్శ! పశ్చాత్తాపం! మళ్ళీ మామూలే!

అలా ప్రారంభమైన నా అలవాటు రోజూ సాయంత్రం అయ్యేసరికి ఆ టేబ్లెట్ కోసం ఆరాట పడ్డం దాకావచ్చింది.

ప్రతి రోజూ ఫోన్ చేసి వెళ్ళి ఆ టాబ్లెట్ వేసుకుని అక్కడే పడుకునే వాణ్ణి. కొన్నాళ్ళ తర్వాత టేబ్లెట్ వేసుకుని వెంటనే ఇంటి కొచ్చి పడుకోవడం మొదలు పెట్టాను.

మొదట్లో.... నాకు టేబ్లెట్ మీది పేపర్ తీసేసి ఇచ్చేవాడు సాగర్. తర్వాతర్వాత.... తియ్యకుండానే ఇచ్చేవాడు. అయితే అది వేసుకునేదాకా అక్కడే వుండేవాడు. అందుకే ఆ టాబ్లెట్స్ ఏవిటో తెలియ లేదు.

ఫారిన్‌కంట్రీస్‌లో ఎల్సిడి. హెరాయిన్, కొకైన్ లాంటి మత్తు మందులు యువతరం మీద చాలా దెబ్బ తీస్తున్నాయనీ, చాలా మంది యువతీ



## కరిగిన శిల

యువకులు అలాంటి అలవాట్లకి బానిసలై.... ఘోరకృత్యాలకి పాలపడుతున్నారనీ విన్నాను. కానీ.... ఇప్పుడియనిచ్చే టేబ్లెట్ ఏమిటో అర్థం కాలేదు.

అయినా.... అది ఏ టేబ్లెట్ అయితే నాకెందుకు. అతను అడిగి అడక్కముందే ఇస్తున్నాడు! అది చాలు అనుకున్నాను.

క్రమేపి నాలో మార్పు వచ్చింది. ఆకలి మందగించింది. ఉత్సాహం చచ్చిపోయింది. ఆఫీసు కెళ్ళాలంటేనే విసుగ్గా వుంది. ఇవన్నీ ఆ టేబ్లెట్స్ మూలంగానే అని తెలుసు. అయినా మానలేదు.

ఒకటి, రెండు, మూడు టాబ్లెట్స్ వేసుకుంటేనే గానీ తృప్తి కలగని పరిస్థితి ఏర్పడింది.

ఆ రోజు టేబ్లెట్స్ కోసం ఆయనకి ఫోన్ చేశాను. "సారి యంగ్ మాన్!" అంటూ ఫోన్ పెట్టేశాడు. నాకు పిడుగు పడ్డట్టయింది. వెంటనే అతనింటి కెళ్ళాను.

"సారి కృష్ణా! స్టాక్ లేదు!" అన్నాడు నిర్మొహమాటంగా. నేను బతిమాలాను. కనీసం ఆ టేబ్లెట్ పేరైనా చెప్పమన్నాను. అతను చెప్పలేదు.

ఏదైనా మెడికల్ షాపె కెళ్ళి అడుగుదా మనుకుంటే.... అభిమానం అడ్డొచ్చింది.

"ఎలాగో.... నీకు కొన్ని టేబ్లెట్ తెప్పించి ఇస్తాను.... కానీ...."

"చెప్పండి సర్! ఏం చెయ్యాలి?" అతని రెండు చేతులూ పట్టుకుని బతిమాలాను. నా కా క్షణంలో నేనో ఇంజనియర్ననిగానీ, వున్నత కుటుంబానికి చెందిన వాణ్ణనిగానీ, బంగారు స్పూన్‌తో తిని, పట్టు తివాసి మీద నడిచేవాణ్ణన్న సంగతిగానీ నాకు గుర్తు లేదు.

నాకు తెలిసిందల్లా.... అతనిచ్చిన టేబ్లెట్స్ వే[illegible]....

ప్రస్తుతం నాకవి కావాలి!

"చెప్పాక.... కాదనవుగా?"

"ఉహుఁ!" నమ్మకంగా అన్నాను.

"సరే! నాతో రా!" అంటూ బైటికి నడిచాడు. ఇద్దరం కార్లో ప్రయాణించి ఓ పెద్ద భవంతి కాంపవుండ్‌లో కెళ్ళాం.

విశాలమైన ఆవరణలో మధ్యగా వున్న ఆ భవంతిలోకి నడిచాం. నాకంతా అయోమయంగా వుంది.

సాగర్ నన్ను ఓ పెద్ద హాల్లోకి తీసి కెళ్ళాడు. అక్కడ చాలా మంది యువతీ యువకులు వుత్సాహంగా తిరుగుతున్నారు. సాగర్‌కి అందరూ విష్ చేశారు.

"టేక్‌కి సిద్ధంగా వున్నారా?" అన్నాడతను గంభీరంగా.

"ఎస్సర్!" అన్నాడో యువకుడు.

రెండు నిమిషాల తర్వాత నన్ను పిల్చి.... ఓ కిటికీలోంచి చూడమన్నాడు. కుతూహలంగా చూశాను.

అంతే!

నా కాళ్ళు చల్లబడ్డాయి.

పట్టు తప్పుతున్నట్టు అనిపించింది.

గదంతా లైట్స్‌తో వెలిగి పోతోంది. ఓ చోట కెమేరా వుంది.

అక్కడే ఓ డబుల్‌కాట్, దాని మీద నగ్నంగా ఓ జంట!....

అంటే.... బ్లూ ఫిలిమ్ తీస్తున్నారన్న మాట! నాకు మతిపోయినట్టయింది.

అన్నయ్యా! మరో సంగతి! ఆ జంట ఎవరో తెలుసా?.... మన వూరి కరణంగారి మేనకోడలు జ్యోతి, ఆమె భర్త సుందరం!

నాకు.... ఏం చెయ్యాలో అర్థం కాలేదు.

"కృష్ణా!.... ఎలా వుంది?" అదోలా నవ్వుతూ అన్నాడు సాగర్.

"వాళ్ళు...." తడారిపోతున్న గొంతుతో అన్నాను.

"నీలాంటి వాళ్ళే. ఇద్దరూ డాక్టర్లు! నా వలలో పడ్డారు.... నేను కేష్ చేసుకుంటున్నాను!" అన్నాడతను.

నాకు సాగర్ మీద అసహ్యం వేసింది. తిట్టాను. అసహ్యంగా దూషించాను

అతను మాట్లాడ లేదు. అన్నీ శాంతంగా విని–

"నీ కిష్టం లేకపోతే బలవంతం యేం లేదు. వెళ్ళిపోవచ్చు!" అన్నాడు.

నీరసంగా కూలబడి పోయాను.

అతనెంత దుర్మార్గుడైనా, ఆ టేబ్లెట్స్ మాత్రం ఎంత విషమైనా నాక్కావాలి!

"ఏం? నువ్వూ మా పిక్చర్లో యాక్ట్ చెయ్యాలి!" అన్నాడు తను మళ్ళీ.

నేను తప్పనిసరిగా ఒప్పుకున్నాను,

అంతే! నేను మరింత వూబిలో కూరుకు పోయాను. తేనెలో పడ్డ ఈగలా, సాలెగూట్లో పడిన పురుగులా గిలగిల కొట్టుకున్నాను. మంచి చెడులు పూర్తిగా మర్చి పోయాను. ఆయన చెప్పిందల్లా చేశాను.

నా పరిస్థితికి, ఆఫీసులో చేసిన అవకతవక పన్లు బైట పడి ఆఫీసంతా అల్లరైంది.

ఎంక్వైరీలు, సమన్లు, సస్పెన్షన్లు!

నేనో జీవచ్ఛవంలా మిగిలి పోయాను.

ఇప్పుడు చెప్పన్నయ్యా! నేను తిరిగి మామూలు మనిషి నౌతానంటావా?

ఒక్క సంవత్సరంలో ఎన్ని మార్పులు! నువ్వుగానీ, నేనుగానీ కలలో కూడా వూహించని మార్పులు! ఏదో అనుమానంతో నువ్వొస్తే కట్టు కథలు చెప్పి పంపేశాను నిన్ను.

తరవాత్తరవాత ఆ టాబ్లెట్స్ పేరు తెలుసుకుని నేనే కొనుక్కుని వేసుకోసాగాను.

ఇంట్లోంచి బైటికెళ్ళడమే మానుకున్నాను. ఏదో కారణాలు చెప్పి నీ దగ్గర్నుంచి వేలకు వేలు తెచ్చుకుని డాక్టర్ ప్రిస్క్రిప్షన్ వుంటేనేగాని ఇవ్వని మందులు బ్లాక్‌లో కొని మరీ వేసుకున్నాను. చివరికి శిథిల గృహంలా మిగిలిపోయాను.

అన్నయ్యా? నా గురించి నువ్వు దిగులు పడద్దు. కానీ నాలాంటి అనేకమంది తమ్ముళ్ళని ఆ వలయంలోంచి రక్షించు. అదే నా కోరిక.

అమాయకులైన యువతీ యువకుల్ని ఇలాంటి అలవాట్లకు బానిసలుగా చేసి.... తమ స్వార్థానికి వాడుకునే దుర్మార్గుల్ని అంతం చెయ్యి!

ఇలాంటివాళ్ళు దేశానికి పట్టిన చీడ పురుగులు. పామరజనాన్నే కాక నాలాంటి చదువుకున్న మూర్ఖుల్ని కూడా పావులుగా చేసి ఆడుకునే ఈ శక్తుల్ని నాశనం చెయ్యి!

సాధ్యమైనంతవరకు ఈ చెదల పుట్టల్ని నిర్మూలించి, నాలాంటి అభాగ్యుల్ని ఆ వూబిలోంచి బైటికి లాగు. దోషుల్ని ప్రభుత్వానికి అప్పజెప్పు.

అన్నయ్యా మరో ఘోర విషయం ఏమిటో తెలుసా?

ఒక వృద్ధ దంపతుల కలల పంటైన రఘు, నా ప్రాణ స్నేహితుడైన రఘు! మన సుజాతను ప్రాణాధికంగా ప్రేమించే మన రఘు!.... మన రఘు కూడా ఈ విష వలయంలోకి ఒచ్చేశాడన్నయ్యా!

వెంటనే రంగంలోకి దిగి కనీసం వాణ్ణయినా రక్షించు. ఆ సాగర్ చేసే మారణహోమాన్ని ఆపు!.... ఇదే నా అంతిమ కోరిక!

సాగర్ వివరాలన్ని విడిగా రాసిపెట్టాను చూసుకో! వాటి సాయంతో నువ్వు అతన్ని తేలిగ్గా ముట్టించచ్చు.

కాని అన్నయ్యా! చాలా జాగ్రత్త! అతను చాలా తెలివిగలవాడు. జాగ్రత్తగా డీల్ చెయ్యాలి.

ఈ ఉత్తరం రాయడం కోసం ఈ రోజంతా టబ్లెట్స్ వేసుకోలేదు.

అన్నయ్యా! మరో కోరిక!

నువ్వు త్వరలో ఓ ఇంటివాడివి కావాలి. నీ కడుపున నేను కొడుకుగా పుట్టాలి! నీ అంత మంచివాడుగా వుండాలి.

అన్నయ్యా! ఇంక రాయలేను. చేతులు వణికిపోతున్నాయి. తలంతా దిమ్ముగా వుంది. వాంతి వచ్చేలా వుంది. ఇంతసేపు మాత్రల్లేకుండా ఈమధ్యకాలంలో ఎప్పుడూ వుండలేదు. ఇంక శలవు.

తుది నమస్సులతో

నీ చిన్న.

"చిన్నా!" పరిసరాలు దద్దరిల్లేలా పెద్దగా అరిచి కూలిపోయాడు శీను.

అప్పుడే పెరట్లో కెళ్ళిన రాజమ్మ పరిగెత్తుకొచ్చి–

"ఏవిఁటి శీనూ! ఏవైంది?" అంది ఆదుర్దాగా.

"మన చిన్నా..... మన చిన్నా ఎంత పని చేశాడో చూశారా రాజమ్మగారూ!" అంటూ వలవల ఏడుస్తున్న శీనుని చూసి హడలిపోయిందావిడ.

"ఏవైఁది బాబూ! మన చిన్నా కేవైంది" పెంచిన మమకారం ఆమెని భయంతో కంపించేలా చేసింది.

కర్తవ్యం గుర్తొచ్చిన శీను తన దుఃఖాన్ని పక్కకి నెట్టి, విషయం ఆవిడకి క్లుప్తంగా చెప్పి–

"త్వరగా బయల్దేరండి!" అన్నాడు.

ఆవిడ పై ప్రాణాలు పైకే పోయాయి.

కంగారుగా లోపలి కెళ్ళిపోయింది.

పది నిమిషాల్లో కారు బయల్దేరింది.

ట్రాఫిక్ రూల్స్‌తో సంబంధం లేకుండా శరవేగంగా పరుగులు తీస్తున్న కార్లో ప్రాణాలు అరచేతిలో పెట్టుకు కూర్చుంది రాజమ్మ.

శీను ధ్యేయమల్లా ఎంత తొందరగానైనాసరే..... అక్కడికి చేరుకుని తమ్ముణ్ని రక్షించుకోవాలి, చివరికి తన ప్రాణాలు ధారపోసైనా సరే!

* * * * * * * * * *

శీను వాళ్ళు చేరుకునేసరికి రాత్రి పది గంటలు దాటింది. కారు దిగి ఒక్క అంగలో లోపలికి నడిచాడు శీను.

అయితే చిన్నా గది తలుపులు తాళం వేసున్నాయి. అప్పుడే లోపల్నించి ఇంటావిడ వస్తూ–

"అమ్మయ్యా! వచ్చారా?– మీ కోసం వెయ్యి కళ్ళతో చూస్తున్నాం! రండి! రండి!" అంది ఆదుర్దాగా.

"చిన్నా....." శీనుకి మాట రావటంలేదు. అతనికి సమాధానం చెప్పకుండానే–

"టెలిగ్రాం ఎప్పుడందింది?" అందావిడ.

"టెలిగ్రామా?" తెల్లబోయాడు శీను.

"అదేవిఁటి టెలిగ్రాం అందలేదూ?"

"ఉఁహూ!"

"మరైతే ఇప్పుడెందుకొచ్చారు?"

విషయం చెప్పాడు శీను.

## ధూర్జటినందన నీకు మ్రొక్కెదన్

నీ వెలుపలి చేతి ఘంటమును
నా వాక్కున నుంచు మటంచును
ఎల్ల కవులు నిను వేడుకొందురుగదయ్య
ప్రొద్దున నిద్దుర లేచి
పొందుగ నీ పంచ రత్నము లె
నే పఠించుచుంటిని పంచ వర్షముల నుంచి
హాస్య కవితకు నీవె అధి దేవతవని చెప్పుచుందురు
ఎందరెందరో కవులు - గాయకులు మున్ముందుగ నిను
స్తుతియించినంతనె ఏ విఘ్నములు లేకుండగ
ఎన్నెన్నో గ్రంథములు రచించినారంచురు గదా!
వారందరిని కరుణించిన నీకు
నామీద కాఠిన్య మేలనయ్యా
నాలో ఈ కోరికనెడి ఇంధనమును అంటించినావు
ఆ వెలుగన్నది వెలువరించుట నీదె బాధ్యత
సిద్ధి బుద్ధుల సహితం సేవించుచుంటినే
ఇద్దరెందుకు నీకు స్వామి
బుద్ధినైనను నాకు ఇమ్ము
పెద్ద కోరికలు నే కోరలేదు
మేడ మిద్దెలు నే నడుగలేదు
ఏదీ నీదు ఘంటమ్ము నా చేతి కిచ్చి
వసుధపై నిల్చెడి ఒక్క కావ్యము నాచే వ్రాయించవయ్య!

–పుచ్చా బాలా త్రిపురసుందరి

## కరిగిన శిల

"ఇదే దైవ మాయంటే. ఫోన్ చేద్దామంటే లైన్ దొరకలేదు. టెలిగ్రాం ఇచ్చాం. అదీ అందలేదు. కానీ అతను అనుకోకుండా ఓ వుత్తరంరాస్తే..... అది అందింది. ఊఁ! పదండి. చిన్నా హాస్పిటల్లో వున్నాడు!" అందావిడ భారంగా.

"ఎలా వున్నాడు?" అన్న ప్రశ్నకి ఆవిడ బదులు చెప్పనేలేదు.

అతనేమైపోయాడో అని హడలిపోతున్న వాళ్ళని అయిదు నిమిషాల్లో గమ్యం చేర్చింది కారు.

మూలగా వున్న స్పెషల్ రూమ్ కేసి నడిచింది ఇంటావిడ. మిగతా ఇద్దరూ తడబడుతున్న అడుగులతో అనుసరించారు.

గదిలో శవాకారంలా వున్న తమ్ముణ్ణి చూసి కొయ్యబారిపోయాడు శీను. బావురుమంది రాజమ్మ.

"నాన్నా! చిన్నా!" అంటూ దగ్గరి కెళ్ళబోతున్న వాళ్ళని ఆపేసింది సిస్టర్. అతన్ని డిస్టర్బ్ చెయ్యకూడదు అంటూ.

"ఎలా వుంది సిస్టర్?" ఆదుర్దాగా అవిణ్ణడిగాడు శీను.

"మీరోసారి డాక్టర్ని కలవండి." అంటూ డాక్టరున్న రూమ్ కేసి చూపించింది. అతను వెళ్ళగానే రాజమ్మ నిల్చున్నచోటే కూలబడి పోయింది.

శీను డాక్టర్ రూమ్‌లోకి నడిచాడు.

హాస్పటలంతా నిశ్శబ్దంగా వుంది. రోగులంతా నిద్ర పోతున్నారు. మధ్య మధ్య ఒకరిద్దరు రోగులు ఏదో బాధతో మూలిగి నిశ్శబ్దాన్ని భంగపరుస్తున్నారు.

"నమస్తే సర్!" మెల్లగా అన్నాడు శీను. ఈజీచైర్లో కూర్చుని ఏదో పుస్తకం తిరగేస్తున్న డాక్టర్–

"నమస్తే!.... మీరు...."

"నేను..... కృష్ణ అన్నని...." అంటూ తనని తాను పరిచయం చేసుకున్నాడు శీను.

"మీరా!.... రండి!..... అలా కూర్చోండి" అంటూ అతనికో కుర్చీ చూపించాడు డాక్టర్.

"డాక్టర్! మా తమ్ముడి పరిస్థితి...."

"సారీ. నమ్మకం చెప్పలేం! ఇప్పటికే బాగా డ్రగ్ ఎడిక్ట్ అయిపోయాడు. ఇంక అతను మానెయ్యాలనుకున్నా అతని అవయవాలూరుకోవు!" అన్నాడు డాక్టర్.

"డాక్టర్! ఎలాగైనా నా తమ్ముణ్ణి బతికించండి!.... ఎంత డబ్బయినా సరే ఆలోచించద్దు!..... నేను ఏం చెయ్యమన్నా చేస్తాను!..... వాణ్ణి తీసుకుని హిమాలయాల్లోకి వెళ్ళమన్నా వెళ్తాను.... మీరు మాత్రం వాణ్ణి కాపాడండి!" అతని చేతులు పట్టుకుంటూ అన్నాడు శీను.

డాక్టర్ జాలిగా నవ్వాడు.

"ఇంత ప్రేమాభిమానాలున్న మీరు.... అతను ఈ స్థితి కొచ్చేదాకా ఎలా వూరుకున్నారు?"

డాక్టరు మాటలు బాకుల్లా గుచ్చుకున్నాయి శీనుకి..... నిజమే అని కూడా అనిపించింది.

"ఆనాడే వీణ్ణి బలవంతంగా తీసుకుపోతే..... ఇప్పుడి స్థితికి ఒచ్చేవాడే కాదు.

వాడి మాటలు తను నమ్మాడు! చిత్తుగా మోసపోయాడు.

అవును. మొదట్నుంచి చిన్నా తనని మోసపుచ్చుతూనే వున్నాడు. చిన్నప్పుడు కాలికి బలమైన గాయం అయితే అది దాచి కోతి పుండు బ్రహ్మరాక్షసిలా చేసి ప్రాణాలమీదికి తెచ్చుకున్నాడు.

స్టూడెంట్ యూనియన్ గొడవల్లో ఎవరో వాణ్ణి కొట్టి పారిపోతే వారం రోజులు హాస్పటల్లో వున్నాడే తప్ప మాట మాత్రం తనకి రాయలేదు. తరవాత ఎవరో చెప్పగా నిలదీస్తే-

"నిజమే అన్నయ్యా!" అంటూ నవ్వేశాడు.

ఇప్పుడూ అలాగే చేశాడు.

పిచ్చాడిలా తను నమ్మేశాడు.

ఏమైనా ఈసారి వాడిమాట ఎప్పుడూ నమ్మకూడదు!... వీణ్ణి కాస్త కోలుకోగానే పల్లెకి తీసికెళ్ళి పోవాలి. వుద్యోగం అక్కర్లేదు, ఏం అక్కర్లేదు!"






అనుకున్నాడు శీను

'ఏవిఁటాలోచిస్తున్నారు?" మౌనంగా వున్న అతన్ని డాక్టరు గంభీరంగా అడిగాడు.

"నిజమే డాక్టర్! .. నావల్ల పెద్ద పొరపాటే జరిగింది. ఇకముందు వాణ్ని కళ్లల్లో పెట్టుకుని చూసుకుంటాను. జీవితంలో అలాంటి మందుల జోలికి పోకుండా చూసుకుంటాను ప్లీజ్. నా తమ్ముణ్ని మళ్లీ మనుష్యుల్లో పడెయ్యండి. మి రుణం జీవితాంతం మర్చిపోను." దాదాపు ఏడుస్తూ అన్నాడు శీను.

డాక్టర్ చిన్నగా నిట్టూర్చాడు.

"చూడండి మిస్టర్! మన ప్రయత్నం మనం చేద్దాం! ఆపై భగవంతుడి దయ. ప్రస్తుతం అతనికి స్పృహలేదు. జరగవలసిన ట్రీట్‌మెంటు జరిగిపోతోంది. మి రెక్కడికి వెళ్లకండి. ఏక్షణానైనా అతనికి స్పృహ రావచ్చు." అన్నాడు.

"ప్రమాదస్థితి...."

"ఈ రాత్రికి లేదు."

డాక్టర్‌కి థాంక్స్ చెప్పి చిన్నా గదిలో కొచ్చాడు శీను.

* * * *

మర్నాడు అయిదు గంటలు దాటుతుండగా మెలకువ వచ్చింది చిన్నాక. ఆతృతగా తనకోసే చూసే రెండు కళ్లని గుర్తించాడు అతని కళ్లలోకి ఆనందం, దుఃఖం పోటీలు పడి... వస్తున్నాయి.

"చిన్నా!" తమ్ముడికి తల నివురుతూ అన్నాడు శీను. అతని కళ్లనిండా నీళ్లూరి తమ్ముడి రూపం అస్పష్టంగా కనిపిస్తోంది.

"అన్నయ్యా!" చిన్నా కూడా అన్నగారి రెండో చేతిని చెంపకి రాసుకుంటూ అతని కళ్లల్లోకి ఆర్తిగా చూస్తున్నాడు.

'నాన్నా!' రాజమ్మక దుఃఖంతో మాట రావడంలేదు. ఆవిణ్ని చూసి చిన్నా సన్నగా నవ్వాడు వారం రోజులు మృత్యువుతో పోరాడి చివరిక ప్రమాదంలోంచి బైటపడ్డాడు.

ప్రాణభయం తప్పిందని డాక్టర్లు చెప్పాక వాళ్ళకి కృతజ్ఞతలు చెప్పుకుని, ఎవరి కివ్వాల్సిన డబ్బు వాళ్ల కిచ్చేసి చిన్నాని ఇంటికి తీసుకొచ్చేశాడు శీను

సమయానికి హాస్పటల్లో చేర్చి చిన్నా కోలుకోవడానిక్కారకులైన ఇంటివారిక్కూడా కృతజ్ఞతలు చెప్పుకుని ఇల్లు కాళీ చేయించేసి చిన్నాని తీసుకుని స్వంత వూరొచ్చేశాడు. శీను

ఇదో చిత్రమైన 'కేసని, ఇంత ముదిరిపోయాక కోలుకోవడమన్నది తమ సర్వీసులో మొదటిసారిగా చూస్తున్నామని, ఇంకపై ఇలాంటి 'డ్రగ్' తీసుకుంటే ఆ భగవంతుడు కూడా అతన్ని రక్షించలేడని, హెచ్చరించిన డాక్టర్ల మాటలు మర్చిపోలేదతను.

అందుకే వెళ్లి ఓ నెల్లాళ్లు శలవు గ్రాంటు చేసుకుని మరీ వచ్చాడు

పదిరోజులు ప్రశాంతంగా గడిచిపోయాయి చిన్నా కాస్త కోలుకున్నాడు. ఇవాళో, రేపో రఘు గురించి అడగాలనుకున్నాడు శీను.

హాస్పటల్లో ఒకటి రెండుసార్లు అడిగినా మనసు స్థిమితంలేక సరిగ్గా చెప్పలేక పోయాడు చిన్న. అందుకే కాస్త కోలుకున్న తరవాత అడగాలను-కున్నాడు.

అయితే అతను అనుకున్నట్టు అడగలేకపోయాడు. కారణం-

ఆ రోజు శీను బైట్నుంచి ఒచ్చేసరికి తూలుతూ కనిపించాడు. శీను గుండె ఝల్లుమంది.

"ఏవిఁట్రా చిన్నా? మళ్లీ ఎక్కేదిరా? తమ్ముణ్ని పట్టుకుని కోపంగా అన్నాడు.

'ఏంకాలేదు"! అదోలానవ్వాడు చిన్న అతని మాట కూడా ముద్దుగా వుంది.

"మళ్లీటేబ్లెట్స్ వేసుకున్నావుకదూ?" ఆవేశంగా అడిగాడు శీను. అతను మాట్లాడలేదు.

"ఛ నిన్నిలా వదిలేస్తే లాభంలేదు. పద! ఆ గదిలో పడుండు!' అతని, జబ్బపట్టి గుంజాడు శీను

'ఒదులు! ఒదులు!" గింజుకున్నాడు చిన్న కోపం, దుఃఖం, బాధ, కలిసి పొంగిరాగా చిన్నని ఈడ్చుకెళ్లి వీధి గదిలో పడేసి బైట గొళ్లెం పెట్టాడు శీను.

(ఇంకా ఉంది)

# భోజనప్రియుడు

మంత్రవాది మహేశ్వర్

'వాతాపి గణపతిం భజే-' పాట మృదు మధురంగా వినిపిస్తోంది.

అది వింటూ తనని తాను మరచిపోతున్నాడు విఘ్నేశ్వరస్వామి. తనూ మధ్య మధ్య గొంతు కలుపుతున్నాడు. తన్మయత్వంతో కళ్ళు మూతలు పడుతున్నాయి. తల అటు - యిటూ ఊగుతోంది. స్వామివారి ఆనందాన్ని గ్రహించిన మూషికం నాట్యం చేయడం మొదలెట్టింది.

పాట తక్కున ఒక్కసారిగా ఆగిపోయింది.

తన్మయత్వం చెదరిపోయింది - విఘ్నేశ్వరస్వామి కళ్ళు తెరిచి చూశాడు. మూషికం చెవులు నిక్కించి అటూ యిటూ చూస్తోంది.

ఎదురుగా కుమారస్వామి.

"బావుంది ... చాలా బావుంది. సంగీతాస్వాదనలో మునిగిపోయావన్న మాట"

"ఏమైందిప్పుడు ... నా ఆనందానికి భంగం కలిగించింది నువ్వేనా ..."

"అహఁ నేనే ... నీ లోకంలోంచి బయటికొచ్చి ఒక్కసారి భూలోకం పరికించమంటున్నాను. నీకు టైమ్ ప్రకారం అమ్మ అన్నీ అమర్చి పెడుతుంటే ఏం తెలీటం లేదు ..."

"ఏం ఎందుకంత కోపంగా వున్నావు"

"ఎల్లుండి ప్రత్యేకత"

"ఓహో చవితి రోజనా ... అవును ప్రజలు నన్ను భక్తి శ్రద్ధలతో ఆరాధిస్తారు"

"నైవేద్యాలు సమర్పిస్తారు ... వాళ్ళెంత కష్టాల్లో వున్నా నిన్ను కొలుస్తూనే వుంటారు" వెటకారం ధ్వనించింది.

"అవును"

"సిగ్గులేదు. ఆ మాట అనడానికి. వారి కష్టాలేమిటి అని ఏనాడైనా ఆలోచించావా"

"నాకు చాలా కోపం తెప్పిస్తున్నావు. నాకసలే ఆకలిగా వుంది. భోజనం చేసేక తీరుబడిగా కూర్చుని చర్చించుకుందాం"

"ఆగు వెళ్ళడానికి వీల్లేదు. నీ ఆకలి ... నీ తిండీకాదు. వెళ్ళి భూలోకంలో ముఖ్యంగా తెలుగు ప్రజలు హోటళ్ళలో డబ్బులు పోస్తూ ఎలాంటి అవస్థలు పడుతున్నారో చూడు."

"అంటే అంతవరకూ నన్ను భోంచేయద్దంటావు"

"నీ భక్తుల మీద నీకు ప్రేమ వుంటే ఆకలితో వెళ్ళి కష్టాలు తెలుసుకో పొరపాటునైనా ఎవరింటికి వెళ్ళద్దు. తెలుగువారు చాలా ఉదార స్వభావులు. అందులోనూ పండుగపూట వచ్చే అతిథిని అమితంగా గౌరవిస్తారు. ఆ గౌరవం కాకుండా ఏదైనా హోటల్‌కెళ్ళి నీ భక్తుల అవస్థ చూడు"

"సరే ... రేపే బయలుదేరి వెడతాను"

* * * * *

వినాయకరావు అవతారం దాల్చాడువిఘ్నేశ్వర స్వామి.

ఒక మధ్యతరగతి మనిషిలా మారాడు.

ఎండ మాడ్చిపారేస్తోంది ఉదయమే.

జగదాంబ జంక్షన్ నుంచి ఓ నాలుగడుగులు వేశాడు వినాయకరావు.

కనిపించిన ఓ హోటల్‌లోకి నడిచాడు.

కుర్చీలో కూర్చున్న పావు గంట దాకా సర్వర్ రాలేదు.

ఓపిక చచ్చిపోతున్న సమయంలో అటు యిటూ చూశాడు.

-క్యాష్ కౌంటరు దగ్గర కూర్చున్న లావుపాటి శాల్తీ డబ్బులు పుచ్చుకొంటూనే అక్కడున్న దేవుళ్ళ పటాలకు హారతిపడుతున్నాడు ... గట్టిగా అంటే అనేదేమిటో తెల్సిపోతుందని పెదాలు మాత్రం ఆడిస్తున్నాడు.

- ఇంతలో చెవిలో పెన్సిలు ముక్క, చేతిలో చిన్న బిల్ బుక్‌తో వచ్చిన వ్యక్తి విసుగ్గా అడిగాడు.

"ఏం కావాలి" - ఇంకా ఏం కావాలి అన్నట్టుంది. తీరు.

"భోజనం"

"అప్పుడేనా" హేళనగా నవ్వాడు. ఆ నవ్వులో నీకింకేం పని తినడం తప్ప అన్న భావం తొణికిసలాడింది.

"తిదేమిటి పది దాటింది కదా" గోడ గడియారంకేసి చూసి మరీ అన్నాడు.

"పదకొండింటికి ... ఇంకా 'మీల్స్ రడీ' బోర్డు పెట్టలేదు కదా"

అక్కడే వెయిట్ చేయాలా - లేకపోతే మరేదైనా హోటలుందా అనుకుంటూ లేచాడు.

బయటకు నడిచి నాలుగడుగులు వేశాడు.

'డాల్ఫిన్స్' మరో హోటల్ కనిపించింది.

ఖరీదైన మనుషుల కోసం అన్నట్టుగా వుంది ... కడుపులో ఆకలి దంచేస్తోంది ... వెళ్ళిపోదాం డబ్బయితే అయింది అనుకున్నాడు గానీ -'మధ్యతరగతి స్థాయిని మించి వెళ్ళకూడదు అన్న కుమారస్వామి పెట్టిన కండిషన్స్ గుర్తొచ్చి ఆగిపోయాడు.

అటు - ఇటూ తిరిగి కాలక్షేపం చేసి దాహానికి తట్టుకోలేక అయిస్ సోడా అని వ్రాసి వున్న కిళ్ళీ కొట్టు దగ్గరికెళ్ళి వాడిచ్చిన మామూలు సోడా త్రాగి, చిల్లర యివ్వనందుకు కొట్టువాడితో తిట్లు తిని మళ్ళీ అదే హోటల్ వైపు నడిచాడు.

'మీల్స్ రడీ' - బోర్డ్ తగల్చబడి వుంది.

'మళ్ళీ వచ్చాడేమిటి' అన్నట్టు చూశాడు ప్రొప్రయిటర్. పది నిముషాల తరువాత సర్వర్ వచ్చి ఇందాక చూసిన మొహమే అన్నట్టు పోజిచ్చాడు.

"భోజనమేనా ...ఓ పావు గంట అవుతుంది"

"మరి 'మీల్స్ రడీ' బోర్డ్ తగిలించారు"

"కర్రీ అవలేదు ... చట్నీ అవలేదు తెచ్చేయమంటారా"

మరింకేం అయిందో అర్థంకాలేదు వినాయకరావుకి.

అక్కడికొచ్చిన అరడజను మంది అమ్మాయిల్ని "ఏం కావాలి" అని అడగడానికి నవ్వు ముఖంతో వెళ్ళిపోయాడు.

మరోపది నిముషాలు అలాగే కూర్చుని విసిగెత్తిపోయి క్యాష్ బాక్స్ దగ్గర కూర్చున్న ప్రొప్రయిటర్ దగ్గరికెళ్ళి "ఎక్స్‌క్యూజ్‌మీ ... మీ పేరు! అనడిగాడు.

"వీరేశలింగం"

"ఈ పేరు ఎక్కడో విన్నట్టుగా వుందే ... ఓహో సంఘ సంస్కర్త ... మహానుభావుడు ... ఇతగాడు పెట్టుకున్నాడన్న మాట' అనుకుని "చూడండి లింగంగారూ ... భోజనం యింకా ఆలస్యమవుతుందా"

"లేవండి అయిపోయి వుంటుంది. ఈవేళ వినాయకచవితి కద సార్ ... స్పెషలు హడావిడి ..." అంటూ టేబుల్ మీద తుప్పు పట్టిన బెల్ నొక్కాడు.

బక్కపల్చగా వున్న ఓ సర్వర్ వగ్గుతూ వచ్చాడు. శ్రామిక వర్గానికి ప్రతినిధిలా వున్నాడు.

"ఈ సార్‌కి ఏం కావాలో చూడు"

"మీల్స్ ..." అరుచుకుంటూ వెళ్ళిపోయాడు.

వెళ్ళిన ఓ పది నిముషాలకి వేళ్ళు ముంచి తెచ్చిన రెండు గ్లాసుల్ని టేబుల్‌మీద బలంగా పెట్టాడు.

త్రాగుదామని గ్లాసు చూసుకొనేసరికి అందులో ఒకదోమ, రెండు చీమలు.

ఏమిటని అడిగితే కనిపించటం లేదా అనో, మీరిచ్చే డబ్బులకి ఏనుగులు, గుర్రాలు వస్తాయటండి అనో కుళ్ళు జోకులేస్తాడేమోనని భయపడుతూనే - మీల్స్ ప్లేట్ టేబుల్ మీద పెడుతున్న సర్వర్‌తో "ఏమిటయ్యా చూడు ..." అన్నాడు.

"ఆ చీమలే సార్ "వేలుతో తీసిపారేసాడు. అవి మీద పడ్డాయో ఏమో తింటున్న ప్రక్క టేబుల్ వ్యక్



తలెత్తి చూశాడు కోపంగా.

"అదేమిటయ్యా ... శుభ్రమైనవి పట్రా ..." అన్నాడు.

అలా అన్నందుకు కోపంగా వెళ్ళిపోయాడు.

బియ్యంలో రాళ్ళో ... రాళ్ళల్లో బియ్యమో ... ముద్ద ముద్దకి అరడజను.

బంగాళదుంప కూర అతి భయంకరంగా వుంది.

ఉప్పు వేయడం మరచిపోయిన పప్పు ...

కళ్ళలోంచి నీళ్ళు తెప్పించే చట్నీ ...

పులుపెక్కువైపోయిన సాంబారు ...

"కాలే కడుపుకు మండే బూడిద" అన్నట్లు చాలామంది పట్టించుకోకుండా తినేస్తున్నారు త్వరత్వరగా.

తనకి మాత్రం ఆకలేస్తున్నా కడుపులోకి వెళ్ళటంలేదు.

గిన్నెలు కడిగిపోసిన నీళ్ళులాంటి మజ్జిగ వేళ్ళు ముంచి టేబుల్ మీద పెట్టాడు. వేళ్ళు ముంచి తేవడమే తమ జీవిత ధ్యేయంగా పెట్టుకున్నట్టున్నారు సర్వర్లు.

నూనె ఓడుతున్న అప్పడం ...

మూడు నాలుగేళ్ళ క్రిందటి ఊరగాయ ...

"అయ్యగారికి స్పెషల్ యిచ్చావా" అడిగాడు ప్రొప్రయిటర్ సర్వర్ని.

"ఇప్పుడే తీసుకొస్తాను. మర్చిపోయాను" అంటూ లోపలికెళ్ళాడు.

"స్పెషలేమిటి" భయపడ్డాడు వినాయకరావు.

"ఇవేళ వినాయకచవితి కద సార్ ... 'స్పెషల్' అని ఓ ప్లేటు ముందు పెట్టాడు"

ప్లేటులో రెండు ... 'ఉండ్రాళ్ళు' ... గుండ్రంగానే వున్నాయి.

చూడగానే నోరూరింది. హోటల్ భోజనం ఉండ్రాళ్ళు తినే అదృష్టం వుంటుందో లేదో అనుకున్నాడు.

తిందామని ముట్టుకోగానే అదో రకమైన ఫీలింగ్.

కార్క్ బాల్సులాగున్నాయి.

తినడం తనవల్ల కాదనిపించింది.

# నరజాతులు నవ్వుతాయి

—డా. సి. నారాయణరెడ్డి

గది కదలదు.
గదిలో రెక్కలు కొట్టుకునే
ఉదయాలు కదులుతాయి.

తోట నడవదు.
తోటలో రేకులు తొడుక్కునే
పరిమళాలు నడుస్తాయి.

ఇసుక ఎగరదు.
ఇసుకతో చేతులు కలిపే
సుడిగాడ్పులు ఎగురుతాయి

కొండ కురవదు.
కొండతో తలబాదుకునే
కారుమబ్బులు కురుస్తాయి.

కోతి నవ్వదు.
కోతితో మూతులు కలుపుకునే
నరజాతులు నవ్వుతాయి.

## భోజనప్రియుడు

ఎదురుగా వున్న సీట్లో కూర్చున్నతను ఉండ్రాళ్ళని కరకరా నమిలిపారేస్తున్నాడు. చూస్తుండగానే గ్లాసుడు మంచినీళ్ళు త్రాగి త్రేవ్‌మని త్రేన్చి లేచాడు.

కంచంలో ఒక్క మెతుకు మిగల్చలేదు అతను -

తన కంచం చూసుకున్నాడు ... ఇంచుమించు వేసినవన్నీ వేసినట్టే వున్నాయి. అన్నీ రుచి చూసి పెడుతున్నట్లుంది.

చిన్న స్టీల్ ప్లేటులో 'బిల్' పెట్టి తీసుకొచ్చి నిలబడ్డాడు.

తీసి చూస్తే ఆర్రూపాయలు అని వుంది. ఉండ్రాళ్ళకి ఎక్స్‌ట్రా రూపాయి ... మొత్తం ఏడు.

నవ్వుతూ నిలబడ్డాడు సర్వర్.

ముందు అర్థంకాలేదు. తరువాత తెలిసింది 'టిప్' కోసం వెధవ వేషం వేస్తున్నాడని.

మొత్తానికి భోజనం ఖర్చు ఒక్క పూటకి ఏడున్నర.

పైగా ఆకలి ఏమి తీరలేదు ... నోరు పాడు చేసుకోవడానికి వచ్చినట్లుంది. అయినా జనం బాగానే వున్నారు. మంచి హోటలు అన్న ముద్ర పడిందట.

బయటికొచ్చి హోటల్ బోర్డు చూశాడు.

'శ్రీ గణేష్ విలాస్, ప్యూర్ వెజిటేరియన్ మీల్స్ అండ్ కాఫీ - ప్రొప్రయిటర్ : వీరేశలింగం'.

'ఓరి దొంగ పీనుగా నా పేరే దొరికిందిరా నీకు - ఈ విధంగా జనం దగ్గర డబ్బు దోచేస్తూ సంఘ సంస్కర్త పేరు నువ్వెట్టుకొని పైగా నా పేరు నీ హోటల్‌కి పెడతావా ... దుర్మార్గుడా ... నీలాంటివాళ్ళ వల్లే జనానికి భగవంతుడి పైన నమ్మకం సన్నగిల్లుతోంది ...' అనుకుంటూ బయటికి నడిచాడు ...

నడుస్తునే వున్నాడు వినాయకరావు.

రోడ్డు మీదపందిళ్ళు..విఘ్నేశ్వరుడి విగ్రహాలు...

చందాల కోసం కుర్రాళ్ళు డబ్బాలు గలగలాడిస్తూ అటూ ఇటూ పోయే జనాన్ని పీక పాకం పట్టేస్తున్నారు.

వాళ్ళకి డబ్బులు వేయకుండా వెళ్ళడం ఎవరి తరం కాదనిపించింది, వినాయకరావుకి.

ఓ అర్ధ రూపాయి వేసి ముందుకు వెళ్ళాడు.

ఇప్పుడు వినాయకరావుకి చాలా కోపంగా వుంది.

తన పేరున్న హోటల్లో అంత దరిద్రమైన భోజనం చేసినందుకు కాదు, అలా డబ్బులిచ్చి అటువంటి వాళ్ళను పోషిస్తున్నందుకూ కాదు ... మరి—

-వినాయకచవితి సందర్భంగా ఏర్పాటైన పందిళ్ళ దగ్గర అమర్చిన స్పీకర్లోంచి అసభ్యమైన పాటలు కర్ణభేరిని బ్రద్దలు చేస్తున్నందుకు. □









బొమ్మల సీరియల్ ప్రారంభం!































★'రా' అంటే రిసెర్చ్ అండ్ ఎనాలిసిస్ వింగ్.

# అభిమాన తారలపై అభిప్రాయం

భారతీయ సినిమా చరిత్రలో ఒక నటుడు నలభై సంవత్సరాలు హీరోగా ఉండటము అనేది గొప్ప ఘనత. ఆ గొప్ప ఘనత నటసామ్రాట్ డా. అక్కినేని నాగేశ్వరరావుగారికి దక్కింది. ఆయన నటించిన "ప్రేమనగర్" చిత్రం చూశాక నేను అతని అభిమానినయ్యాను.



అక్కినేని నటజీవితం ఎంతో వైవిధ్యం కలిగివుంది. చిత్ర జీవితాన్ని, నిజజీవితాన్ని ఆకళింపు చేసుకుంటూ, చిత్రజీవితాన్ని నిజజీవితంతో పోల్చుకుంటూ, నేర్చుకుంటూ, లోపాలను సరిచేసుకొంటూ పెరిగిన మహనటుడు పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావుగారు. అందుకే ఆయన నూతన నటినటులకు మార్గదర్శకుడు. కుటుంబ గాథా చిత్రాలలోను, ప్రేమ కథ చిత్రాలలోను నటించడం అనేది ఆయనకు వెన్నతో పెట్టిన విద్య. నటనలో అతనికి సాటి అతనే. శ్రీ అక్కినేని మహాపురుషుల పాత్రలలో నటించాలనేదే నా కోరిక.

పారుపల్లి ఆనందప్రసాద్,
డా. అంబేద్కర్ కాలనీ,
విజయనగరము

* * *

నవరస నటనాప్రియ, భానుప్రియ అభిమానిని నేను. నేను మొదట, ఆమె నటించిన 'జేమ్స్‌బాండ్-999' సినిమా చూసి ఆమె నటన, డాన్స్ ఎంతో బాగుందనుకున్నాను. తర్వాత 'సితార' సినిమా చూశాను. తొలి చిత్రంలోనే ఆమె ప్రదర్శించిన అనన్యసామాన్యమైన నటన నన్ను ముగ్ధుని చేసింది. అప్పటి నుండి ఆమెను



అభిమానిస్తున్నాను. ఎంత క్లిష్టమైన పాత్రలో నైనా భానుప్రియ లీనమై నటిస్తుంది- కాదు, కాదు జీవిస్తుంది అనడానికి నిదర్శనం ఈ మధ్యనే విడుదలైన 'కాష్మోరా' చిత్రం. అందులో చలాకి ఐన యువతిగా, గాలి సోకిన పడతిగా (హిస్టీరిక్‌గా), చిన్న పిల్లలాగా భానుప్రియ చూపించిన నటనా పాటవం అనితర సాధ్యం.

నేటి సమాజంలోని 'స్త్రీ' సమస్యలకు అద్దం పట్టిన 'అనాదిగా ఆడది' చిత్రంలో 'భాను' నటన పాషాణ హృదయాలను కూడా కరిగించేదిగా వుంది.

అటువంటి అపురూపమైన నటి తెలుగు చిత్రరంగంలో వున్నందుకు గర్వపడుతున్నాను.

భానుప్రియ అభిమానిగా ఆమె కథాబలం వున్న చిత్రాల్లో మాత్రమే నటించి తన ఇమేజిని మరింత పెంచుకోవాలని ఆశిస్తున్నాను.

భానుప్రియ కమల్ హాసన్ ప్రక్కన నటిస్తే చూడాలని వుంది.

—ఐరేని శ్రీనివాస్‌గౌడ్,
రామాయంపేట, మెదక్

* * *

నా అభిమాన నటుడు చిరంజీవి. నటనా చాకచక్యంతో, ఇతరులను ఇట్టే ఆకర్షించగల నేర్పరి చిరంజీవి. యాక్షన్ చిత్రాల ద్వారానే చిరంజీవికి మంచి ఫాలోయింగ్ ఏర్పడిందని నా అభిప్రాయం.

అచిర కాలంలోనే ఇంతటి ప్రేక్షకాదరణను పొందగలిగిన చిరంజీవిగారు, నిజంగా



అభినందనీయులు: కేవలం కృషితో, అభిమానుల ఆదరణతోను, — పైకొచ్చిన నటుడు చిరంజీవి. ఆయన కృషి ఎప్పుడూ ఇలాగే కొనసాగుతుండాలని, అభిమానిగా అభిలాష, చిరంజీవిగారు పోరాట దృశ్యాలలో ప్రదర్శించు, నైపుణ్యం ప్రశంశనీయం. అపూర్వం.

చిరంజీవి ప్రస్తుతం, అధికంగా యాక్షన్ చిత్రాలలో నటిస్తున్నా, కనీసం నాలుగు చిత్రాలలో కథాబలంగల ఒక్క చిత్రం లోనయిన, నటించాలని నా సూచన: చిరంజీవిగారు వెరైటి పాత్రలు ఎక్కువగా నటించి, మరింత ప్రేక్షకాదరణ పెంపొందింప జేసుకోగలరని ఆశిస్తున్నాను.

జి. యమధర్మరాజు,
ఎస్. కె. డి. నగర్, ఆదోని

* * *

నా అభిమాన నటుడు సూపర్‌స్టార్ కృష్ణగారు. నేను నిజంగా దేవుణ్ని చూడలేదు కాని ఆ దేవుణ్ని మా కృష్ణలోనే చూశాను. వ్యక్తిగతంగా నేను కృష్ణగారిని అన్నయ్యగా, నా ప్రాణంకంటే ఎక్కువగా ఆరాధిస్తాను, పూజిస్తాను. అవసరం వస్తే నా ప్రాణాలు కూడ సంతోషంగా ఇస్తాను కాని వెనుకాడను. ఆకాశంలో నక్షత్రములు ఎన్ని ఉన్న చంద్రుడు ఒక్కడే! అలాగే సినీ ఫీల్డులో నటులెందరో ఉన్నా సూపర్‌స్టార్ మాత్రం మా కృష్ణ ఒక్కడే! తనకు తనేసాటి అని నిరూపించుకున్నారు. మునుపటి చిత్రాలు అగ్నిపర్వతం, మహాసంగ్రామం,



వజ్రాయుధం, పల్నాటి సింహం అభిమానుల గుండెల్లో చిరస్థాయిగా నిలిచిపోయినవి. అంతేకాక ఈనాటి ఖైదీ రుద్రయ్య చిత్రం మరొక్కసారి మమ్ముల్ని ఆనందపరిచింది. కనుక మా కృష్ణగారు ఇటువంటి మరెన్నో చిత్రాలలో పెద్ద పాత్రలు పోషించి, ఏ నటుడు చేయలేని పాత్రలో జీవించి చిరకాలం మా హృదయంలో చిరస్థాయిగా నిలిచిపోవాలని నా కోరిక.

ఆర్. దత్తాత్రేయ, దేవినగరు, బళ్లారి

* * *

చిత్రరంగ ఆకాశపథాన ఓ తార వెలిసింది. గగనం మరింత అందంతో మెరిసింది. అంతరిక్షాన నక్షత్రాలు ఎన్ని వున్నా కొత్త తారలకు ఎప్పుడూ స్వాగతమే. ఆ ధ్రువతారే నా అభిమాన నటుడు అక్కినేని నాగార్జున. క్రమశిక్షణ, సిన్సియారిటి, ఉత్సాహం, పట్టుదల పంట ఒక నటుడి కుండవలసిన లక్షణాలన్ని అతనిలో వున్నాయి. అంతేగాక నాగార్జున నాట్యంలోను, ఫైట్స్‌లోను, హార్స్‌రైడింగ్ మున్నగు విద్యలలో శిక్షణ పొందాడు. తొలి చిత్రమైన "విక్రమ్"లో అతని నటన ప్రశంసనీయ మైనది. కాని భావాలని ప్రకటించడం లోను, డైలాగ్ డెలివరిలోను నాగార్జున మరింత శ్రద్ధ



వహించవలసి వున్నది. తండ్రి అడుగుజాడల్లో ప్రవేశిస్తున్న "నాగార్జున" నటనలో ఆయనకు వారసుడు కావాలని, తండ్రిలా ఎన్నో విజయాలను అందుకోవాలని ఓ అభిమానిగా నేను ఎప్పుడూ కోరుకుంటాను.

— డి. శ్రీనివాస్, తెనాలి □

సృష్టి న్యాయం తప్పినా, వృత్తి ధర్మం తప్పినా ఈ లోకానికే అనర్థం !

దాసరి నారాయణరావు

శ్రీ భ్రమరాంబికా ఫిలింస్



# ధర్మపీఠం దద్దరిల్లింది

నిర్మాత: కె. కేశవరావు

సహనిర్మాత: బొడ్డు సత్తిరాజు

కెమెరా: పి. శరత్‌బాబు

సంగీతం: జె.వి. రాఘవులు



"జగన్మాత"లో కె. ఆర్. విజయ



"మొనగాడు"లో రజని, అర్జున్

# సినిమా విశేషాలు

-జి.వి.జి.

## త్వరలో "కచదేవయాని"

"ఈ చిత్రం కోసం బ్రహ్మాండమైన సెట్లు చాలా నిర్మించాం. మైసూరు, శ్రీరంగపట్నం, బృందావన్ గార్డెన్స్, బెంగళూరు, తలకోన వగైరా పలు ప్రాంతాలలో జరిపిన చిత్రీకరణ ఈ చిత్రంలో హైలైట్ అని చెప్పొచ్చు," అన్నారు సి. ఎస్. రావు, బి. యం (లిట్). ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎ. పరంధామరెడ్డి, ఎన్. జగ్గుబాబు సపరసభరితంగా నిర్మించిన చంద్రోదయా ఫిలిమ్స్ వారి పౌరాణిక చిత్రంలో చక్రపాణి, విజయరంజని, సత్యనారాయణ, జయలలిత, శ్రీనివాస్, గిరిబాబు, కోట శ్రీనివాసరావు, ఎ. బి. శర్మ, ద్వారకానాథ్, కె. కె. శర్మ, మిఠాయి చిట్టి, ప్రభ, శ్రీజయ, ప్రమీలాబాయి, సంధ్య, లక్ష్మిచిత్ర పాల్గొన్నారు. కొండవీటి వెంకటకవి సంభాషణలకర్త, కె. వి. మహదేవన్ స్వరకల్పనలో కొసరాజు, సిరివెన్నెల సీతారామశాస్త్రి, శ్రీనివాస్ గీతాలు రాశారు. పి. భాస్కరరావు ఛాయ, దిలీప్‌సింగ్ శిల్పం, రాజు నృత్యాలు, కొంతి వెంకటేశ్వరరావు సహకార దర్శకత్వం; అనిల్‌మల్నాడ్ కూర్పు, పార్థసారథి – నాగేశ్వరరావు ప్రొడక్షన్, కె. వి. ఆర్. మూర్తి నిర్మాణతతో పి. ఎస్. గోవిందరావు సమర్పణ.

## "చాదస్తపు మొగుడు"లో మొగుడికి మొగుడు

శ్రీలక్ష్మిని కట్టుకున్నందుకు సుత్తి వీరభద్రరావు పడుతున్న పాట్లు అంతా అంతా కాదు. వుండు మీద కారంలా బావమరిది వేలు ఒకడు. అందుకే వీరభద్రరావు "ఒసేయ్! నీకు పిచ్చి రోజు రోజుకీ ముదిరిపోతోంది. వారానికో సారి పని లేని మీ తమ్ముడు ఇక్కడికి రావడం, ఇంట్లోదంతా తినేయడం. నా మీద నిందలు వేయడం, నువ్వేమో నా మీద పడి ఏడవడం ... వాడి వెధవ్వేషాలు గురించి నువ్వు పట్టించుకోకే. చీర తెస్తానని చెప్పి రెండొందలు తీసుకెళ్లాడు. తీసుకొచ్చాడా చచ్చాడా వెధవ సోదాబుడ్డి కళ్ళద్దాలూ వాడూనూ," అంటూండగానే వేలు ఎక్కడ్నుంచో ఊడి పడ్డాడు.

"అక్కా! అక్కా! మన హీరో కూడా ఇక్కడే ఉన్నాడే!" అన్నాడు.

బోధపడక "ఏమిట్రోయ్! హీరో, విలన్ – అంటున్నావు? ఇదేమైనా కొత్త కథా?" అన్నాడు.

"అదేమిటి బావా, ఏమీ తెలియనట్టు అడుగుతావేంటి? మొన్న షాపులో కొన్న మామిడంచు చీరను మా అక్కకిచ్చి నువ్వు హీరో అనిపించుకున్నావు కదా?"

"మామిడంచు చీరా!" శ్రీలక్ష్మి తృళ్ళి పడింది. "అదేమిట్రా ఆయనసలు తేనే లేదు."

వేలు ఒక్కడుగు ముందుకు వేసి, "అదేమిటి, బావా! ఆ రోజు మా అక్కకు చీరకొందామని నేను అయిదొందలు పుచ్చుకొని షాపు కెళ్తే, షాపు బయటే గూర్ఖాలా నిలబడి, నా మీద పడి, నేనే కొంటాన్రోయ్ .– అన్ని చించలేస్తూ చబ్బు లాక్కున్నావ్ – మర్చిపోయావా?" అన్నాడు.

"ఒరే – ఒరే – ఒరే అప్రాచ్యుడా! అబద్ధాలాడితే అడుక్కు తింటావ్?" అన్నాడు వీరభద్రరావు.

"అక్కా! బావ అన్నం తిన లేదుగా? అయితే, ఆ మామిడంచు చీర విషయం తేలే వరకు వంటను పెట్టిలో పెట్టి తాళం వేసెద్దాం రా!" అంటూ వేలు కదిలాడు.

"నేను మా ఆవిడకు మొగుడ్ని. నాకు వీడు మొగుడు. అన్నం తిన్న తర్వాతైనా వచ్చాడు కాదు దరిద్రుడు!" అంటూ ఏడ్పు ముఖం పెట్టాడు వీరభద్రరావు.

శరత్ దర్శకత్వంలో మిద్దే రామారావు నిర్మించిన శ్రీ రాజ్యలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ 11 వ చిత్రం "చాదస్తపు మొగుడు" త్వరలో విడుదలవుతుంది.

## "ఘనవిజయం"

"జూలై 24 న ప్రారంభోత్సవం చేశాం. ఆగస్టులో జరిగే మరో షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది. పాము, కోతి, పొట్టేలు కూడా నటిస్తున్నాయి," అన్నారు ఎన్. వి. సుబ్బరాజు. ఈయన కథ సమకూర్చి, సమర్పించే శ్రీ వాణి ఆర్ట్సు వారి పై చిత్రంలో శరత్‌బాబు, గొల్లపూడి మారుతీరావు, కోట శ్రీనివాసరావు, పద్మనాభం, భీమరాజు, రాజశేఖరరెడ్డి, డాక్టర్ శివప్రసాద్, అశ్విని, అన్నపూర్ణ, మాస్టర్ రాధా నటిస్తున్నారు. కొంపెల్ల విశ్వం మాటలు, ఆత్రేయ పాటలు, రాజ – కోటి సంగీతం, ఆర్. కె. రాజు ఛాయ, సుందరరాజన్ శిల్పం, సాంబశివరావు సాహసాలు, కృష్ణ చంద్ర సంయుక్త దర్శకత్వం, కోన కృష్ణమూర్తి సహకార దర్శకత్వం, గౌతంరాజు కూర్పుతో పొన్నతోట రఘురాం, మోహన్‌రెడ్డి ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్‌లు. వి. ఎస్. రంగనాథవర్మ, బి. అచ్యుతరామరాజు నిర్మించే ఈ చిత్రానికి కె. ఆర్. వెంకటేశ్ దర్శకుడు.

## దాసరి దర్శకత్వంలో కృష్ణంరాజు "బ్రహ్మనాయుడు"

"దూరంగా ఎక్కడో ఉన్న దీవి. అక్కడ కూపస్థమండూకాల్లా జీవిస్తూ బానిసలుగా నికృష్టపు బతుకు బతుకుతూన్న అమాయకపు ప్రజానీకానికి బయట ప్రపంచం నాగరికతలో ఎంతగా పురోగమించిందో తెలియదు. వారికి దాస్య శృంఖలాల నుంచి విముక్తి కలిగిస్తాడు



వూళ్ళోకి ఓ హీరోయిన్ వచ్చింది సార్! జనం అంతా అటు వెళ్ళారు!

సినిమా

బ్రహ్మనాయుడు. దానవుడు మానవుడుగా, మానవుడు మహనీయుడుగా మారిన పాత్రలో కృష్ణంరాజు విజృంభించారు. ఆగస్టు 1 నుంచి 10 వరకు మొదటి షెడ్యూల్ జరిపాం. సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్‌లలో కూడా ప్రతి నెలా 1–10 తేదీల మధ్య జరిగే నాలుగు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు దాసరి నారాయణరావు. ఈయన స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో ఆర్. కొతినేని నిర్మిస్తున్న కొతినేని పిక్చర్స్ వారి పై చిత్రంలో కృష్ణంరాజు, సుజాత, సుహాసిని, సత్యనారాయణ, గుమ్మడి, ప్రభాకరరెడ్డి, గిరిబాబు, త్యాగరాజు, హరిప్రసాద్, పి. ఎల్. నారాయణ, చలపతిరావు, వేలు, నాగేషబాబు, టామ్, సారథి, షావుకారు జానకి, నిర్మల, శ్రీలక్ష్మి వగైరా తారాగణం. కొమ్మనాపల్లి గణపతిరావు కథకుడు. జె. వి. రాఘవులు సంగీతం, పి. ఎస్. ప్రకాశ్ ఛాయ, శ్రీమతి మోహన శిల్పం, తార నృత్యాలు, యమ్మనూరు ప్రభాకరరావు సంయుక్త దర్శకత్వం, జి. జి. కృష్ణారావు కూర్పు తెరవెనుక హంగులు.

## కె. వాసు దర్శకత్వంలో ముగ్గురు హీరోలు

"పరుచూరి సోదరులు స్క్రిప్టు తయారు చేస్తున్నారు," అన్నారు కె. వాసు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో అన్నమరెడ్డి కృష్ణకుమార్ సమర్పించే శ్రీ కనకమహాలక్ష్మి క్రియేషన్స్ వారి చిత్రంలో చంద్రమోహన్, నరేష్, రాజేంద్రప్రసాద్ హీరోలు.

విజయశాంతి, చిరంజీవి, "చాణక్య శపథం"లో



"వాదస వ్వ మొగుడు"లో సుమన్, భానుప్రియ








కొడుకు : "నాన్నా! ఎందుకు అమ్మ ఇందాకట్నుంచి 'జగమే మాయ' పాటే పాడుతోంది?"

తండ్రి : "నేను సినిమాకు తీసుకెళ్ళి చాలా కాలమైందని ఇలా ఎద్దేవా చేస్తోందిరా!"

★ ★ ★ ★ ★ ★

ఒకడు : "అది కాదయ్యా... బస్సు ప్రమాదంలో పన్నెండు మంది తీవ్రంగా గాయపడ్డా- నువ్వు ముందు అట్టే దెబ్బలు తగలని కండక్టర్‌ని మాత్రం బయటకు లాగి ఎందుకు కాపాడినట్టు?"

ప్రయాణీకుడు : "అతగాడు నాకు ఇరవై అయిదు పైసల చిల్లర బాకీ ఉన్నాడు మరి!"

★ ★ ★ ★ ★ ★

రాము : "మా నాన్న ఎంత కరెక్టో తెలుసా? అగ్గిపెట్టె కొంటే, అందులో సరిగ్గా యాభై పుల్లలు ఉన్నాయో- లేవో లెక్కపెట్టి కాని మరి కొనడు."

సోము : "మా నాన్న మరినూ.... ఆ యాభై పుల్లలూ సరిగ్గా వెలుగుతాయో- లేవో చూసి కాని మరి కొనడు."

★ ★ ★ ★ ★ ★

యజమాని : "ఆ మనిషి మన హోటల్లోంచి లేచి చక్కా వెళ్ళిపోయాడేమిటి? అతనితో నువ్వేం అన్నావ్?"

సర్వర్ : "ఇక్కడ కాఫీ బాగుంటుందా" అని అడిగాడండి. "ఓ..... మీ ఇంటి కాఫీలా ఉంటుంది...." అన్నానండి. అంతే!"

★ ★ ★ ★ ★ ★

ఒకడు : "ఒరేయ్, మిత్రమా! నే చస్తే, ఒక అయిదు రూపాయలు ఖర్చుపెట్టి ఒక దండ తెచ్చి నా శవం మీద వేస్తావా?"

ఇంకొకడు : "మిత్రుడ్ని అయినందుకు ఆ మాత్రం చేయలేక పోతానట్రా?"

ఒకడు : "అయితే, అవసర మొచ్చింది. నా కిప్పుడే ఆ అయిదు రూపాయలివ్వు. నే చచ్చాక దండ వేయనక్కర్లేదులే!"

★ ★ ★ ★ ★ ★

భార్య : "ఏమండీ... మన అబ్బాయి పొరబాటున ఐదు పైసల నాణేన్ని మింగేశాడండి. వెంటనే డాక్టర్ దగ్గరికి తీసుకెళ్ళాలి."

భర్త : "ఛీ.. ఛీ... మన అంతస్తేమిటి! ముష్టి అయిదుపైసల నాణేన్ని మింగాడని డాక్టర్ ఎదుట ఏ ముఖం పెట్టుకుని చెప్పేదే- సిగ్గు చేటు!"

★ ★ ★ ★ ★ ★ ★

ముసలామె : "ఓయబ్బో! నీకే కాదు మనమరాలా! నాకూ ఉన్నారు బాయ్ ఫ్రెండ్సు!"

మనమరాలు : "ఏమిటమ్మమ్మా నువ్వంటున్నది?"

ముసలామె : "నిజమేనే.... రాధాబాయ్, జమునాబాయ్, కమలాబాయి.... వీళ్ళంతా నా ఫ్రెండ్స్ కారేమిటి?"

★ ★ ★ ★ ★ ★

ఒక ఖైదీ : "రామరామ.... ఎందుకొచ్చి ఈ జైల్లో పడ్డానురా బాబూ- అనిపిస్తోంది. అన్నం నిండా రాళ్ళే!"

రెండో ఖైదీ : "మీరు ఏ నేరం మీద అరెస్ట్ అయ్యారేమిటి?"

ఒక ఖైదీ : "బియ్యంలో రాళ్ళు కలిపి అమ్మినందుకు."

★ ★ ★ ★ ★ ★

ఒకడు : "ఏముందయ్యా ఈ జోకులో నా బొంద! చించి పారేయ్. ఈ చచ్చుజోక్‌ను ఏ పత్రికకైనా పంపావో- నీ చావు తెలివికి ఏ సంపాదకుడైనా నవ్వుకుంటాడు."

మరొకడు : "నవ్వుకుంటాడా? మనకు కావలసింది అదేగా?"

—(జి. వి. జి)

## కృష్ణ, జి. రామ్మోహనరావు కాంబినేషన్‌లో శుభోదయా ఆర్ట్ ప్రొడక్షన్స్ చిత్రం

"బ్రహ్మాస్త్రం, శాంతి నివాసం- చిత్రాల తర్వాత కృష్ణగారు నేను కలిసి పని చేసే మూడవ చిత్రమిది. షూటింగ్ వచ్చే జనవరిలో ప్రారంభమై, మార్చిలో పూర్తవుతుంది," అన్నారు జి. రామ్మోహనరావు. ఈయన దర్శకత్వంలో వై. సత్యనారాయణ నిర్మించె శుభోదయా ఆర్ట్ ప్రొడక్షన్స్ చిత్రంలో విజయశాంతి నాయిక. సత్యనారాయణ, నూతన్‌ప్రసాద్, గొల్లపూడి మారుతీరావు, కోట శ్రీనివాసరావు, శుభలేఖ సుధాకర్, నిర్మల, వై. విజయ, అన్నపూర్ణ ఇతర పాత్రధారులు. చక్రవర్తి సంగీతం, వి.ఎస్.ఆర్. స్వామి ఛాయ నిర్వహిస్తారు.

## కృష్ణంరాజుతో "ధర్మక్షేత్రం"

"విజయదశమినాడు ప్రారంభోత్సవం," అన్నారు బి. భాస్కరరావు. ఈయన దర్శకత్వం వహించే హిరణ్మయి సినీ ఇండస్ట్రియల్ కార్పొరేషన్ వారి పై చిత్రానికి సుదర్శన రెడ్డి నిర్మాత.

"పసుపుతాడు"లో రాధ




ఉదయానే మీరు లేచి
వేచిచూచేదిఎవరికోసం?

# దినపత్రిక కోసమే కావచ్చు
# మీరే తరహా పత్రిక కోసం
# ఎదురు చూస్తున్నారో ఆ కోవలోనిదే

## ఆంధ్రజ్యోతి దినపత్రిక
## ఆరుకోట్ల జనపత్రిక

వార్తా పత్రికా రంగంలో 'ఆంధ్రజ్యోతి'కి రెండున్నర దశాబ్దాల చరిత్ర వున్నది. వార్తలందించడంలోను, వ్యాఖ్యలు వివరించడంలోను తనదంటూ ఒక ప్రత్యేక శైలినీ, స్థాయినీ రూపొందించుకొన్న 'ఆంధ్రజ్యోతి' - తన సేవలందించడానికి త్వరలో హైదరాబాద్ నుంచి కూడా వెలువడుతున్నది

'ఆంధ్రజ్యోతి' లక్షలాది పాఠకులకు పత్రిక మాత్రమే కాదు; అది వారి జీవితాలలో అంతర్భాగం కూడా

'ఆంధ్రజ్యోతి' ప్రకటించే పత్రికల సముదాయం విశిష్టమైనది అన్ని వైపుల నుండి తాజా వార్తలను మీ కందించే విలేకరుల సంఖ్య మిన్న

'ఆంధ్రజ్యోతి' హైదరాబాద్ ఎడిషన్ మీకందించే విశేషాంశాలు.

**వనితాభ్యుదయం:** ఇంటిని పిల్లల్ని సక్రమంగా చూసుకోవడంలో స్త్రీకి స్వేచ్ఛ, ఆర్థిక స్వాతంత్ర్యమూ కావాలి అప్పుడే ఆ కుటుంబం సుఖ సంతోషాలతో ఓలలాడుతుంది మహిళల వికాసానికి, అభ్యున్నతికీ తోడ్పడే శీర్షిక 'వనితాభ్యుదయం'

**విజ్ఞాన చంద్రిక:** ఇది సైన్స్ యుగం. అణు కేంద్రంనుంచి విశ్వాంతరాళం వరకుఎన్నో రహస్యాలు ఆ రహస్యాలను విజ్ఞాన శాస్త్రం వెలికి తీస్తున్నది. ఇవన్నీ మీ మెదడుకు ఎక్కేలా, మీ మనస్సుకు పట్టేలా 'విజ్ఞాన చంద్రిక' శీర్షిక ద్వారా అందిస్తోంది 'ఆంధ్రజ్యోతి'

**ముత్యాలపందిరి:** జీవితంలో ఎందరో మహాను భావులు తారసపడతారు వారందరికీవందనాలు అర్పిస్తూ మీ మీద హాస్యపు జల్లులు కురిపిస్తూ మిమ్మల్ని మురిపించే 'ముత్యాల పందిరి' 'ఆంధ్రజ్యోతి' శీర్షికల్లో ఒక ఆణి ముత్యం

**నల్లంచు తెల్లచీర:** ఈ దశాబ్దపు సాటిలేని మేటి రచయిత యండమూరి వీరేంద్రనాథ్ మొట్టమొదటి సారిగా'ఆంధ్రజ్యోతి' పాఠకులకోసం ప్రత్యేకంగారాస్తున్న సీరియల్ సమ్మోహనాస్త్రం 'నల్లంచు తెల్లచీర'

**సర్జన్ సలహాలు:** మనసు ఉల్లాసంగా ఉంటేనే మనిషి ఏమైనా చేసేది. అందుకు ఆరోగ్యం ముఖ్యం ఆరోగ్య, వైద్య సమస్యలపై ప్రత్యేకంగా ఆ రంగంలో నిపుణులచేత మీకు వారం వారం 'సర్జన్ సలహాలు' ఇప్పిస్తుంది 'ఆంధ్రజ్యోతి.'

**కోర్టులు - చట్టాలు:** చట్టాలకి కళ్ళు లేవు నిజమే, కాని మనం మాత్రం ఎల్లప్పుడూ కళ్ళు తెరుచుకుని వుండాలి. దానికి మీకు తోడ్పడుతూ అర్థం లేని చట్టాల రహస్యాలు మీకు అర్థమయ్యే రీతిలో సుంభ శైలిలో అందించే శీర్షిక 'కోర్టులు - చట్టాలు' 'ఆంధ్రజ్యోతి' ప్రత్యేకత.



ఆంధ్రజ్యోతి
హైదరాబాద్ ఎడిషన్
1-9-86 నుంచి ప్రారంభం



# వినాయకుని విభవము

-సుజాత

ఒక రోజు మద్రాసు సెయింట్ బీడ్స్ హైస్కూల్ నిర్వాహక వర్గంలోని కొందరు 'ఫాదర్స్' మా ఇంటికి వచ్చారు- వాళ్ల స్కూల్లోని ఏదో ఉత్సవానికి నన్ను ఛీఫ్ గెస్ట్‌గా రావాలని కోరడానికి.

ఆ ఫంక్షన్ సాయంకాలం. తప్పకుండా వస్తానన్నాను. వాళ్ళెంతో సంతోషించారు.

వాళ్ళల్లో ఒకాయన "ఈ వేళ పండగకదా?" అని అడిగారు.

"అవును, వినాయక చవితి," అన్నాను.

"క్షమించాలి పండగ పూట మిమ్మల్ని డిస్టర్బ్ చేసినందుకు" అన్నారాయన.

"మేం పండగ చేసుకోడం లేదండి".

"ఏం"?

"మా అబ్బాయి ఈ ఊళ్లో ఎప్పుడుంటే, ఆ రోజంతా మాకు పండగ."

"ఇప్పుడు మీ అబ్బాయి ఎక్కడున్నాడు"?

"కొడైక్కనాల్ రెసిడెన్షియల్ స్కూల్లో థర్డ్ స్టాండర్డ్ చదువుకుంటున్నాడు. ఎంత ప్రయత్నించినా ఇక్కడ ఏ మంచి స్కూల్‌లోనూ మా అబ్బాయికి సీట్ దొరకలేదు. అందుకే అంత దూరం పంపించ వలసి వచ్చింది. ఏటా ఏ రెండు మూడు సార్లో మద్రాసు రావడానికి వీలవుతుంది. అబ్బాయి మా మధ్య ఉన్నప్పుడే మాకు పండగ", అన్నాను.

"అలాగా!" అన్నారాయన.



ఆ సాయంకాలం వాళ్ళ స్కూల్ ఫంక్షన్‌కి హాజరయ్యాను. అక్కడ మా అబ్బాయి వయసు గల విద్యార్థులెందరో ఉన్నారు. ఈ స్కూల్‌లోనే మా అబ్బాయికి సీటు దొరికి ఉంటే, నేనిలా ఛీఫ్ గెస్ట్‌గా వచ్చినందుకు ఎంతగానో ఆనందించే వాడు కదా అనుకున్నాను.

వార్షిక పరీక్షానంతరం మా అబ్బాయి మద్రాసుకు వచ్చాడు. మా వారు, నేను ఎంతగా మురిసి పోయామో, సెలవులు ముగిసి మా అబ్బాయి కొడైక్కనాల్‌కు వెళ్ల వలసిన రోజు దగ్గర పడే కొద్దీ అంతగా లోలోన బాధ పడిపోసాగా.

ఆ మర్నాడు మా అబ్బాయిని కొడైక్కనాల్‌కు పంపించాలి. ఆ రోజు నేను గొంతులో పచ్చి మంచినీళ్లయినా పోసుకుని ఎరగను. నా స్థితి చూసి మా వారు" నువ్విలా ఉంటే అబ్బాయి మరింత బాధ పడి పోతాడు. పైకి, ఎంతో ఉత్సాహంగా కనిపించాలి. ఇలాంటి సమయాలలో నిజ జీవితంలో కూడా నటించాలి", అన్నారు.

మాతృహృదయమంటే ఏమిటో ఆయనకు తెలియనిది కాదు.

ఆ రాత్రంతా నాకు కునుకు పట్టలేదు.

మర్నాడు భళ్ళున తెల్లవారింది. మా అబ్బాయి లేచి ప్రయాణానికి అన్నీ సిద్ధం చేసుకుంటున్నాడు. "ఫస్ట్ టర్మ్ అయ్యాక వస్తానమ్మా" అన్నాడు.

అబ్బ.... ఎన్ని నెలలు..... ఎన్ని రోజులు..... ఆలోచించడానికి నా మెదడు మొద్దుబారి పోయింది.

మా అబ్బాయికి తల దువ్వుతున్నప్పుడు మాత్రం నాకు ఉప్పెనలా దుఃఖం ముంచుకొచ్చింది.

ఇంతలో టెలిఫోన్ బెల్ మోగింది..... వెళ్లి రిసీవర్ అందుకున్నాను.

"హల్లో! సెయింట్ బీడ్స్ హైస్కూల్ నుంచి మాట్లాడుతున్నామండి..... ఆ రోజు మీ ఇంటికి వచ్చాం కదా · మిమ్మల్ని ఛీఫ్ గెస్ట్‌గా ఆహ్వానించడానికి? ఇటుపైన మీకు ప్రతి రోజూ పండగే. మీ అబ్బాయికి మా స్కూల్లో సీటు కేటాయించాం. వెంటనే కొడైక్కనాల్ నుంచి టి. సి. వగైరాలు తెప్పించండి." అన్నారా ఫాదర్.

క్షణకాలం నా చెవులను నేనే నమ్మలేక పోయాను.

నిజమే..... ఆ ఫాదర్ అన్నట్లు ఇప్పుడు మాకు ప్రతిరోజూ పండగే! మా ఒక్కగాని ఒక్క అబ్బాయి సెయింట్ బీడ్స్ హైస్కూల్‌లో ఫోర్త్ స్టాండర్డ్ చదువుకుంటూ మాతోనే ఉంటున్నాడు.

వినాయక చవితినాడు ఆ ఫాదర్స్ మా ఇంటికి రాకపోతే, మా అబ్బాయికి మద్రాసులోనే సీటు దొరికేదా?

అంచేత, ఇది నిజంగా వినాయకుని విభవమే, వినాయకుని కటాక్షమే!

(జి. వి. జి.)



# "చలన చిత్ర రంగంలో కూడా చరిత్ర సృష్టించాలని ఉంది!"

## –కొత్త హీరో చల్లా రామకృష్ణారెడ్డి

"చాలామంది సినిమారంగంలోంచి రాజకీయరంగంలోకి వస్తే, నేను రాజకీయ రంగం నుంచి సినిమా రంగంలోకి వచ్చాను. అంతకుముందు వ్యవసాయ రంగంలో కూడా ఉన్నాను", అన్నారు చల్లా రామకృష్ణారెడ్డి.

స్ఫురద్రూపం. గంభీరమైన కంఠం. ఇంకా ఏదో సాధించాలనే తపన గల చూపులు. నేటి యువతరం కోరే స్పీడు, గ్రైట్, డైనమిజం ఆయనలో ఉన్నాయి. "నాకు కీర్తి, కనకం ఏనాడో లభించాయి. అసలు నా జీవితం మొదట్నుంచీ అనూహ్యమైన మలుపులు తిరిగి, నేను ఆశించని గుర్తింపు తెచ్చి పెట్టింది. ఎమర్జెన్సీ తరుణంలో కుత్సితమైన రాజకీయాల మూలంగా బందీనయ్యాను. విముక్తి పొందిన వెంటనే కృషీవలుడనై 'కృషి పండిట్' బిరుదు పొందాను. అలాగే 1982లో నాసాకింద అరెస్టయి, విడుదలైన వెంటనే పాణ్యం నియోజక వర్గం నుండి అత్యధికమైన మెజారిటీతో ఎం. ఎల్. ఎ. గా ఎన్నికయ్యాను. నా నీతి నిజాయితీ, కృషి గుర్తించకపోతే ప్రజలు నన్నంతగా ఎలా ఆదరిస్తారు?" అన్నారు చల్లా రామకృష్ణారెడ్డి.

ఈయన స్వస్థలం కర్నూలు జిల్లాలోని ఉప్పుపాడు. "మాది కాస్తో కూస్తో పేరు మోసిన కుటుంబం. కొండలు కోనలతో బాగా వెనుకబడిన ప్రాంతం మాది. సరైన నీటి పారుదల వసతులు లేవు. క్రిమి సంహారిణీ వగైరాలను ఉపయోగించడం పాపంగా భావించే అమాయకులు అక్కడి రైతులు. మూఢ నమ్మకాలతో ఎన్నో ఇడుములకు లోనయ్యేవారు. వాళ్ళ పాట్లు చూస్తుంటే నా గుండె తరుక్కు పోయేది. మా గ్రామానికి ఏదో చెయ్యాలి. ప్రగతిపథం వైపు పయనించి, అక్కడి రైతులు బంగారు పంటలు పండించాలి. నేను అగ్రికల్చర్ బి. ఎస్‌సి పట్టా పుచ్చుకున్నాక ఆ ఉన్నత విద్యను సార్థకం చేసుకున్నాను. విప్లవాత్మక మైన కృషితో సస్యశ్యామలం చేశాను. అక్కడి భూముల విలువను పెంచాను. అలా ఎంతో మందికి మార్గదర్శకుణ్నయ్యాను. ఆ ప్రాంతాలలో తరచు జరిగే పొలం దొంగతనాలను అరికట్టాను. అంతటితో నాకు తృప్తి కలగలేదు. నా సేవ మా గ్రామానికే పరిమితం కాకూడదు. రాష్ట్ర వ్యాప్తం చేయాలంటే రాజకీయాలలోకి దిగాలి. దిగాను. అకుంఠిత దీక్షతో నిస్వార్థ సేవ చేశాను" అంటూ రామకృష్ణారెడ్డి ఇంకా ఇలా అన్నారు:

"ప్రజలను చైతన్య వంతుల్ని చేయగల మహత్తరమైన సాధనం సినిమా. ఈ సాధనం నాకు ఉపకరిస్తుందా, లేక నేను దీనికి ఉపయోగపడగలనా అని ఆలోచిస్తున్న సమయాన కనీసం పది పదిహేను చిత్రాలలో నటించి, పరిణతి పొందితే గాని లభించని నాయక పాత్రలు నాకు 'సత్యాగ్రహం, సైరా చిన్నప రెడ్డి' చిత్రాలలో అప్రయత్నంగా లభించాయి. పల్లెల్లో జరిగే దురాచారాలను, దుష్టశక్తులను ప్రతిఘటించే పాత్ర 'సత్యాగ్రహం'లోనిది. ఇది నా జీవితానికి చాలా దగ్గరైన పాత్ర. స్వాతంత్ర్య సమర యోధుని పాత్ర 'సైరా చిన్నప రెడ్డి' లోనిది. రెండూ డైనమిక్ పాత్రలే. మొదటి చిత్రంలో జంధ్యాల గారి దర్శకత్వంలో, రెండో చిత్రంలో కమలాకర కామేశ్వరరావు గారి దర్శకత్వంలో నటించడం నా పూర్వజన్మ సుకృతమేననుకోవాలి. ఈ రెండు చిత్రాలూ విడుదలవక ముందే నాకు ఓ ఇమేజ్ అంటూ ఏర్పడి. అలాంటి పవర్‌ఫుల్ పాత్రలకే మరికొన్ని చిత్రాలలో ఆఫర్లు రావడం– ఈ రంగం ద్వారా కూడా నేను చేయవలసింది ఎంతో ఉందన్నట్లనిపిస్తోంది.

మా సోదరులలో ఎం. ఎ. పట్టభద్రుడొకాయన మా గ్రామంలో సర్పంచ్. మరో సోదరుడు తాలూకా అగ్రికల్చరల్ మార్కెట్ కమిటీ ఛైర్మన్. మరో సోదరుడు కో ఆపరేటివ్ సొసైటీ ప్రెసిడెంట్. ఇంకో సోదరుడు న్యాయవాది.

నేనిలా సినిమా హీరోనైపోయాను. ఈ సినిమా రంగంలో ఎంతో కాలంగా వెనుకబడి ఆర్థిక బాధ ననుభవిస్తున్న వృద్ధ నటీనటులకూ, సాంకేతిక నిపుణులకు ఓ ట్రస్ట్ ద్వారా చేయూత నివ్వాలని ఉంది. నా చిత్రం విడుదలైన రోజున ఫిలిమ్ జర్నలిస్టుల నిధికి పది వేలు విరాళంగా ఇస్తాను. మా ప్రాంతాల్లో వెనుకబడిన మారుమూల గ్రామాల్లో ఉచిత వైద్య సదుపాయాల నిమిత్తం రెండు లక్షల వ్యయంతో ఒక మొబైల్ వాన్‌ని ఏర్పాటు చేయబోతున్నాను. ఇలా రాష్ట్ర వ్యాప్తంగా కూడా నాశక్తి వంచన లేకుండా సేవ చేయాలని ఉంది. చేసి తీరుతాను", అన్నారు కార్యదక్షుడు చల్లా రామకృష్ణారెడ్డి.

–(జి. వి. జి.)

# సర్ఫ్ కొనడంలో మరింత వివేకం ఉంది

"తెలిసే చెప్తున్నా. సర్ఫ్ కొనడంలో ఉన్నంత వివేకం మరి దేనిలోనూ లేదు. దీని పవర్ ప్యాక్డ్ ఫార్ములా సామాన్యం కాదు— అప్పాంగే శక్తి! మీ డబ్బుకి మించిన విలువ ఇస్తుంది!"

**డబ్బుకి మించిన విలువా? అసలే సర్ఫ్ ఖరీదైనది కూడా కదా?**

"చూడండి! దీని వల్ల ఎంత ఎక్కువ ప్రయోజనమో గ్రహించారా మీరు? కేవలం సర్ఫ్ మాత్రమే నా బట్టల్ని అతి తెల్లగా ఉతుకుతుంది. పైగా వాటిని సంరక్షిస్తుంది. అందేత అవి కొత్త వాటిలానే కన్పిస్తాంటాయి. అంటే ఎప్పటికప్పుడు ఆదా— లెక్క కట్టి చూసుకోండి. సర్ఫ్, డబ్బుకి మించిన విలువ ఇస్తుందని అందుకే అన్నాను నేను".

**సరే లలితగారూ, కాని అందుకు సర్ఫ్‌లో ఉన్నది ఏమిటి?**

"ఎంతో ఉంది! ఒక కిలో మామూలు రకం పొడరు ఎంత ఉంటుందో, అంత పొడరు ½ కిలో సర్ఫ్ ప్యాకెట్‌లో ఉంటుంది. అంటే ఒక కిలో మామూలు రకం పొడరు ఉతికేటన్ని బట్టల్ని అర కిలో సర్ఫ్ ఉతుకుతుందన్నమాట. చూశారా, సర్ఫ్ నుంచి మీరు ఎంత విలువ పొందుతున్నారో?"

ఒక కిలో మామూలు రకం పొడరు





½ కిలో సర్ఫ్

**అంటే, ఒక విధంగా, సర్ఫ్ తన ధర తిరిగి చెల్లిస్తుందన్నమాట!**

"ఒక విధంగా ఏమిటి, ఎన్నో విధాలుగా! మనకు లాభమే లాభం. చౌక రకంవి కొనడంలోనూ మంచి నాణ్యమైనది కొనడంలోనూ ఎంతో తేడా ఉంది. అందుకే అంటున్నాను, సర్ఫ్ కొనడంలో మరింత వివేకం ఉందని."




హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తులు



"నాచే మయూరి"లో సుధ

## ముగ్గురు యువహీరోలతో జగపతి చిత్రాలు

దర్శక నిర్మాత, జగపతి పిక్చర్స్ అధినేత వి. బి. రాజేంద్రప్రసాద్ వచ్చే సంవత్సరం మూడు చిత్రాలు ప్లాన్ చేశారు. వాటిల్లో బాలకృష్ణ, వెంకటేశ్, నాగార్జునలు హీరోలు.

## చిత్రీకరణ ముగిసిన "కోనసీమ కుర్రోడు"

"గ్రామీణ వాతావరణంలో సంపూర్ణ వినోదాత్మక చిత్రం," అన్నారు రవిరాజా పినిశెట్టి, ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎ. ఎస్. సుబ్బారావు, కె. రవీంద్రబాబు నిర్మించిన పద్మావతి పిక్చర్స్ వారి పై చిత్రంలో అర్జున్, భానుప్రియ, రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య, నారాయణరావు, రాళ్ళపల్లి, నర్రా వెంకటేశ్వరరావు, డాక్టర్ శివప్రసాద్, నళినీకాంత్, ఉమశ్రీ, వై. విజయ, అన్నపూర్ణ, దేవి, హరిప్రియ, మహిజా నటించారు. సత్యమూర్తి కథ, మాటలు, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. హరి ఛాయ, కృష్ణ శిల్పం, సాహుల్ సాహసాలు, శివశంకర్ నృత్యాలు, రామకృష్ణరాజు – కేశవప్రసాద్ సహకార దర్శకత్వం, వెల్లిస్వామి కూర్పు, వెంకటేశ్వరరావు నిర్వహణతో రాజేంద్రరాజు ప్రొడక్షన్ కంట్రోలర్.

## విద్వాన్ కోట సత్య రంగయ్యశాస్త్రి రచనతో "సుందర కాండ"

పై భక్తి ముక్తిదాయకమైన పవిత్ర గాథను సుప్రసిద్ధ నటీనటులతో భారీ ఎత్తున నిర్మించ డానికి శివకామిని ఫిలిమ్స్ అధినేతలు సన్నాహాలు చేస్తున్నారు. స్వర్గీయ ఘంటసాల అద్భుతంగా గానం చేసిన "భగవద్గీత" వ్యాఖ్యాన కర్త, "ఆంధ్రపత్రిక" దిన, వారఫలాల రచయిత, అష్టావధాని విద్వాన్ కోట సత్య రంగయ్య శాస్త్రి సంభాషణలు, గీతాలు, శ్లోక పంచకాలు రచించడం ఓ విశేషం.

## సినిమా

"సత్యాగ్రహం"లో చల్లా రామకృష్ణారెడ్డి



## పూర్తి కావస్తోన్న "చాణక్య శపథం"

"జూలై 21 నుంచి 31 వరకు నాల్గవ షెడ్యూల్ పూర్తి చేశాం. ఆఖరి షెడ్యూల్ ఆగస్టులో. అంతకు ముందు ఊటీలో చిత్రీకరించిన రెండు పాటలను మా డైరెక్టర్ చాలా కొత్త పంథాలో చిత్రీకరించారు. ప్రత్యేకించి ఏ.జి.పి. గార్డెన్స్‌లో వేసిన బ్రహ్మాండమైన కెమెరా సెట్ హైలైట్ అని చెప్పాలి." అన్నారు డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ అధినేత డి. వి. ఎస్. రాజు. ఈయన నిర్మిస్తున్న పై భారీ చిత్రంలో కస్టమ్స్ ఆఫీసర్ చాణక్యగా చిరంజీవి, ఎయిర్ హోస్టెస్‌గా విజయశాంతి, రిటైర్డ్ మేజర్‌గా సత్యనారాయణ, తన పేరులోని మొదటి అక్షరాన్ని – చివరి అక్షరాన్ని కలిపి "రాణా"గా పెట్టుకున్న పాత్రలో రావుగోపాలరావు, రంగనాథ్, ఈశ్వరరావు, చలపతిరావు, వేలు, మాడా, చిట్టిబాబు, రాజ్యలక్ష్మి, వై. విజయ, అన్నపూర్ణ, గెస్ట్‌గా అల్లు రామలింగయ్య పాల్గొంటున్నారు. పరుచూరి సోదరుల రచన, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. ప్రకాష్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, విజయన్ సాహసాలు, సలీం నృత్యాలు, ఆనందకుమార్ సంయుక్త దర్శకత్వం, గోపాలకృష్ణ – రామారావు ప్రొడక్షన్, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో డి. వి. వి. రాజు, డి.వి.కె. రాజు సహ నిర్మాతలు. కె. రాఘవేంద్రరావు దర్శకుడు.

## శ్రీ హరిత చిత్ర ద్వితీయ చిత్రం

"అక్టోబర్ 1 నుంచి షూటింగ్," అన్నారు రేలంగి నరసింహారావు. ఈయన దర్శకత్వంలో "ఆరాధన" అనంతరం జగన్మోహన రెడ్డి నిర్మించే శ్రీ హరిత చిత్ర వారి రెండవ చిత్రంలో చంద్రమోహన్, రాధిక నాయకానాయికలు. □



# వినాయకుడి విచారం

రాళ్ళపల్లి

మా జాగిలం టోనీని తీసుకొని మార్నింగు వాక్‌కి బయల్దేరాను. ఎదురుగుండా గుళ్లోనే వినాయకరావుగారుండేది. వారి గుమ్మం దగ్గర-కెళ్లగానే తొండం పైకెత్తి అవలిస్తూ, బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ బొజ్జ సవరించుకుంటూ గర్భగుడిలోంచి బయటికొచ్చారాయన. ఆయన రూపాన్ని చూడటం తొలిసారి గనుక వింతగా కన్పించి గాభరాపడి మొరగసాగింది మా శునకం. దాన్ని మందలించి, సవినయంగా "నమస్కారం మహాప్రభూ! ఏమిటి ఏడాది చవితి విశేషాలు?" అన్నాను.

"ఏ చవితి?!" అన్నాడాయన ఆశ్చర్యంగా. నాకు మతిపోయింది. "ఏమిటీయనకి మతిమరుపు ఏమైనా వచ్చిందా?" అని మనసులో అనుకుని

"అదేమిటి స్వామి! మా రాజకీయ నాయకులు జయంతులు వర్ధంతులు జాతీయ శలవు దినాలుగా ఏర్పాటు చెసుకున్నట్టే మి దేవుళ్లంతా శ్రీరామనవమి, వైకుంఠ ఏకాదశి, శివరాత్రి, నవరాత్రి అలా తలో రోజూ పంచేసుకున్నారు గదా! ఆ కోటాలో వాటాగా భాద్రపదశుద్ధ చవితిని మికూ కేటాయించారు. ఏటేటా పోటీలుపడి యాభైవేల రూపాయల విగ్రహాన్ని ఒకడు తయారుచేయిస్తే లక్ష రూపాయలది మరొకడు చేయిస్తున్నాడు! నవరాత్రులు, చందాలు, సాంస్కృతిక కార్యక్రమాలు బోలెడంత హడావిడి! ఏ చవితి అని అడుగుతారే మిటి స్వామి?" అన్నాను.

ఐదు కిలో మిటర్ల దూరంలో వున్న చెట్లు గూడా తుఫానుకి ఊగినట్లు ఊగేలా ఓ గట్టి నిట్టూర్పు వదిలాడాయన.

"ఈ ప్రజలేమిటో వీళ్ల భక్తేమిటో నాకర్థంకావడం లేదయ్యా! బొమ్మ సైజును బట్టి భక్తిని కొలత వేసుకోవాలన్న మాట! ఇదివరకు హరికథలో బుఱ్ఱకథలో, ఓ హరిశ్చంద్రో, ఓ రామాంజనేయ యుద్ధమో, ఒ కురుక్షేత్రంలాంటి చక్కని కథా కాలక్షేపం వుండేది. అవన్నీ పోయాయి. ఇప్పుడు పందిట్లో నన్ను కూర్చోబెట్టి నా సమక్షంలో నే

"తీటగా వున్నావు రారా
నీటేసుకుంటావొ నాటేసుకుంటావొ
వాటేసుకుంటావొ
పూటేసుకుంటావొ! వేసుకో!! కొ కొ"

అని రికార్డింగ్ డాన్సులు.

పోయినేడాది ఓ పందిట్లో ఒకమ్మాయి సారా సీసా చేతబట్టి తూలుతూ-

"సుక్కేసుకుందాము రారో
కోడి ముక్కేసుకుందాము రారో
నొక్కేసుకుందాముర
మంచమెక్కేసుకుందాము రారో"

అని మొదలెట్టింది. నాకిరు వైపులా కూర్చున్న నా భార్యలు సిద్ధి, బుద్ధీ నన్ను గుఱ్ఱుగా చూడటం మొదలెట్టారు. భరించలేక చెవులతో కళ్ళు మూసేసుకున్నాను. కళ్ళు తెరిచి చూసేసరికి నా వాహనం ఆ అమ్మాయి కాళ్ల దగ్గర నిలబడి తూలుతూ నాట్యం చేయడం మొదలెట్టింది. ఈ మధ్య సినిమాలొకటి మొదలయ్యాయి. "ఆమె తెయ్యని రాత్రులు, రవిక చిరిగిన రాణి, మరిపాలబోణి, లుచ్చా, బద్మాష్, లఫంగా, అత్తామామల శవాల్" ఇలాటి సినిమాలు వేసేసి నిర్వాహకులు నవరాత్రులూ నాకు ప్రశాంతమైన నిద్రగూడా లేకుండా చేస్తున్నారు. ఈ కార్యక్రమాలతో నాకు మతి చెడటమే గాదు - సిద్ధి బుద్ధుల, బుద్ధిగూడా పెడత్రోవన పడుతుందేమోననిపిస్తోంది. బతుకంతా అబద్ధాలతో, అధర్మాలతో గడిపినా ఏదో మానసిక చైతన్యం కలిగించడానికి దోహదం చేసేవి, నాటి కార్యక్రమాలు పైగా మన పురాణాలు, ఇతిహాసాలు, చరిత్ర సంస్కృతి ప్రతిబింబింప జేసేవిగా వుండేవి. ఇప్పటి కార్యక్రమాలు చూస్తూ పందిట్లో కూర్చోవడానికి నాకే సిగ్గేస్తోంది. అరె!? క్యాబరే డాన్సు హాలుకి నా నవరాత్రుల పందిరికి తేడా లేకపోతే ఎలా? ఎప్పుడూ చప్పిడి ఉండ్రాళ్ళు! సరదాగా ఏ వెజిటబుల్ బిర్యానియో చేసి పెట్టొచ్చుగా? పెట్టరు.



"ఇక నిమజ్జనం! అంతంత డబ్బు ఖర్చుపెట్టి విగ్రహాలు చేయించడమెందుకు, నీళ్లలో ముంచడమెందుకు? ఆ ఖర్చుతో పదిమందికి అన్నదానం చేయవచ్చుగా? ఈ నిమజ్జనానికి దేశంలో కోట్లు కోట్లు ముంచేసిన ఓ మంత్రిగారిని పిలవడం. వారు దేశాన్నిముంచేది చాలక నన్ను ముంచడానికి వారే కర్త. అసలు నిమజ్జనం చేయాల్సింది నన్నుగాదు - అలాటి మంత్రుల్ని, వాళ్ల విగ్రహాల్ని దౌర్భాగ్యపు కార్యక్రమాలు ఏర్పాటు చేసే నిర్వాహకుల్ని నిమజ్జనం చేయాలి!" అని ఆవేశంగా మాట్లాడి ఆయాసపడసాగాడు వినాయకుడు. నాకు డౌటొచ్చింది ఈ ఏడాది వినాయకుడు చవితినాడు కొంపదీసి గుడి వదిలి కదలడేమోనని.

"పందిళ్లముట వెళ్లకపోతే మానె! కనీసం మా యింటికైనా వస్తారా? రారా?" అన్నాను.

"మీ యింటికి రాకుండా ఎలా వుంటాను? అవునూ ఈ మధ్య మి యింట్లోంచి అప్పుడప్పుడూ ఘుమ ఘుమ లొస్తున్నాయేమిటయ్యా?!"

"అంత పొదుగాటి ముక్కుండి మీకు తెలియక పోవడమేమిట స్వామి? వెజిటబుల్ బిర్యానియే! అన్ని తినుబండారాలతో బాటు అదీ చేయిస్తాను. సిద్ధి, బుద్ధి సమేతంగా విచ్చేసి మా కందరికి సద్బుద్ధి ప్రసాదించు స్వామి!" అని వేడుకున్నాను.

"తథాస్తు! భక్తులొచ్చే వేళయింది. గుళ్లోకెడతా! చవితినాడు కలుద్దాం" అంటూ అంతర్ధానమయ్యాడు. □



"అరణ్యకాండ"లో శ్రీలక్ష్మి, రాళ్ళపల్లి





వారం వారం
సుమ చిత్రహారం!

# సినిమా రంజని

త్వరలో మనోహరంగా
మీ ముందుకు వస్తోంది!

ఆంధ్రపత్రిక సంస్థనుంచి
మరో ఆణిముత్యం!!

DESIGNED BY P.A. RANGA



# సూపర్ హీరోయిన్ విజయశాంతి సమాధానాలు



వాసిరెడ్డి పద్మాకుమారి, ఒంగోలు

"దేవదాసు, లైలామజ్ను" వంటి చిత్రాలను పెద్దలు చూచి "అయ్యో పాపం" అని బాధపడుతుంటారు. అదే తమ పిల్లల విషయంలోకి వచ్చేసరికి ఆ ప్రేమికులను విడదీయటానికే ప్రయత్నిస్తారు. చూడటమే కాని, ఆచరించేది లేదంటారా?

తల్లితండ్రులు ఎప్పుడూ కావాలని తమ పిల్లల జీవితాల్ని పాడుచెయ్యనివ్వరు. నాటి కాలానికి, ఈనాటి కాలానికి ఎంతో మార్పుఉంది. మారుతున్న జనరేషన్‌తో బాటు పెద్దల్లో కూడా చాలావరకు మార్పు వచ్చిందని నా అభిప్రాయం.

ఎ. చంద్రమౌళి, రామకృష్ణాపూర్

మీరు ప్రతి సం. రము ఉత్తమనటి, సూపర్ హిరోయిన్‌గా ఎన్నిక కావాలని కోరుకుంటున్నాను.

మీ అభిమానానికి కృతజ్ఞతలు!

యస్.యం.ఎ.కె. ఆజాద్, తాడేపల్లి

మీరు నటిస్తున్న చిత్రాల్ని బట్టి చూస్తుంటే ప్రజల కొరకు దేశ సేవ చేసే వ్యక్తిని మీరు పెళ్ళి చేసుకుంటారా? లేక ఏ డాక్టర్‌నో ఇంజనీర్‌నో చేసుకుని విదేశాలకు వెళ్ళిపోతారా?

సినిమా వేరు, జీవితం వేరు. సినిమాలోని పాత్రని బట్టి చేస్తుంటాము. నిజ జీవితంలో అలా కాదు. ఎవరి జీవితం ఎక్కడ ఎవరితో ముడి పడిపోతుందో.... ఏ క్షణంలో అది జరుగుతుందో మనకు తెలియదు కదా! ఏమంటారు?

డి. మొహ్మద్ ఆజం, అనంతపురం

కె. విశ్వనాథ్ గారి దర్శకత్వంలో ఒక సంగీత, నృత్య ప్రధానమైన పాత్రలో మీరు నటిస్తే చూడాలని వుంది. నా కోరిక తీరుతుందా?

అవకాశం.... సందర్భం కలిసొస్తే తప్పక నటిస్తాను. ఆ మహాతపస్వి దర్శకత్వంలో నటించే అవకాశం అతి త్వరలో నే వుంటుందని ఆశిస్తున్నాను.

## ఉత్తమ ప్రశ్న

జి. విజయకుమార్, మహబూబాబాద్

స్త్రీ లేనిదే చరిత్రలేదు ... సృష్టిలేదు - అసలీ ప్రపంచమే లేదు. స్త్రీని నేడు ఒక విలాస వస్తువుగా పరిగణింపబడుతున్న యీ సమాజంపైమీ అభిప్రాయం?

ఎప్పుడో ఆనాడు మీరన్నది నిజమేనేమో! నేడు స్త్రీ అన్ని రంగాల్లోనూ తన ఆధిక్యత నిల్పుకుంటూ తనదంటూ ఓ ప్రత్యేకతను సంతరించుకుంది... స్త్రీకి ఓ గౌరవం నేడు అన్ని చోట్లా ఉంది. బస్‌లలో కూడా సగ భాగం సీట్లను నేడు స్త్రీలకు కేటాయించిన సంగతి మీకు తెలియనిదికాదు.

బి. యస్. మిశ్రా, పెనమకూరు

గద్దెను ఎక్కే వరకూ ప్రజలను రక్షిస్తామని చెబుతూ .. గద్దె ఎక్కాక వారినే భక్షిస్తున్న రాజకీయ నాయకులపైమీ అభిప్రాయం?

రాజకీయ నాయకుల గురించి అడిగితే నేనేమని చెప్పగలను? అయినా ఓటు వేసి గద్దెకెక్కించిన మీరే యీ విషయాన్ని అర్థం చేసుకుని తరువాత ఏం చేయాలా అన్నది నిర్ణయించుకోవాలి.

జి. లత, విశాఖపట్నం

ఆధునిక జీవితం - సంప్రదాయ జీవన విధానం - ఈ రెండింటిలో ఏ దారిలో నడిచేందుకు మీరు ప్రాధాన్యతనిస్తారు.

సాంప్రదాయక కుటుంబంలో పుట్టి పెరిగాకే కదా ఆధునిక జీవితం గురించి తెలుస్తుంది. రెంటిని అర్థం చేసుకుని చక్కని జీవితం సాగించడమే నా అభిలాష.

దాసరి మంగాదేవి, పాలమూరు.

ప్రేమ గుడ్డిది అని నేను అంటాను. మరి మీరేమంటారు.

ప్రేమ పవిత్రమైనది అని అంటాను.

వి. శశిమోహన్, దగదర్తి

నటన దేవుడి వరం అంటారు కొందరు. కాని సాధనతో సాధించలేనిదంటూ ఏమి లేదంటాను నేను. మరి మీరు ఏమంటారు?

"కృషితో నాస్తి దుర్భిక్షమ్" అన్నారు కదా! నేడు మానవుడు చేయలేనిదంటూ ఏమి లేదని ... కృషి చేస్తే సాధించలేనిదంటూ ఏమి వుండదని నమ్మేవాళ్ళలో నేనూ ఒకర్ని.

తోకల నారాయణరావు, మచిలీపట్నం

చిత్రసీమలో ప్రవేశించిన అనతికాలంలో నే ఉత్తమనటిగా పత్రికల చేత, ప్రజలచేత, ప్రభుత్వంచేత ఆదరింపబడుతున్న మీరు - ఇంత ఎత్తు ఎదగడానికి కారణం - మీ స్వయం కృషా, అభిమానుల ఆదరణా, నిర్మాతల ప్రోత్సాహమా, అన్నిటిని మించి మీ అదృష్టమా?

నిర్మాతల ప్రోత్సాహంతో బాటు అభిమానుల ఆదరణ నన్ను మీరు మెచ్చే నటిగా చేసాయి. □

కూపన్

## ఆంధ్రసచిత్ర వారపత్రిక
## విజయశాంతి సమాధానాలు

ప్రశ్న : ____________________

____________________

పంపిన వారి పేరు : ____________________

పూర్తి చిరునామా : ____________________



సీరియల్

# సంకెళ్ళెవరికి?

డాక్టర్ కొత్త రవీంద్రబాబు

(గత సంచిక తరువాయి)

చింటూ ఏమయ్యాడు? ఆమెను ఆసుపత్రిలో నుంచి తప్పించుకొని తీసుకొని వెళ్ళిన తర్వాత ఎక్కడకు వెళ్ళినట్లు? ఆస్పత్రిలో సెంట్రీలను అక్కడ పరిస్థితిని చూసాక ఆమె తప్పించుకు వెళ్ళడంలో పెద్ద ఆశ్చర్యం ఏమి కనపడలేదు. కాకపోతే స్పృహ వచ్చాక కూడా స్పృహ రానట్లుగానే నటించిందన్న విషయం వింటే తమాషాగా వుంది. కొంతమంది దొంగతనం వృత్తిగా వున్న మనుషులు, వాళ్ళు ఆడవాళ్ళుగానీ, మగవాళ్ళుగానీ - దెబ్బలకు భయపడరు. మామూలు మనుష్యులయితే చచ్చిపోయే దెబ్బలు వాళ్ళను 'ఏమి చేయవు. గాడిద మాంసం, విప్ప సారా తీసుకున్న వాళ్ళను దెబ్బలు ఏమి చేయలేవు అని వినివున్నది. అందులో నిజం ఎంత వున్నా దెబ్బలు తిని తిని రాటుదేలిపోతారు అన్నది వాస్తవం అనుకుంది.

చింటూ ఆచూకీ తెలుసుకోవాలంటే ఒకే ఒక ఆధారం మెడికల్ ఆఫీసరుగారి అంబాసిడర్ ఎం. ఎస్. ఎక్స్ 7057. ఆ కారు ఎక్కడ దొరుకుతుందో చూచుకొని అక్కడ నుండి మళ్ళీ మొదలెట్టాలి! అది ఎక్కువమందిని పంపినందువల్ల సాధ్యంకాదు. హడావిడికి పిట్టలెగిరి పోతాయి.

మరుసటి రోజు ఉదయం కారు ఆచూకీ తెలిసింది. అది మద్రాసు వెళ్ళే హైవేలో వేడన్‌తాంగళ్‌కు ఆరు మైళ్ళ దూరంలో వదలివేయబడి వుంది.

చింటూ తెలివికి మనసులోనే ముచ్చటపడింది రూప. మెయిన్ వేలో కారు వదలివేసాడు. ఇప్పుడక్కడనుంచి వెతుకులాట మొదలవాలి. అంటే దాదాపుగా తమిళనాడు రాష్ట్రం అంతటా బస్సులున్నాయి అక్కడ నుండి. అతన్ని వెతకాలి అంటే గడ్డి మేటలో సూది కోసం గాలించడమే అవుతుంది!

ఇన్‌వెస్టిగేషన్ పార్టీ జీపులో బయల్దేరి అంబాసిడర్ కారు వదిలి వేసిన స్థలం చేరుకొన్నారు. హైవే నుండి వేడన్‌తాంగళ్‌కు వెళ్ళే మార్గం వున్న చోటుకు ఫర్లాంగు దూరంలో కారు ఆగి వున్నది.

రూప మఫ్టీ డ్రెస్‌లో వున్నది.

"సార్! నేను ఎన్నాళ్ళనుంచో వేడన్‌తాంగళ్ చూడాలనుకుంటున్నాను! చింటూగాడు కారు ఇక్కడ ఆపి బహుశా అక్కడకే వెళ్ళి వుంటాడని అనుకుంటున్నాను. మన జీపు కూడా అటుకేసి పోనిద్దామా?"

"వేడన్‌తాంగళ్‌లో నిత్యం యాత్రికుల రద్దీ వుంటుంది. అక్కడ వుండటానికి హోటళ్ళు ఏమి వుండవు. చింటూగాడు దాక్కోవటానికి తగిన చోటుగాదు! కారు వదలివేసిన ప్రదేశం క్షుణ్ణంగా గాలిస్తామని వాడికి తెలుసు. వాడే బస్సులో ఎక్కి ఏ చిదంబరానికో, తిరుచనాపల్లికో పారిపోయుంటాడు.

నీకు వేడన్‌తాంగళ్ బర్డ్‌శాంక్చువరి చూడాలని వుంటే అదుగో బస్సు ఆగివుంది. పది నిముషాలలో వెళ్ళిపోతావు. సాయంత్రం నాలుగింటికి బస్సున్నది. దానిలో చెంగల్పట్టు వచ్చేయవచ్చు".

"థాంక్యూ సార్! బర్డ్‌శాంక్చువరి చూద్దామని బైనాక్యులర్ కూడా తెచ్చుకున్నాను. ఎన్నాళ్ళ నుంచో తరని కోరికగా వున్నది. ఈ రోజు చింటూగాడి మూలంగా వీలవుతున్నది!" అంటూ బస్సు వైపుగా నడిచింది రూప.

"రూపా! కాన్‌స్టేబుల్‌ను పంపమంటావా తోడుగా!"

"వద్దు సార్! నేను వంటరిగా వెళ్ళిరాగలను!" చిన్న సూట్‌కేస్ పరిమాణంలో వున్న వేనిటీ బాగ్ వూపుకుంటూవెళ్ళింది రూప.

"పోనీయ్ జీపు! ఈసారి రోడ్డు మీద తగిలే మొదటి పల్లె దగ్గర ఆపు. చింటూగాడు, ఆడ మనిషి ఎటు పోయారో ఆచూకీ తీద్దాం!

చింటూ మన డిపార్ట్‌మెంటుకు తలనొప్పిగా తయారయాడు. చిట్టిలుకలా మాయమయిపోతున్నాడు.

చూస్తా! ఇంకా ఎన్నాళ్ళు తప్పించుకు తిరుగుతాడో! తంగవేలుని మస్కా కొట్టినవాడు ఇంతవరకూ లేడు! ఏదో లెక్కా" నెమ్మదిగా తనలో తను అనుకుంటున్నట్లుగా అన్నాడు తంగవేలు!

రూప బస్సుకు పది బారల దూరంలో వుండగానే జీపు వెళ్ళిపోయింది! జీపు వెళ్ళాక రూప బస్సు వైపుగా నడవడం మాని నిలబడిపోయింది. బస్సు కండక్టరు రెండు మూడుమార్లు రూప వైపుగా చూసి, ఆమె బస్సు వైపుగా వచ్చే ప్రయత్నమేమి చేయకపోయేసరికి "రైట్" అని అరిచాడు. బస్సు కదిలిపోయింది.

అయిదు నిముషాలాగి వేడన్‌తాంగళ్ వెళ్ళే రోడ్డున నడవసాగింది రూప. రోడ్డు నిర్మానుష్యంగా వున్నది. ఫర్లాంగు దాటే లోపల రూప రూపం మారిపోయింది. మురికి పరికిణి, రవిక, మట్టికొట్టుకున్న వళ్ళు. వానిటీ బాగ్‌ను పాత గుడ్డలో మూటగట్టుకొని నెత్తిన పెట్టుకొన్నది! ఎవరైనా చూస్తే కాయకష్టం చేసుకొనే కూలి మనిషి అనుకుంటారు! ఎవరయినా మూట విప్పదీసి అందులో వస్తువులు చూస్తే?

ఎవరో ధనవంతురాలి వానిటీ బాగ్ కాజేసింది దొంగ అంటారు!

అదే రూపకు కావలసింది! తానుపోలీస్ ఆఫీసర్‌గా బయల్దేరితే అనుకున్న పని జరగదు! దొంగగా బయల్దేరితేనే ఏమైనా వుపయోగం!

కాని పోలీసులెవరైనా దొంగ అని పట్టుకొని జైల్లో పడవేస్తే? వాళ్ళు అందుకు సమర్థులే! అసలు దొంగలను వదలివేసి అనుమానం మీద ఎవరినో పట్టుకొని వచ్చి వాళ్ళచేత 'నిజం' ఒప్పించటానికి నానా హింసలూ పెడతారు!

రోడ్డు పక్కన చిన్న గ్రామం తగిలింది. అంతా కలిపినా పదిహేను ఇరవై ఇళ్ళన్నా లేవు. ఇళ్ళకు కొబ్బరి ఆకులు, రెల్లు గడ్డి, ఇనపరేకులూ రకరకాలకప్పులు వేసారు. మధ్యన బంగళా పెంకులతో చిన్న ఇల్లు.

జరిగిన కథ-6 : ఐ. పి. ఎస్. సెలక్షన్ పరీక్షల్లో ఫస్టు రాంకు తెచ్చుకున్న రూప చెంగల్పట్టు ఎస్. పి. దగ్గర ట్రైనీ ఎ. ఎస్. పి.గా చేరింది. ఎస్. పి. తంగవేలుతో కూడా చింటూగాడిని పోలీసు బలగం ఎలా వలవేసి పట్టుకుంటారో చూడను వెళ్ళింది రూప. చింటూ ఆచూకీ తెలుసుకోవడం కోసం సెటిల్‌మెంట్ గ్రామం నుండి తీసుకువచ్చిన ఆమెను పోలీసులు ఎన్ని చిత్రహింసలు పెట్టినా స్పృహ కోల్పోయిందేగానీ, చింటూ ఆచూకీ తెలుపలేదు. ఆస్పత్రిలో ఉన్న ఆమెను ముసలమ్మ వేషంతో వచ్చి చింటూ విడిపించుకు వెళ్ళాడు.

ఇంటిముందు చిన్న అరుగుంటే వెళ్ళి కూర్చుంది రూప.

"యారు?" ఇంటిలో నుండి ముప్పై సంవత్సరాల వ్యక్తి వొకతను బయటకు వచ్చి రూప కట్టుకున్న మురికి గుడ్డలు అవీ చూసి క్షణం అసహ్యించుకున్నా "ఫరవాలేదు మురికిగా వున్నా అందమైన పిల్లే!" అనుకుంటూ ఆమెను పరీక్షగా చూడసాగాడు. "ఈ అమ్మాయిని ఇంటి పనికి పెట్టుకుంటే? తంగమణికి పని సాయంగానూ వుంటుంది. మరి ...!" అతని ఆలోచనలు భగ్నం చేస్తూ తంగమణి ఇంట్లోంచి బయటకు వచ్చి మొగుడి వంక, రూప వంక మార్చి మార్చి చూడసాగింది.

"తంగం! నువ్వు ఇంటి పని, పొలం పని చేసుకోలేకుండా వున్నావు! పోని యీ అమ్మాయిని పనికి పెట్టుకుందామా?"

"ఏమి అక్కర్లా! మీరు లోపలకు పదండి. ఎవతెవే నువ్వు? నా యింటి ముందు వచ్చి కూర్చున్నావు. వెళ్ళు వెళ్ళు. ఇంకా కూర్చునే వున్నావే?" అల్సేషియన్ కుక్క అరచినట్లు కేకలు పెట్టింది.

అయిష్టంగా ముఖంపెట్టి కదిలింది రూప. పరవాలేదు. మురికి బట్టలు వేసుకుని కూలి మనిషిలా కనపడినందువల్ల కొన్ని ప్రయోజనాలు కలుగుతవి! బట్టలెలా వున్నా మనిషిని వదలిపెట్టని రోమియోలుంటారు!

పోలీసుల బారి నుండే కాకుండా ఇలాటివారి బారిన పడకుండా చూచుకోవాలి అని మనసులో అనుకుంటుంటే చిరునవ్వు వెలసిందామె ముఖాన.

పల్లె దాటిందో లేదో ఎవరో తనను వెంబడిస్తున్నట్లు తెలుసుకుంది. వెనక్కు తిరిగి చూసేసరికి పాతిక సంవత్సరాల యువకుడు - పువ్వుల లుంగి మడచి కట్టుకున్నాడు. వంటి మీద ఇతరత్రా ఏ విధమైన ఆచ్ఛాదనా లేదు. తమలపాకు పొగాకు ముక్కలు నమలి నమలి పండ్లు గార పట్టి వున్నాయి.

రూప అతని వంక చూసేసరికి అతని నోట్లోంచి బీడి కింద పడిపోయింది. తెరిచిన నోరునట్లే వుంచి ఆమె వంక చూడసాగాడు.

"ఏమిటి అలా చూస్తావు? నేనేమైనా దొమ్మరసానిననుకున్నావా? లేకపోతే నా ముఖాన కోతులాడుతున్నయ్యా?"

"ఆ! ఆ! లేదు లేదు! దారి తెలియలేదేమోనని ... చెబుదామని!"

"దారి తెలియదా! ఈ రోడ్డు వేదన్‌తాంగల్ వెళ్ళదా?"

"వెళుతుంది! కాని అక్కడకెందుకు?"

"బతకటానికి ఏ వూరైతేనేం?"

"సరే! నేనూ అటే వస్తున్నా! పద"



## సంకెళ్ళెవరికి?

"ఇందాక దారి చెప్పటానికి వచ్చానన్నావు?"

"హా! హా! వూరికే అన్నా! వెళ్దాం పద"

"దారిలో పిచ్చి వేషాలేమైనా వేసావో జాగ్రత్త. నా మొల్లో కత్తుంది. సర్రున గుండెల్లో దింపుతా!"

అతగాడు రూప వంక నుండి క్షణంసేపు దృష్టి మరలించాడు. రూప మాటలకంటే అవి అన్న తీరు అతన్ని భయపెట్టినట్లున్నది! కాని ఆ భయం ఎంతోసేపు నిలవలేదు. పడుచు పిల్ల ప్రక్కన వుంటె ప్రలోభపడకుండా నిగ్రహపడగల శక్తి అతనిలో క్రమేపి నశించసాగింది!

తల తిప్పకుండానే ఆమె శరీరాన్ని పక్క చూపులతో తినేయసాగాడు! అతను పడుతున్న అవస్థ చూస్తుంటే రూపకు ఓ పక్కన నవ్వు రాసాగింది!

రోడ్డు పక్కన కొంచెం దూరంలో సీమచింత చెట్టుకాయలు కోసి కింద పడేస్తున్నాడో కుర్రాడు. రూప వెంట వస్తున్నతను పరిగెత్తుకొని వెళ్ళి కింద పడ్డ కాయలు కొన్నిటిని ఏరి లుంగి మడతలో వేసుకుని, చెట్టు మీద కుర్రవాడు గోలగా అరవడంతో మరలా పరిగెత్తుకు వచ్చి రూప పక్కగా నడువసాగాడు.

"పాపం! అంత చిన్న కుర్రవాడు కోసిన కాయలు దొంగిలించుకు వచ్చావేం?"

"నిన్ను చూస్తే పొద్దున్నించి ఏం తిన్నట్లు లేవు. ఆకలితో బాధపడుతున్నావనుకొని తెచ్చా?"

"నా కోసం చేసావన్న మాట! ఎందుకు నీకు నా మీద అంత అభిమానం?"

"హి! హి! వూరికేనే! నిన్ను చూస్తే ..."

"చూస్తే ...?!"

"సినిమా ఏక్టరు చిలుక్(సిల్క్‌స్మిత) లా వున్నావు! అందుకని".

"చిలుక్ అంటే యిష్టమా?"

అవునన్నట్లు తల వూపాడు.

"నీ పేరు?"

"ఆరుముగం"

"ఏం పనిచేస్తావు?"

"ఏమి చేయను!"

"ఎద్దులా వున్నావు! ఏమి చేయకుండా తేర తిండి తింటున్నావా! మీ నాన్న వూరుకుంటాడా?"

"ఎందుకు వూరుకోడు? చింటూ చెప్పిన పని చేస్తే నెల రోజులకు సరిపడు బియ్యం కొనుక్కోవటానికి డబ్బులిస్తాడు"

"చింటూ ఎవరు?"

నాలుక కరుచుకొన్నాడు ఆరుముగం! కాసేపాగి "ఎప్పుడూ నా సంగతి అడుగుతావేగాని నీ సంగతి ఏం చెప్పవేం? మీదే వూరు?"

"రామేశ్వరం"

"మరి యిటు ఎందుకు వచ్చావు?"

"బతుకుదామని!"

"మీ వూళ్ళో కూలి పని దొరకదా?"

"కూలి పని ఏం ఖర్మ! మహరాణిలా బతికేదాన్ని! టైగర్ రామస్వామిని పోలీసులు పట్టుకెళ్లారు! ఇక అక్కడ వుండలేక యిటు వచ్చా"

"ఓ! నువ్వు టైగర్ రామస్వామి ముఠానా!"

"ముఠానా ఏంటి! మహరాణినని చెప్పలా!"

ఆరుముగం ముఖంలో కొంచెం భయభక్తులు చోటు చేసుకున్నాయి.

రమకు కొంచెం ఎడంగా నడవసాగాడు.

"టైగర్ రామస్వామిని పట్టుకున్నారా? ఎంత ఘోరం! మరి వాళ్ళ ముఠావాళ్ళు ఏమయారు? టైగర్‌ను విడిపించుకోలేక పోయారా?"

"నాయకుడు లేకపోయేసరికి దిక్కుతోచక చెల్లాచెదరయిపోయారు ముఠావాళ్ళు. ఒంటరిదాన్ని అక్కడ వుండలేక యిటు వచ్చా".

"ఏం భయపడకు! నేనున్నాగా నీకు తోడు" మళ్ళీ దగ్గరగా వచ్చాడు

ఆరుముగం. మాట్లాడుతూనే రూప భుజంమీద చేయి వేయబోయాడు.

"రేయ్ బద్మాష్! రామస్వామికి తెలిసిందో నీ వళ్ళు చితక కొట్టేస్తాడు! రాణీ జోలికి వెళ్ళటానికి ఎన్ని గుండెల్రా నీకు"

క్షణంసేపు బెదిరిపోయి మళ్ళీ ఏదో జ్ఞప్తికి రాగా "రామస్వామిని కటకటాల వెనకపెట్టారు" అంటూ పండ్లికిలించాడు.

సర్రున బొడ్లోంచి కత్తి తీసి "రేయ్ బద్మాష్ రామస్వామిని కట్టివేయగల సంకెళ్ళు యింకా తయారవలేదురా! పోలీసు పటాలాల్ని ఏమార్చి వస్తాడురా టైగర్! అప్పుడు నీబోటి వూరకుక్కల్ని వుఫ్ అని వూదేస్తాడు" అంటూ అతన్ని పొడవబోయినట్టు మీదకు వెళ్ళింది.

ఆరుముగం కుడి చేత్తో కత్తివున్న రూప కుడి చేయి పట్టుకున్నాడు. అంతే! క్షణంలో రూప ఎడం చేతితో అతని మెడ మీద కరాటే చాప్ యిచ్చింది.

కిక్కురుమనకుండా కూలబడ్డాడు. కాసేపట్లో తెప్పరిల్లుకుని "ఎంత దెబ్బ కొట్టావు! చింటూ కూడా ఇలా కొట్టలేదు".

"ఎవరా చింటూ?"

మాట్లాడకుండా మళ్ళీ రూప వెంట రాసాగాడు ఆరుముగం. ఇప్పుడతని చూపుల్లో కాంక్ష తగ్గి భయం, భక్తి, ఆశ్చర్యం చోటు చేసుకున్నాయి.

"చింటూ ఎవరో చెప్పవు గదూ!" లాలనగా అడిగింది రూప.

నిలయం (వేడన్‌తాంగళ్) అని పేరు వచ్చింది. ఇప్పుడు గవర్నమెంట్ పక్షుల్ని వేటాడ్డం నిషేధించింది. నీటి కయ్యలో చెట్ల మీద పక్షులు రక రకాలవి వచ్చి జేరుతుంటాయి వేల సంఖ్యలో. టవరు కట్టి దాంట్లో పెద్ద టెలిస్కోపు పెట్టారు! దాంట్లోంచి పక్షుల్ని చూడడానికి వీలవుతుంటుంది.

ఎవరయినా విదేశాల నుండి వచ్చిన యాత్రికులకు ఇక్కడ విశేషాలు వివరంగా చెబితే వాళ్ళు వెళ్ళేప్పుడు పదేసి, ఇరవయ్యేసి రూపాయలు ఇచ్చి వెళుతుంటారు. కాని అలా చేయాలంటే ఇలా కాదు వెళ్ళాల్సింది".

"ఓ! నా దుస్తులు బాగా లేవంటావా! మరి ఏం చేయనురా ఆరుముగం! మంచి బట్టలు వేసుకు వస్తే ఎర్ర టోపీలు వెంటాడుతాయి! రాణిని పట్టియిస్తే వెయ్యి రూపాయలు బహుమతి కూడా ఇస్తామని ప్రకటించారు! ఆకలితో వున్నట్లున్నావు, ఇదిగో నా దగ్గర మామిడితాండ్ర పాకెట్ వున్నది. తిను" అంటూ ఇచ్చింది.

పాకెట్ విప్పి తింటూ "ఇక్కడ నీకు మంచి దుస్తులు దొరకవే! ఎలాగబ్బా!"

"ఓరేయి సన్నాసీ! ప్రపంచం నలుమూలల నుండి ఇక్కడకు యాత్రికులు వస్తారన్నావు! బుర్ర వుంటే దొరకనిదేమి లేదురా! మనకు కావల్సిన దుస్తులు క్షణంలో సంపాదిస్తాను".







"వాడి సంగతి ఎందుకులే! ఎంత దెబ్బ కొట్టావు. మెడ నొప్పపుడుతున్నది".

"ఇదిగో యీ మందు రాసుకో! నొప్పి తగ్గిపోతుంది" అంటూ బొడ్లోంచి ఆయింట్‌మెంట్ తీసి యిచ్చింది.

మందు రాసుకుంటూ "నొప్పులు తగ్గాలంటే గాడిద మాంసం మించింది లేదు. లేదా నల్లమందు గుళిక మ్రింగాలి". అన్నాడు.

"నల్లమందు కావాలా"

"ఇప్పుడు వద్దులే! వేడన్‌తాంగళ్ వెళ్ళాక ఇవ్వు. వేసుకుని చెట్టు నీడను పడుకుంటాను!"

"భోజనం పెట్టే హోటళ్ళున్నయ్యా అక్కడ?"

"లేవు! చిన్న టిక్కీ హోటళ్ళల్లో కాఫీ, టిఫిన్ అమ్ముతారు. గెస్ట్ హవుసు జవాన్‌తో చెప్పితే భోజనం తయారు చేస్తాడు. నేను చూస్తాగా ఆ ఏర్పాటు".

"మరి 'పని' దొరుకుతుందంటావా?"

"ఎందుకు దొరకదు? దేశం నాలుగు వైపుల నుండే కాకుండా విదేశాల నుండి కూడా వస్తుంటారు యాత్రికులు ఇక్కడకు.

పూర్వకాలంలో ఇక్కడ వేటగాళ్ళు వుండేవారట. అందుకే వేటగాళ్ళ

"అబ్బ! ఏం అయిడియా గురూ".

"మరి రాణి అంటే ఏమనుకున్నావు? మా ముఠావాళ్ళకు నేనిక్కడ వున్నానని తెలిస్తే చాలు! వచ్చేస్తారు. కాని కొంతకాలం గప్‌చుప్‌గా వుండాలి. హడావిడి సర్దుమణిగాక అప్పుడుమన తడాఖా చూపెట్టవచ్చు! ఏమంటావు!"

"గురూ! నీ పేరు ఎవరు పెట్టారో! సరిపోయింది"

"టైగరు పెట్టాడురా!"

"వేడన్‌తాంగళ్ వచ్చేసింది. మాటల్లో పడి నడుస్తుంటే దూరం తెలియలేదు. ఆకలిగా వుందేమో టీ తాగుదాం రా" అంటూ చిన్న పాక టీ స్టాల్ ముందుకు తీసుకు వెళ్ళాడు.

చిన్న బెంచీలు వేసి వుంటే కూర్చుంది రూప.

"రెండు చా" అంటూ ఆర్డరిచ్చాడు ఆరుముగం. టీ కొట్టతను రూప వంక ఎగాదిగా చూస్తూ టీ కలిపి ఇచ్చి "మంచి ఎట్ట దొరికిందిరా!" అన్నాడు ఆరుముగంతో.

తల అడ్డంగా తిప్పుతూ "హై క్లాస్" అన్నాడు. రూప వంక ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయాడు టీ కొట్టతను.

(ఇంకా ఉంది)

# పెళ్ళిచూపులు

నందం రామారావు



రంగరాజు కోటీశ్వరుడు గాకపోయినా నలభై లక్షలకు అధిపతి. ఆయనకు ఒక్కతే కూతురు రాణి... రాణి, రాణిలానే వుంటుంది. ఇప్పుడిప్పుడే రాణికి ఇరవై సంవత్సరాలు నిండాయి.



అందగత్తైన తన కూతురికి ఒక గొప్ప సంబంధం చూసి పెళ్ళి చెయ్యాలని రంగరాజు ఆలోచన. ఆయన తదనంతరం ఆ ఆస్థి అంత రాణికే చెందుతుంది. అంచేత, రాణిని చేసుకుంటే అందంతో పాటు, ఐశ్వర్యం కూడా వస్తుందని అనేకమంది అనేక రకాలుగా ప్రయత్నాలు చేయసాగారు.

నూరు అబద్ధాలాడి ఒక పెళ్ళి చెయ్యమన్నారు పెద్దలు. ఇందులో ఎంత నిజం వుందో తెలియదు గానీ ఒక్క అబద్ధం బైటపడినా పెళ్ళి ప్రయత్నాలు గోవిందా!

రంగరాజు తన కూతురికి చాలా సంబంధాలు చూశాడు. ఐతే, ఆయనకు ఏ ఒక్కటీ నచ్చలేదు!

ఈ రోజు బందర్లో మంచి సంబంధం వున్నదంటే పెళ్ళి కొడుకుని చూడ్డానికి మధ్యవర్తితో బయలుదేరాడు.

వరుడు పెద్దడాక్టరు.అమెరికాలో రెండేళ్ళ ట్రైనింగై స్వదేశానికి నాలుగు రోజుల క్రితం తిరిగొచ్చాడు. ఆ సంబంధం విని, తన ఆలోచనలకు అన్నివిధాలా సరిపడిన సంబంధమని వీలైతే ఖాయం చేసుకోవడానికి నిర్ణయించుకున్నాడు రంగరాజు.

పెళ్ళికొడుకుని, చూడ్డం జరిగింది. ఎంత కట్నమిచ్చినా సరే ఈ వరుడ్నే స్థిరపరచాలని మనస్సులో ధృవపరుచుకున్నాడు.

పెళ్ళిచూపులన్న తర్వాత నాలుగు మాటలూ, రెండు సార్లు కాఫీలూ, పలుసార్లు నవ్వుకోవడం వుంటేనే అది రక్తికడుతుంది.

"అబ్బాయ్ ఏం చదివాడండీ" అన్నాడు రంగరాజు.

యం. యస్. చేసి హార్ట్‌లో రెండు సంవత్సరాలు అమెరికాలో శిక్షణ పొందాడండి" పెళ్ళికొడుకు తండ్రి.

"పెళ్ళయిన తర్వాత ఇక్కడే వుంటాడా? అమెరికా వెడతాడా?"

"వాడిష్టమండి.... వాడేం చేసిన మా అభ్యంతరం ఏం లేదు."

"మరి, అబ్బాయ్ హబీలు ఏంటో?" కుతూహలంగా అడిగాడు రంగరాజు.

"అన్నయ్యగారూ! మా అబ్బాయ్ గురించి చెప్పుకోకూడదు గానీ కనీసం కాఫీ కూడా త్రాగడు. వక్కపొడి అంతకంటే వేసుకోడు." వరుడు తల్లి మాటలు.

ప్రొద్దుటే లేస్తాడు. తొమ్మిది గంటలకు హాయిగా భోజనం చేస్తాడు. సిగరెట్లు తాగనే త్రాగడు. కిళ్ళీ సరేసరి. దగ్గరకే రానివ్వడు."

"ఐతే అన్నీ మంచి లక్షణాలే" సంతోషంగా అన్నాడు రంగరాజు.

"అవునండి. సినిమాలు చూసి ఎరగడు. ఎప్పుడో ఇంటర్మీడియట్ పాసయి గోల చేస్తే యం. టి. రామారావు సినిమాకి పంపాను. అంతే, ఆ తర్వాత మళ్ళా సినిమాలు చూసి ఎరగడు."

"రంగరాజుగారూ! ఈ సంబంధం గురించి మీరు మరో ఆలోచన పెట్టుకోకండి. మిగతా విషయాలు మాట్లాడుకుంటే చాలు. మీ అమ్మాయి మహాలక్ష్మిలా సుఖపడుతుంది. ముందీ సంబంధం ఖాయపర్చుకోండి." మధ్యవర్తి తొందర.

"అన్నీ బాగానే వున్నాయండి. మీ అబ్బాయికి ఏ ఆర్ట్‌లో నైనా ప్రవేశం వుందా!"

"ఆర్ట్‌లో ప్రవేశం హార్ట్‌కి మంచిది కాదండి. అందుకే మా అబ్బాయిని వాటి జోలికి పోనివ్వలేదు. అంతెందుకు రెండు సంవత్సరాలు అమెరికాలో వున్నడా•ఒక్కసారి కూడా మా వాడు విస్కీ తాగి ఎరుగడు." గర్వంగా అన్నాడు తండ్రి.

"పోనీ బ్రాంది త్రాగుతాడా?" అంటూ పకపకా నవ్వాడు రంగరాజు.

ఆ మాటకి పెళ్ళి కొడుకుతో పాటు అందరూ నవ్వారు!

"అటువంటి అలవాట్లు మా ఇంటావంటా లేవండి" అంది తల్లి.

ఏదో సామెతలా –"మా అబ్బాయికి ఏ అలవాటూ లేదండి. ఎప్పుడైనా సరదా పది పేకాట కెళ్ళి గెలిస్తే కాస్త తాగుతాడు, ఆ తర్వాత భోజనం, కిళ్ళీ ఆపై ఆత వాసన....." ఇలా వుండదు గదా ఈ వ్యవహారం" అని అనుకున్నాడు మనస్సులో రంగరాజు! ఐతే, తనక్కాబోయే అల్లుడికి కొన్ని సరదాలైనా వుండాలని ఆయన అభిప్రాయం.

"చూడండి! మీ సాంప్రదాయం, మీ అబ్బాయి పెంపకం అన్నీ బాగానే వున్నాయి. మీ అబ్బాయి ఒక పెద్ద డాక్టరై వుండి ఏ అలవాట్లూ లేకుండా ఈ రోజుల్లో వుండడం గొప్ప విషయమే. ఐతే, ఏ అలవాట్లు లేని అల్లుడు నాకొద్దు. కనీసం, పెళ్ళాన్ని సినిమాకో, షికారుకో, షాపింగ్‌కో తీసుకెళ్ళి సుఖపెట్టని మీ 'హార్ట్' స్పెషలిస్ట్ డాక్టరబ్బాయి మాకొద్దు" అని రంగరాజు కుర్చీలోంచి లేచాడు.

రంగరాజు అన్న మాటలేవిటో ముందుగా అర్థంగాక, అర్థమైన తర్వాత హార్ట్ ఎటాక్ వచ్చిన మనిషిలా ఒక్కొక్కరే కుర్చీల్లో కూలబడిపోయారు! □

వూరుకున్నాను. కాని నా మౌనాన్ని మి రంగికారంగా తీసుకున్నారు. ఆడదంటే "ఆడేది" అనుకుంటున్నారేమో. మి మగాళ్ళను ఎలావడితే అలా ఆడించేదని గుర్తుంచుకోండి. స్పందన్ని రానివ్వండి మి పని చెబుతాను. చుట్టం చూపుగా వచ్చిన ఆడపిల్ల మిదే మిరు చెయ్యి వేశారంటే ఇంటా బయటా కూడా ప్రతిరోజూ దాని కెంత ద్రోహం చేస్తున్నారో నేనర్థం చేసుకోగలను."

నాకు కళ్ళు బైర్లు కమ్ముతున్నాయి. ఆడపిల్లల విషయంలో ఇంతవరకు నా స్కోరు ఫిఫ్టీ నాటవుట్. ఈ వందన ధర్మమా అని క్లీన్ బౌల్డ్ అయిపోయాను. ఇప్పుడీ సంగతి మా ఆవిడకి తెలిస్తే.... నా నవనాడులూ క్రుంగి పోయాయి.

"వందనా.... ప్లీజ్! జరిగిందేదో జరిగి పోయింది. స్పందనతో ఈ సంగతి చెప్పద్దు" అంటూ అతి కష్టం మిద ఆమెతో చెప్పి నా గదిలో కెళ్ళి తలుపు దగ్గరగా వేసుకొని బట్టలూడదీసి తువ్వాలు కట్టుకుని బాత్ రూంలో కెళ్ళి షవర్ తిప్పి, ఆ చల్లటి నీళ్ళ కింద నిలబడ్డాను.

* * * *

బాత్ రూం లోంచి ఎంత సేపటికి బయటి కొచ్చానో నాకే తెలీదు. మా ఆవిడ గొంతు పెద్దగా వినిపిస్తోంది.

"వందనా! మా ఆయన గురించి నువ్వేమి చెప్పక్కర్లేదు. దేవుడనే వాడెలా వుంటాడో నాకు తెలీదు. కాని అతగాడు వుంటే గింటే మా ఆయన కంటే గొప్పగా వుంటాడని, ఇంతకన్నా గొప్ప మనసుంటుందని నేననుకోను. పాతికేళ్ళొచ్చినా నీకు పెళ్ళి కాకపోవడంతో నువ్వే మా ఆయన మిద మోజు పడుంటావు. అది కుదరక పోయేసరికి మా ఇద్దరి మధ్యా కలతలు పెడదామను కున్నావా మహాతల్లీ, వెళ్ళు, వెళ్ళు.... వచ్చిన దారినే వెళ్ళు. ఇంకెప్పుడూ మా ఇంటికి రాకు" అంటూ వందన పెట్టి ఆమె ముఖం మిద గిరాటు వేసింది. నేను గదిలో డ్రస్ చేసుకుంటూ జరుగుతున్నదో కంట కనిపెడు తున్నాను. వందన మారు మాటాడకుండా పెట్టి తీసుకొని బయట కెళ్ళి పోయింది. వెంటనే శబ్దం చేస్తూ తలుపేసేసింది మా ఆవిడ.

మా ఆవిణ్ణెలా పొగడాలో నాకు తెలీలేదు. నా మిద దానికున్న నమ్మకం హిమాలయ శిఖరం కన్నా ఎత్తుగా కనిపించింది. నేను నెమ్మదిగా ఆమె దగ్గర కెళ్ళి –

"థాంక్యూ స్పందనా.... థాంక్యూ వెరిమచ్. మనిద్దరినీ ఎవరూ వేరు చేయలేరు" అన్నాను. నా చెయ్యి ఆమె వంటి మిద పడగానే తేళ్ళూ– జెర్రులూ పాకినట్టు తోసి అవతల పారేసి–

"ఎందుకండీ థాంక్సు.... మి వెధవ బుద్ధిని సమర్థించుకు వచ్చాననా? చిన్న నాటి స్నేహితురాలిని మి వల్ల పోగొట్టు కొన్నాననా? పని మనిషితో కూడా మిరు కక్కుర్తి పడుతున్నారని తెలిసి కూడా నేను నోరు మూసుకొన్నాననా? చుట్టపు చూపుగా వచ్చిన స్నేహితురాలి మిద అత్యాచారం చేయబోయారని తెలిసి కూడా మిమ్మల్నే సమర్థించాననా? ఏం చెయ్యమంటారండీ... చదువు, అందం, వినయం, విధేయత వుండి కూడా కట్నం ఇస్తేగాని పెళ్ళిగాని ఈ సువిశాల పవిత్ర ఆధ్యాత్మిక భారత దేశంలో ఆడదిగా పుట్టడమే గదండీ నేను చేసిన నేరం? ఏవండి, భర్త అంటే "భరించేవాడు" అని అర్థం చెబుతారు. కాని మిలాటి భర్తల్ని భరించేది నాలాటి భార్యలే నండి!" అంటూ నెత్తి, నోరు కొట్టుకోసాగింది స్పందన .

"నాలో కనీసం వీసమెత్తు నిజాయతీ వుంటే ఇంకెప్పుడూ నా భార్యకు ద్రోహం చేయకూడదు" అనుకున్నాను. □






**ఎ. ఎస్. ఆర్. కందికుప్ప**

★ మీ వంటి రచయిత్రికి సినిమాలో సంభాషణల రచయితగా స్థానం లభించ లేదా?

● అసలు సినిమాల్లో ఆడదానికే గౌరవం తక్కువ. ఇక అలా పెట్టలోపడి సంభాషణలు రాయడం కుదిరేపనా! సినిమా తీస్తున్నంత కాలం— సంభాషణల రచన సాగుతూనే వుంటుంది— పాత్రలకి తగ్గట్టు— లేకపోతే ఏక్టర్లకి తగ్గట్టు — రాస్తూ— తుడుస్తూ— రాస్తూ— తుడుస్తూ. కష్టం!

**పి. ఎన్. వి. విశాఖపట్నం**

★ 6–12 జూన్ పత్రికలో మీరు చీరాల వారికిచ్చిన జవాబు అద్భుతంగా వుంది. పిల్లల పెంపకం ఫలితం ఆశించకుండా చేసే తపస్సే. ఈ సత్యం ప్రతి తల్లీ తండ్రి తెలుసుకుంటే ప్రపంచంలో అరాచకం చాలా తగ్గుతుందేమో. నేను పత్రిక రాగానే చదివేది మీ జవాబులే. దయచేసి పత్రికవారికి ఓ సూచన చేయండి ప్రశ్నావళి, మీ పేరుతో పాటు పత్రిక ఎడ్రసు కూడా యివ్వమనండి.

● పత్రిక చిరునామా పత్రికలో యిట్టే దొరుకుతుంది. మళ్లీ ఎందుకు? మీ కీ శీర్షిక నచ్చుతూన్నందుకు సంతోషం.

**పి. ఆర్. గుంటూరు**

★ ప్రభుత్వం ఒక్కసారిగా కుల మతాలను నిషేధిస్తే ఏమౌతుంది?

● చూడ్డానికి ప్రభుత్వం వుండదు! కులం, మతం బలం అంతగా పాతుకు పోయాయి.

**యు. ఎమ్. కొంకుదురు**

★ నిరుద్యోగం, దారిద్ర్యం మన దేశంలో ఎందుకిలా పెరిగి పోతున్నాయి?

● ఇవి బాధ పెట్టేది అధికారం చేపట్టిన వర్గాన్ని కాదు కనుక. మభ్య పెట్టి ఓట్లు రాబట్టి అధికారం చేజిక్కించుకొగల సామర్థ్యం రాజకీయవేత్తలకి వుంది కనుక.... ఏం చేసినా యింతేనన్న నిరాశ నిస్పృహ బడుగువర్గాన్ని నోరు మెదపకుండా చేస్తుంది కనుక.

**ఎన్.ఆర్. ఒంగోలు**

★ అక్షర జ్ఞానమే లేని స్త్రీలకన్నా ఎం.ఏ.లు చదివిన మగవాళ్లు కొన్ని వ్యవహారాల్లో అనాగరికులుగా ప్రవర్తిస్తూంటారు. కారణం?

● చదువుకి సంస్కారానికి సంబంధం లేకపోడమే.

**వి.ఎస్. బొబ్బిలి**

★ ప్రేమించిన అమ్మాయికి పెళ్లి జరుగుతున్నా ఏమీ చేతకానివాడి లాగా పెళ్లికి వెళ్లి అక్షింతలు వేసి వచ్చాను. ఇప్పుడు ఆత్మహత్య చేసుకోవాలను కుంటున్నా.

● ఫ్! నా సందేశం టూ లేటు కాదుకదా?! ఇంకా ప్రేమనగర్ కాలంలో వుండి పోయారు. లేటెస్టు ట్రెండ్స్ చూడండి— అంత నిరాశ ముంచెత్తదు.

**ఎమ్.ఎస్. పిఠాపురం**

★ ఈ రోజుల్లో మగాళ్లు అంటే ఆడాళ్లకు ఈర్ష్యగా వుంటుంది— దీనికి మీరేమంటారు?

● కలికాల మహిమ అండోయ్ శాస్త్రిగారూ....

**పి.ఎస్.బి. కోటబొమ్మాళి**

★ మీరు ఆడ మగ భేదం లేకుండా యీ ప్రశ్నకు సమాధానం చెప్పాలి. మనిషి జీవితంలో పోగొట్టుకుంటే తిరిగిరానిది ఏంటి?

● టైమ్! మై డియర్ ఫ్రెండ్. కాలం వెనక్కి తిప్పలేవు.

★ చదివిన చదువుకు ప్రయోజనం నిరుద్యోగమా? చదవని వాడిది సోమరితనమా?

● చదువురాని సోమరి కంటే చదువుకున్న నిరుద్యోగి వేయి రెట్లు నయం— అతనికి ఆశకి తావుంది.

**జె.ఎ.ఆర్. కుదరెముఖ్**

★ కట్నం తీసుకోమని చెప్పి, పెళ్లయిన తరువాత అవి కావాలి ఇవి కావాలని వేధిస్తారామెను. ఇలా మోస పోతానని తెలియని ఆమె పుట్టింటి వారిని అడగలేక జరిగిన అన్యాయానికి బాధపడి— కర్తవ్యం?

● భర్తకి పౌరుషంగా బ్రతకడం నేర్ప కల్గాలి. అడిగి పుచ్చుకున్న వాటికంటే— స్వీయ కష్టంతో చేకూర్చుకున్నవి ఎక్కువ తృప్తి నిస్తాయని తెలియ చెప్ప కల్గాలి.

**కె.కె.ఆర్.ఎమ్. రాజుపాలెం**

★ మీరు యిస్తున్న సమాధానాలు ఎంతో ఆదర్శవంతంగా వుంటున్నాయి. మద్యపాన నిషేధ చట్టాన్ని ప్రభుత్వాలు ఎందుకు అమలు చేయలేక పోతున్నాయి? ప్రజలు చెడి పోతున్నారని తెలిసి కూడా— మౌనంగా ఎందుకుంటున్నాయి?

● ప్రభుత్వం కొన్ని పనులే చెయ్యకలదని ఎన్నోసార్లు నిరూపితం అయింది. సాంఘికపరమైన విషయాలలో— ప్రభుత్వం ఏమీ సాధించలేదు— కట్నం నిషేధం బిల్లు ఏం ప్రయోజనం సాధించింది? మద్యపాన నిషేధం అంతే. ప్రజలలో చైతన్యం వచ్చి మారితే— మారేవే యీ విషయాలు. ఇక, డబ్బు కుప్పతెప్పలుగా ఎన్నికలకి కావాలి. అవి సారావాళ్లూ, జూదం వాళ్లూ యిచ్చినట్టు మామూలు వాళ్లెవ రిస్తారు? అంచేతే సూత్రప్రాయంగా తప్పు అంటూనే తాళ్ల పన్ను కట్టి మరి తాగండంటుంది ప్రభుత్వం!

**బుజ్జి సంగంజాగర్లమూడి**

★ ఒక అమ్మాయిని ప్రేమించి తన తల్లితండ్రుల కోసం వేరే అమ్మాయిని వివాహం చేసుకునే మగవాడిని మోసగాడనాలా? గుణవంతుడనాలా?

● తల్లి తండ్రుల దృష్టిలో గుణవంతుడే. ప్రేమించిన అమ్మాయి మటుకు మోసగాడను కోవచ్చు. కాని ఒక్కటి గుర్తుంచుకోవాలమ్మా బుజ్జీ. గాంధర్వ వివాహం ప్రేమించిన దానితో, శాస్త్రోక్త వివాహం అమ్మా నాన్నా చూసిన పిల్లతో చేసుకొని వాడి రోజుల్లో పెద్ద మనిషి.

**డి.ఎన్.ఆర్. పటాన్చెరువు**

★ జీవితంపై విరక్తి కలిగితే ఏం చెయ్యాలి?

● జీవితం— రక్తి విరక్తిలతో సంబంధం లేకుండానే సాగిపోతుంది. ఏ పరిస్థితైనా— స్టాగ్నెంట్ కాదు. చలనం తప్పనిదే జీవితం. అంచేత రక్తికి ఉబ్బి విరక్తికి కుంగిపోవడం అర్థం లేనిపని. □



# సీరియల్: నిశ్శబ్ద సంగీతం

## బెహరా వెంకట సుబ్బారావు

(గత సంచిక తరువాయి)

ఆ రోజు రాత్రి అనసూయమ్మకి నిద్రపట్టలేదు. పది గంటలు దాటింది. మంచం మీద అటూ యిటూ దొర్లారు... పక్కనే వున్న రమ గదిలోకి తొంగి చూసారు. లైటు వెలిగివుంది. లేచి వెళ్ళారు.

"ఇంకా నిద్ర పోలేదా రమా!" పలకరిస్తూ కూతుర్ని సమీపించారు. చదువుతూన్న నవల్ని పక్కకి బెట్టి అడిగింది రమ–

"ఏమ్మా? ఏం కావాలి?"

జవాబు చెప్పకుండా తన పక్కనే కూర్చున్న తల్లిని అడిగింది మరోసారి.

'ఏమ్మా? వంట్లో ఎలావుంది?"

"రఘు బాబు నిద్ర పోతున్నాడేమో చూసిరా?"

"అన్నయ్యిప్పుడే నిద్ర పోడమ్మా! పిలవమంటావా?" అడిగింది లేచి కూర్చుని. తల్లి ఏదో అత్యవసర పని మీదనే వచ్చిందని గ్రహించింది.

"నా గదిలోకి పోతాను! ఓ సారి అన్నయ్యని తీసుకొనిరా" అంటూ లేచి తిరిగి తన గదిలోకి వెళ్ళారు అనసూయమ్మ.

మేడ మీదకి వెళ్ళింది రమ. రఘు స్పోర్ట్సు మాగజైన్ చూస్తున్నాడు. అమ్మ పిలుస్తోందని చెల్లెలు చెప్పగానే చివాల్న లేచాడు. చెల్లెలితో తల్లి గదిలోకి వెళ్ళాడు.

పిల్లలిద్దర్ని చూస్తూ "కూర్చోండి!" అంది తల్లి. ఓ కుర్చీ తల్లి మంచానికెదురుగా వేసుకొని కూర్చున్నాడు రఘు. మంచం మీద తల్లి పక్కనే కూర్చోంది రమ. తల్లి చెప్పే విషయాన్ని తెల్సుకోడానికి ఆతృత పడ్డారు.

"సాయంత్రం మావయ్యొచ్చాడు!" అని ఆమె అనడంతో వారిలో వున్న సస్పెన్స్ అంతా ఎగిరి పోయింది. హాయిగా ఊపిరి వదిలారు.

"పెళ్ళి ముహూర్తం పెట్టుకొని వచ్చాడా?" అడిగింది రమ మామూలు ధోరణిలో. సాయంత్రం జరిగిన విషయం చెప్పింది తల్లి.

* * * *

ఆ సాయంత్రం వచ్చిన అన్నయ్యను ఆప్యాయంగా ఆహ్వానించారు అనసూయమ్మ. 'కాఫీ తెస్తానుండు! అంటూ లోపలికి వెళ్ళారు.

రామనాథం గారిలో గిల్టీనెస్ ఆవరించింది. ఫ్రీగా లేరు. తాను చెప్పాల్సింది ఎలా చెప్పడం? చెల్లెలి ముఖం చూస్తూ చెప్పడం కష్టమే! విషయం తెలిస్తే కాఫీ కూడా యివ్వదేమో! ఆగ్రహించి అవతలకి పొమ్మంటుందేమో! ఇంటికి పోయి ఈ విషయం ఫోనులో చెబితే! అది సభ్యత కాదు! తోబుట్టువుతో మర్మంతో మసలకూడదు! ఎంత త్వరగా చెబితే అంత మంచిది! ఆలోచిస్తూ కూర్చున్నారు. కాఫీతో తిరిగి వచ్చారు అనసూయమ్మ. అన్నయ్యకు కాఫీ అందించి అన్నారు.

"ఆ మధ్య చెప్పాను కదా! రమ కోసం బెజవాడలో ఓ సంబంధం చూస్తున్నామని!"

"అవును!" అన్నారు రామనాథం గారు పొడిగా.

"వాళ్ళు వుత్తరం రాసారు! రమని చూసుకోడానికి పదో తారీఖు బుధవారం వస్తామని! ఆ రోజు మీ రంతా యిక్కడే వుండాలి! రఘు చిన్నవాడు. వాడికి మాట్లాడ్డం తెలీదు! మన రెండు కుటుంబాలకి నీవే పెద్ద వాడివి! అన్నీ నీవే చూడాలి! కాళీ లేదంటే కుదరదు! అందుకే వారం రోజులు ముందుగానే చెబుతున్నా."

కాఫీ తాగుతూ మౌనం వహించారు రామనాథం గారు.

"భగవంతుని దయ వల్ల రమకి ఆ సంబంధం కుదిరితే రెండు పెళ్ళిళ్ళు ఒకే సారి జరిపించేద్దాం!"

కాఫీ త్రాగడం ముగించి కాళీ కప్పుని టీపాయ్ మీద వుంచారు రామనాథం గారు. అన్నయ్య ముభావంగా వుండటం గమనించి విస్తుపోయారామె.

"ఏమిటన్నయ్యా అలా వున్నావ్?" అడిగారు.

"అబ్బే! ఏమీ లేదమ్మా!" తొట్రుపాటు పడ్డారు.

"పిల్లలు యింట్లో లేరా?" అడిగారు.

"రఘు బాబు ఇంకా రాలేదు. రమ వాళ్ళ ఫ్రెండ్సుతో బిర్లా మందిర్‌కి వెళ్ళింది!"

"రఘు బాబేమంటున్నాడు?"

"ఏమంటాడు కుర్రనాగన్న? "మావయ్యే మనకి పెద్ద! పెళ్ళి వారితో అతనే మాట్లాడాలి!"అన్నాడు'అని చెప్పారు.

తన కూతుర్ని పెళ్ళి చేసుకోమంటే రఘుబాబు ఏమంటున్నాడు? అని ప్రశ్నించిన రామనాథంగారికి ఆ విషయంపై సమాధానం రాలేదు. ఆ రోజు రఘుబాబుని అడిగి చెబుతానంది చెల్లెలు. వాడేమన్నాడో తెల్సుకోవాలనుకొన్నారు రామనాథంగారు. అయితే సందర్భం మారడంతో జవాబు మరోలా వచ్చింది. తిరిగి వివరంగా అడగాల్సి వచ్చింది.

"అది కాదమ్మా ఉషని కోడలుగా చేసుకోమని ఆనాడు అడిగితే రఘుబాబుని అడగాలని అన్నావు కదా! ఏమన్నాడు?" అనుకూలంగా జవాబు రావాలని ఆశించారు.

"పిచ్చి సన్నాసి! వాడేమంటాడు! మన మాట ఎప్పుడూ కాదనడు! మీ యిష్టం! అన్నాడు." సంబరపడుతూ చెప్పారు.

రామనాథంగారికి గుండెల్లో బండరాయి పడింది.

"ఈనాటి పిల్లలు పెద్దల మాటలు వినరమ్మా ..." అని ఏదో చెప్పబోతూంటే మధ్యలో అందుకొన్నారు అనసూయమ్మ.

"అదేం లేదన్నయ్యా! మన పిల్లలు అలాంటివారు కాదు! పెద్దవాళ్ల మాటను జవదాటరు! వాళ్ళ బాగోగులు చూసే కదా మనం సంబంధం నిశ్చయం

**జరిగినకథ-4 :** అనసూయమ్మ అన్నయ్య రామనాథంగారు తన కూతురు ఉషను రఘుకిచ్చి పెళ్ళిచేయాలని ఉందని అనసూయమ్మని అడిగి వెళ్ళారు. రేణు తండ్రి చనిపోయారు. ఉష తను శేఖర్‌ని ప్రేమించానని అతనినే పెళ్ళిచేసుకుంటానని, ఈ విషయం అత్తయ్యవాళ్లకి చెప్పమని రేణూని అడుగుతుంది. ఉష శేఖర్‌ని ప్రేమించిందని తెలుసుకున్న రామనాథంగారు ఉగ్రులయ్యారు. శేఖర్ మినిష్టరుగారి బావమరిది. శేఖర్ తను ఉష ప్రేమించుకున్నామని, పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నామని, అందుకు రామనాథం గారి అనుమతిని కావాలని అడుగుతాడు. రామనాథంగారు మినిష్టరుగారితో తానొకసారి మాట్లాడతానని, ఆయన నిర్ణయంపై వివాహం ఆధారపడి ఉంటుందని తెల్పి చెప్పారు.

చేస్తాం! పదికాలాలపాటు కలకల్లాడుతూ ఉండడవే కదా మనం కోరుకొంటాం! ఉషతో పెళ్ళి అనగానే వాడిలో వుత్సాహం పెల్లుబికిందనుకో!"

"అదికాదు! ముహూర్తం పెట్టే ముందు వాడితో ఒక మాట చెబితే మంచిదనే కదా అన్నావు!" రెట్టించారు రామనాధంగారు.

"అవున్రా! ముందుగా చెప్పడం మన ధర్మం! అందుకే అన్నా!"

"ఆనాడు నీ మాటలు విపరీతంగా తోచాయి నాకు! పెడార్థం తీసుకొన్నా? పిల్లలొత్తె చెప్పేదేవిటి అనుకొన్నా! అదే నేను పడ్డ పొరపాటు! ఉషని కూడా కనుక్కోకుండా ముహూర్తాల వరకూ వచ్చేసాం!"

అన్నయ్య మాటలకి అచ్చెరువొందారు అనసూయమ్మ. ఏమి చెబుతాడో అని కంగారుపడ్డారు.

"ఇప్పుడేమయింది?" ఉద్వేగపడ్డారు.

"జరగకూడనిదే జరిగింది! అది బావను చేసుకోనంది!" మొహాన్ని గోడ గడియారం వైపు తిప్పుకొని చెప్పారు.

నిశ్చేష్టురాలయ్యారు అనసూయమ్మ. దృష్టిని చెల్లెలు వైపు మరల్చారు రామనాధంగారు.

"ఈ కాలం పిల్లల పోకడలు వేరమ్మా!" అన్నారు సముదాయింపుగా. మౌనం వహించడం అనసూయమ్మ వంతైంది. చెల్లెలి ఆవేదనను గమనించి తల్లడిల్లారు ఆయన కూడా.

"మేమెంత నచ్చ చెప్పినా వినలేదు!" అన్నారు.

కొంచెం తేరుకొని అన్నారు అనసూయమ్మ.

"చిన్నపిల్ల దానికేం తెలుస్తుంది! పెళ్ళయ్యాక చూడు తూలుతూ తుళ్ళుతూ తిరుగుతారు! ఆ మూడు ముళ్ళూ పడితే అనుబంధం యేర్పడి అభిమానం పుట్టుకొస్తుంది!"

"మీ వదినా నేనూ వారం రోజుల నుంచి చెవినిల్లు కట్టుకొని చెబుతున్నాం. అయినా వినడంలేదు! వాళ్ళిద్దర్కీ పెళ్ళి చేయమని చనిపోతూ అమ్మ చేతిలో చేస్తు వేయించుకొంది. అమ్మ కోరిక నెరవేరడం లేదనేదే నా బాధ! వీళ్ళ పెళ్ళిళ్ళ వల్ల మన బంధుత్వం తెగిపోతుందేమోనని భయంగా వుంది. ఈ విషయం నీతో ఎలా చెప్పాలో తెలీక నాలుగు రోజుల నుంచీ నలిగిపోతున్నా! ఆ చెప్పేదేదో ముందుగా చెప్పండి అని మీ వదిన పోరు!"

అన్నయ్య మాటలకి ఆమెలో నిస్త్రాణం ఆవరించింది. నోట మాట రాలేదు. పరిస్థితులు అలా పరిణమిస్తాయని కలలో కూడా అనుకోలేదు. కొంత సేపటికి తెప్పరిల్లారు.

"పోనీ అన్నయ్యా! పెళ్ళి విషయంలో ఎవర్నీ బలవంతం చేయకూడదు! మేనరికం చేసుకొందాం అని ఆశించాను. అమ్మకిచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టుకోవాలని ప్రయత్నించాను. కానీ మరోలా జరుగబోతోంది!" నిరాశగా అన్నారు హీనస్వరంతో. కొన్ని నిమిషాలు మౌనంగా గడిచాయి.

"అయితే ఎవర్ని చేసుకొంటానంటోంది?" పొడిగా అడిగారు ఏదో మాట్లాడాలని.

చెల్లెలు అడుగుతోంది కాబట్టి చెప్పడంలో తప్పులేదనుకొన్నారు రామనాధంగారు. ఎప్పుడైనా చెప్పక తప్పదు.

"మినిష్టరుగారి బావమరిది చంద్రశేఖర్ అని ఓ అబ్బాయి వున్నాడు. ఇద్దరూ ప్రేమించుకొన్నార్ట! పెళ్ళి చేసుకొంటార్ట!" అని ఆగి చెల్లెలి మొహంలోకి చూశారు.

ఆమెలో నిరాశా నిస్పృహలు ఆవరించాయి.

"సరే! ఏం చేస్తాం! నేనా రోగిష్టిదాన్ని! ఇద్దరి పెళ్ళిళ్ళూ ఒకేసారి చేయాలని మీ బావగారు అంటూ వుండేవారు! అలాగే జరిపించాలని అనుకొన్నా! అంతా దైవ నిర్ణయం! బుధవారంనాడు మాత్రం మీరంతా తప్పకుండా రావాలి! ఆ పెళ్ళివారితో నీవే మాట్లాడాలి!"

ప్రాధేయపడ్డారు అనసూయమ్మ.

"అలాగే! తప్పకుండా వస్తాం!" అనక తప్పలేదాయనకి.

అన్నయ్య వైఖరి చూసి మరలా అర్థించారు.

"ముందు రోజు సాయంత్రానికే రావాలి!"

"ఏ అర్జంటు పనులు లేకుండా వుంటే తప్పకుండా వస్తా!"

అన్నయ్య తప్పించుకోడానికి ప్రయత్నిస్తున్నాడన్న అనుమానం ధృవపడింది. అయినా మరోసారి ప్రాధేయపడ్డారు.

"అందుకే ముందుగా చెబుతున్నా! ఆ రోజున పనులేవీ పెట్టుకోకు! మీ బావగారే బతికుంటే నిన్ను ఆశ్రయించాల్సిన అవసరం వుండేదికాదు!"

కన్నీరు పెట్టుకొన్నారు అనసూయమ్మ.

తోడబుట్టిన చెల్లెల్ని ఏడ్పించినందుకు బాధపడ్డారాయన.

"అది కాదమ్మా! ఎనభైవేల రూపాయల బిల్లు అందాలి. అదిగో యిదిగో అంటూ రోజూ తిప్పుతున్నారు. ఆ రోజు కూడా ఆఫీసుకెళ్లాల్సి వస్తుందేమోనని అలా అంటున్నా! బావగారు లేని లోటు రానీను! తప్పకుండా వస్తా!"



## నిశ్శబ్ద సంగీతం

వాగ్దానం చేసి చెల్లెల్ని తృప్తిపర్చారు.

"ఒక్కడివే కాదు ఒదిన్ని, ఉషని కూడా తీసుకురావాలి! సంబంధం చేసుకోకపోతే పోయావ్ బాంధవ్యం తెంచుకోకన్నయ్యా!"

"అందరవూ వస్తాం! సరా?" హామి ఇచ్చారు.

* * * * *

జరిగినదంతా చెప్పి పిల్లల మొహాల వైపు చూసారు అనసూయమ్మ. ఏమాత్రవూ చలించకుండా నిశ్చలంగా కన్పించాడు రఘు. రమ మాత్రం కలవరంగా కన్పించింది.

"పోనీ అమ్మా! దీనికింత విచారించాల్సిన అవసరంలేదు. ఆ మాటకొస్తే అన్నయ్యకసలు యిష్టమే లేదు! నువ్ బాధపడ్తావని 'ఊ' అన్నాడంతే! అన్నయ్యకి పెళ్లావే దొరక్కపోతుందా!"

ఉక్రోషపడుతూ అంది రమ.

"ఉష యిలా ఎందుకు మారిందో, ఎలా మారిందో తెలీకుండా వుందమ్మా! అత్తయ్యా అత్తయ్యా అని నా వెనకనే తిరుగుతూ వుండేది మాటి మాటికి రఘు బావ రఘు బావ అంటూ మురిసిపోయేది!" మరోసారి వాపోయారు అనసూయమ్మ.

అన్నయ్యని ఓసారి చూసింది రమ. నిండు కుండలా తొణక్కుండా కన్పించాడు. గంభీరంగా వున్నాడు.

"మీ అమ్మమ్మ ఉషని కోడలుగా చేసుకోమని ప్రాధేయపడింది. చేతిలో చేయి వేయించుకొంది! నేనూ మీ నాన్నగారూ సరే అనేవరకూ దాని ప్రాణం పోలేదు!"

కన్నీరు నింపుకొన్నారు అనసూయమ్మ.

మౌన ముద్రను వీడలేదు రఘు. రమకి ఉక్రోషం ఎక్కువైంది. పౌరుషం పుట్టుకొచ్చింది.

"అవునమ్మా! అప్పుడు మావయ్య పరిస్థితి వేరు! తిండికి లేకుండా వుండేవాడు! మన అంతస్థుకి తగరని వేరే సంబంధం చేసుకొంటామేమోనని అమ్మమ్మ బెంగపడింది. ఈ పదిహేను సంవత్సరాల్లోనూ వారి పరిస్థితి మారింది. కాంట్రాక్టుల్లో బాగా కల్సొచ్చింది. లక్షలకి అధిపతయ్యాడు. చిన్న బంగళా కట్టించాడు. కారుని మెంటెయిన్ చేస్తున్నాడు. పెద్ద కాంట్రాక్టరు కదా! అయినా ఇప్పుడు కూడా మనతో సరితూగలేడు! అంతా డబ్బు మహత్యమమ్మా! మినిష్టరుగారి బావమరిదిని చేసుకొంటే యింకాపెద్ద కాంట్రాక్టులు సంపాదించి కోటీశ్వరుడు కావాలని అనుకొంటున్నాడు. అంతా మన మేలు కోసమే జరిగిందని సరిపెట్టుకొందాం! దీనికింత విచారించాల్సిన పనిలేదమ్మా!" తల్లిని ఊరడించాలని ప్రయత్నించింది రమ.

"ఏం బాబూ! అంతా వింటున్నావా" మౌనంగా వున్న తనయుణ్ణి అడిగింది తల్లి.

అన్నయ్య పెదవి కదల్చక పోవడంతో రమే అందుకొంది. ఆమెలో ఆవేశం తగ్గలేదు.

"ఏం చేస్తాం? మీ అమ్మాయే కావాలని వాళ్లని బతిమాల్తామా? మా అమ్మాయిని చేసుకోండి అని వాళ్లు కాళ్లా వేళ్లా బడితే యిష్టం లేకపోయినా సరే అన్నాం! మనంతట మనం వెళ్లి ప్రాధేయపడ్తామా? పోతే పోనీ బోడి సంబంధం! మరో మంచి పిల్ల దొరుకుతుంది!"

పుల్ల విరిచినట్టు తేల్చి చెప్పింది రమ.

సమాధానం కోసం తన వైపే చూస్తున్న తల్లితో అన్నాడు రఘు.

"దీనికింత విచారించాల్సిన పనిలేదమ్మా!"

ఆ వెంటనే మేడ మెట్లెక్కి తన గదిలోకి పోయాడు. వెళ్తున్న అన్నయ్య వైపే చూస్తున్న తల్లితో అంది రమ.

"పదే పదే ఆలోచించి మనసు పాడు చేసుకోకమ్మా! మరో సంబంధం అవుతుంది! ఎవరికి ఎవరితో రాసి పెట్టుందో! అంతా దైవనిర్ణయం!" అంటూ తన గదిలోకెళ్లింది రమ. లైటార్పి పడుకొంది. కానీ నిద్ర రాలేదు. ఉష యెలా మారిందో అర్థంకాలేదు. ఆ సంగతి మర్చిపొమ్మని తల్లికి సలహా యిచ్చిందిగానీ తానే మరువలేకుండా వుంది.

అన్నయ్యను రాసుకొని తిరగాలని ఎప్పుడూ ఉబలాటపడేది ఉష. తాము ముగ్గురూ కల్సి ఎన్నో విహారయాత్రలు చేసారు. వారిద్దరూ ఎంతో అన్యోన్యంగా వుండేవారు. గువ్వల జంటలా విహరించేవారు. వారిద్దరి మధ్యా తాను తిరగాల్సి వచ్చినందుకు ఒక్కో సందర్భంలో సిగ్గుపడేది. వారితో బాటు తిరగడానికి వెనుకంజ వేసేది - అలాటి ఉష మరో పురుషునికి మనసిచ్చిందా? నమ్మశక్యం కాలేదు రమకి. అయినా అది పరమసత్యం నమ్మక తప్పదు. నిద్రరాలేదు. పదకొండైంది. మంచం దిగి లైటు వేసింది. ఏమి తోచదు. డ్రెస్సింగ్ టేబులు ముందు కూరుంది. టేబిలు మీద తనూ, రేణూ కల్సి తీయించుకొన్న ఫోటో కన్పించింది. గోల్కొండ కోటమీద అన్నయ్య తీసాడు. కలర్ ఫోటో. రోజూ చూస్తున్న ఫోటో యే అయినా చేతిలోకి తీసుకొని పరీక్షగా చూసింది.

రేణు మాత్రం అందంలో ఏం తీసిపోయింది? నిజానికి ఉషకన్నా రేణూయే అందంగా వుంటుంది. ఎంత కలుపుగోలుతనం! మాయ మర్మం తెలియని పిల్ల! రేణు తనకు ఒదిన ఎందుకు కాకూడదు? ఆ వూహ యిదివరకెన్నడూ తనకు రాలేదు. అలా తానెప్పుడూ ఆలోచించలేదు కూడా.

అన్నయ్యా రేణూ కల్సి ఎదురుగా నిలబడినట్టు వూహించుకొంది. అపరిమితానందం పొందింది. చివాల్న లేచి తల్లి గదిలోకి వెళ్లింది.

తల్లిగదిలో లైటు యింకా వెలుగుతూనే ఉంది. ఆమె నిద్రపోలేదు. తల్లి పక్కనే మంచం మీద కూర్చుంది.

"ఇంకా నిద్రపోలేదామ్మా?" అడిగింది తల్లిని.

"నిద్ర ఎలా వస్తుందే? ఆడపిల్లవి నీకు మొగుడు దొరకలేదు! మీ అన్నయ్యకి మేనరికం తప్పిపోయింది!" విచారాన్ని వ్యక్తం చేసారు అనసూయమ్మ.

"దీనికంత బాదపడ్తావెందుకమ్మా? అన్నయ్యకేం తక్కువ? నీ మేనకోడలు కన్నా అందమూ, అణుకువా వున్న మరో పిల్ల వస్తుంది. నాకు సంబంధం చూస్తున్నారుగా! ఇద్దర్కీ ఒకేసారి పెళ్లిళ్లవుతాయ్ బాధపడకు!" తల్లిని వోదార్చింది రమ.

"ఆ రోజు కోసమే ఎదురు చూస్తున్నా! మీ నాన్నగారు లేకపోవడం వల్లనే కదా నాకీ దుస్థితి. ఆయనే వుంటే వీళ్లిలా ప్రవర్తించి వుండేవారా!"

కన్నీరు నింపుకున్నారు అనసూయమ్మ.

తల్లి ధోరణి రమకి చికాకు తెప్పించింది.

"ఏమిటమ్మా నీకు మరి పిచ్చెక్కువై పోతోంది! మాకేమంత వయసు ముంచుకొచ్చిందని? డాక్టరుగారమ్మాయిని చూస్తున్నావుగా! నాకన్నా మూడేళ్లు పెద్ద! ఎమ్మే చదువుకొంటోంది. డబ్బు లేకా సంబంధం కుదరకా పెళ్లి చేయడం మానేసారంటావా? ఎమ్మే పూర్తయితేగానీ, అంటే మరో రెండు



# కోటయ్య అనుభవం- సూరయ్య నోటనే విందాం



కోటయ్యా సూరయ్యా ఇరుగు పొరుగు ఊళ్ళ రైతులు.
ఎన్నాళ్లనుంచో మిత్రులు. ఒకసారి అనుకోకుండా కలిశారు...




























SAA/NIA/2802/TL

పూర్తి వివరాలకై మీకు దగ్గరలోని న్యూ ఇండియా కార్యాలయానికి విచ్చేయండి.
లేదా ఏజెంటును కలవండి.




న్యూ ఇండియా ఎష్యురెన్స్

నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం — భీమా!

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ)

## నిశ్శబ్ద సంగీతం

సంవత్సరాలు పోతేగానీ పెళ్ళి చేయరట! ఏమి దిగులుపడకు! మరో రెండు మూడు నెలల్లో నేనీ యింటి నుండి వెళ్ళడవూ, మరో అమ్మాయి ప్రవేశించడవూ జరుగుతుంది! సరేనా!"

"అలా అవుతుందంటావా?" నిరాశ ధ్వనించింది తల్లి మాటల్లో.

"తప్పకుండాను!" ధైర్యంచెప్పి హామీ యిచ్చింది.

అనసూయమ్మ తృప్తిపడ్డారు.

"అమ్మా ..." అని ఆగింది రమ ఏదో అడగబోతూ.

"ఏం తల్లీ? చెప్పు."

"రేణూ! మన రేణూ అన్నయ్యకి ఈడే కదమ్మా?" అంది -

ఆ అభిప్రాయం అనసూయమ్మకి కూడా ఎన్నడూ రాలేదు. కారణం "రఘు పెళ్ళాం - ఉష" అని ఎప్పుడూ అందరూ అనుకోవడమే! రేణుని స్నేహితురాలి కూతురిలా, తన ఆత్మీయురాలుగా చూసుకొంటూ వచ్చారు. రేణు రఘుబాబుకి ఈడే! అనుకొన్నారు, అవునన్నట్లు తలూపుతూ.

"ఏమోనమ్మా! మీ అన్నయ్య ఏమంటాడో?" తల్లి సందేహాన్ని వెలిబుచ్చడంతో ఆమెకిష్టమేనని గ్రహించిన రమకి మనసు తేలికపడింది.

"అడిగితే సరి!" అంది.

"నేనడగలేను! నాకు మనసు బాగులేదు!"

చీకాకుపడింది తల్లి.

"అన్నయ్యని నేనే అడిగి తెల్సుకొంటా!" అంది ఆరిందాలా రమ.

"వద్దు రమా! వాడు మీ నాన్నగారిలా క్షణానికోలా వుంటాడు! సమయం చూసి నేనే అడుగుతా!" కూతుర్ని వారించింది తల్లి.

"అన్నయ్య కాదనడనే నా నమ్మకం!"

అంటూ లేచింది రమ.

* * * * *

మర్నాడు ఉదయం రేణూకి ఫోన్ చేసింది రమ.

"అర్జంటుగా రావాలి! నీతో మాట్లాడాలి!"

"అర్జంటుగానా? రావడం కుదర్దు రమా! సాయంత్రం నాలుగ్గంటల వరకూ డ్యూటీ! వెరీ సారీ! సాయంత్రం తప్పకుండా వస్తా!"

"నో సారీ! నిన్నర్జంటుగా చూడాలని ఉంది! వస్తావా? నన్నే రమ్మంటావా?" ఆప్యాయంగా, గట్టిగా అడిగింది.

రమ ఎందుకలా పట్టుబడ్తోందో అర్థం కాలేదు రేణూకి.

"సాయంత్రం వస్తానన్నాగా! అమ్మగారికెలా వుంది?" అడిగింది.

"బావులేదు!"

కంగారుపడింది రేణు. "ఏమైంది?" అడిగింది.

"ఆరోగ్యంగానే వుందనుకో! మనసు బావులేదు!"

"అలా అయితే భగవద్గీత చదివి విన్పించు!" సలహా యిచ్చింది రేణు.

"సరి సరి! నాకంత ఓపికెక్కడిది? నీవే చదివి విన్పించాలి! సాయంత్రం తప్పకుండా వస్తావు కదూ!"

"ష్యూర్!" ప్రామిస్ యిచ్చింది రేణు.

"థాంక్యూ" అంటూ రిసీవరు పెట్టేసింది రమ.

"ఎవరితో నే మాట్లాడుతున్నావ్?" అప్పుడే హాల్లోకి ప్రవేశిస్తూ కూతుర్ని అడిగారు అనసూయమ్మ.

"రేణుతో అమ్మా! సాయంత్రం వస్తానంది!"

"అది వస్తానందా, నువ్ రమ్మన్నావా?" చిరునవ్వుతో అడిగారు.

"నేనే రమ్మన్నానమ్మా! భగవద్గీత వింటే మనశ్శాంతి లభిస్తుందంటావు కదమ్మా! అందుకే రమ్మన్నా!"

"వచ్చేక దానికి వూపిరి సలపనిస్తావుటే! ఏవో కబుర్లతో కాలక్షేపం చేస్తావ్! నాకు భగవద్గీతేం విన్పిస్తుంది! వస్తుంది కదా! రానీ! చూసి చాలా కాలం అయింది!" తృప్తిపడ్డారు అనసూయమ్మ.

"చాలాకాలం ఏవిటమ్మా! నాలుగు రోజుల క్రితమే కదా వచ్చింది!" అంది నవ్వుతూ రమ.

"అవును కదూ! రేణూ రెండు రోజులు కనబడకపోతే ఎంతో కాలం అయినట్టుంటుంది రమా!"

"అందుకేనమ్మా అలా ఆలోచించాను. నీకు నచ్చిన పిల్లే కోడలవుతుంది! ఏమి బెంగపెట్టుకోకు!"

తల్లికి ధైర్యం చెప్పింది.

"ఏమో తల్లీ! అంతా అయోమయంగా వుంది! మీ అన్నయ్య ఏమంటాడో!" అంటూ తల్లి నిష్క్రమించాక ఆలోచనలో పడింది రమ.

రేణూ అన్నయ్యను చేసుకోడానికి యిష్టపడుతుందా? అంగీకరిస్తుందనే ధైర్యంగా వుంది. తీరా అడిగాక ఒప్పుకోకపోతే? ఏదో సాకు చెబితే! తీరా ఆమెను అంగీకరింపజేసాక అన్నయ్య కాదంటే? ఎలా? ఎవర్ని ముందు అడగడం? అన్నయ్యకి రేణుమీద సదభిప్రాయమే వుంది. తాను స్వయంగా చూసింది.

ముగ్గురూ కల్సి ఓసారి గోల్కొండ కోటకి మరోసారి యాదగిరి గుట్టకి వెళ్ళారు. రేణుతో సరదాగానే మాట్లాడేవాడు అన్నయ్య. డైరెక్టుగా మాట్లాడ్డానికి రేణు కొంచెం జంకేది. ఎన్నో జోకులు వేసి యిద్దర్ని నవ్వించేవాడు అన్నయ్య. కొంతసేపు కులాసా కబుర్లు చెప్పి ఏదో మాట విసిరేవాడు అన్నయ్య రేణుని ఆడించాలని. అప్పుడు ఆమె అలకబూని మౌన వ్రతం పట్టేది. ఆమె మాట్లాడకపోతే అన్నయ్య కొట్టుకుపోయేవాడు! ఆమెను అనునయించడానికి పూనుకొనేవాడు! తాను కలుగజేసుకొని యిద్దరికీ రాజీ కుదిర్చేది. మళ్ళీ కులాసా కబుర్లు! కొంతసేపయాక అన్నయ్య ఏదో చురక విసిరేవాడు. మళ్ళీ ఆమె మౌనం! ఆ అలకల్ని అనునయాల్ని ప్రణయ కలహంగా ఊహించుకొని మధురానుభూతిని పొందింది రమ.

(ఇంకా ఉంది)









స్వశుండాగ్ర రాజన్మణి మంకాధిరూఢ స్వపత్న్యా ... (చిత్రం : ఎం. చిన్నబ్బాయి)

# శివకేశవద్యుతి గణపతి జగదేకాధిపతి!

గణానాం త్వాం గణపతిం
హవా మహే కవిం
కవీనా ముపమ శ్రవస్తమమ్
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం
బ్రహ్మస్పత ఆనః
శృణ్వన్నూతిభిః సీద సాదనమ్ -

అని ఋగ్వేదోక్తి. ఇది గణపత్యా వాహన మంత్రం. ఈ శ్లోకం ప్రకారం గణపతి బ్రహ్మణస్పతి. బుద్ధి బృహస్పతి. గణ నియామకుడగు సర్వేశ్వరుడు. మహోత్తమ మంత్ర పాలకుడు. ' మహాకవి. జ్యేష్ఠరాజు!

గజాననుడు పార్వతీపుత్రుడు. శివానుగ్రహము పొంది సకల గణాధ్యక్షుడైనాడు. విద్యా సరస్వతికి దత్త పుత్రుడై అగ్ర పండితుడైనాడు. శత్రుమర్దనుడై ఆనంద వర్ధనుడై తొలి పూజా పురుషుడైనాడు. విఘ్నేశ్వరుడై వినుతికెక్కినాడు. శివాశివ భేదము లేక అందరూ కొలిచే దేవదేవుడై మనోవాంఛితములను నెరవేరుస్తున్నాడు. ఆబాలగోపాలానికి అత్యంత ఆరాధ్యుడై ప్రతి పాత్రుడై విద్యాబుద్ధులను ప్రసాదిస్తున్నాడు. శైవులని, వైష్ణవులని వేరుపడి సామరస్యం చెడి సంఘీభావానికి దూరమవుతున్న జనసామాన్యానికి కనువిప్పు కలిగించే సర్వసమానతా మానవతా ప్రతిరూపం వినాయకుని స్వరూపం!

గణేశుడు సస్యాధిపతి. సకల ధాన్యరాశులూ అతని అనుగ్రహ ధారలేనని ప్రతీతి. అందుకే మూషికం అతని వాహనమయింది కాబోలు! వినాయకుడు మోదక ప్రియుడు కావడానికి కూడా కారణం ఇంతేనేమో! శివకుమారునిగా ప్రశస్తి నొందిన విఘ్నేశ్వరుని సాక్షాత్తూ విష్ణు స్వరూపంగా గుర్తించడం ఎంతో ఆశ్చర్యాన్ని, సంతోషాన్ని కలిగిస్తుంది.

త్రైలోక్య మోహన గణేశ ధ్యానంలో గణపతికి సంబంధించిన వర్ణన ఇలా ఉంది.

గదా బీజపూరే ధనుశ్శూల చక్రే
సరోజోత్పలే పాశ ధాన్యాగ్రదన్తాన్!
కరైస్సంద ధానం స్వశుండాగ్ర రాజ
న్మణీకుంభ మంకాధి రూఢ స్వపత్న్యా!

"అంకాధిరూఢ స్వపత్న్యా" అనే మంత్ర భాగం ఎక్కువ మందిని ఆకర్షిస్తుంది. ఇద్దరు భార్యలను గణేశుడు తన తొడలమీద కూర్చుండ బెట్టుకున్నాడు. బుద్ధి, సిద్ధి అతని దేవేరులని చెబుతారు. ఈ అంశంతో ఏ మాత్రం పొంతన లేకుండా విఘ్నేశ్వరి స్వరూపం కూడా మన దేశంలో కొన్ని చోట్ల పూజలందుకొంటోంది. వినాయకుడు బ్రహ్మచారి అని భావించేవాళ్ళూ ఉన్నారు కాని, శ్రీ మన్మంత్ర రత్నాకర గ్రంథంలో ఉచ్ఛిష్ట గణేశ దేవతా ధ్యానంలో గణించదగ్గ విశేషముంది.

వివస్త్ర పత్న్యా సురత ప్రవృత్త
ముచ్ఛిష్ట మంబాసుత మాశ్రయే హమ్

అని వినాయకుని స్తుతించడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. హిందూ దాంపత్య జీవితం దేవతలకు కూడా ఆపాదించడంలో వింత ఏమీ లేదు.

మొత్తంమీద భారతీయ సంస్కృతిలో విఘ్నేశ్వరునికి ఒక విశిష్టమైన స్థానముంది. ఆయనని గురించి రకరకాల కథలు ఉన్నాయి. ప్రారంభ దేవతగా సర్వాధిపత్యాన్ని అందుకొనే అవతార పురుషునిగా వినాయకునికున్న స్థానం అనన్యసామాన్యమైనది. "అవిఘ్నమస్తు" అని ఆ స్వామి ఆశీర్వదిస్తేనే తప్ప కార్యం నిరాటంకంగా కొనసాగదనే భావం హిందూ జాతిలో నాటుకొనిపోయింది. ఇది మూఢనమ్మకమని కొందరు అంటారు కాని, ఒక జంతువుని కూడా దేవతగా స్వీకరించి దానికి ప్రీతిని కలిగించినప్పుడే అందరికీ మేలు కలుగుతుందని పరోక్షంగా తెలియజెప్పిన భారతీయ సంస్కారం ఎంత మందికి అర్థమవుతుంది? హనుమంతుడు, గరుత్మంతుడు, ఆదిశేషుడు, శుకుడు, బసవడు - వీరంతా ఎవరు? ఆయా రూపాలలో ఉన్న దేవతలే కదా!

ఎంతో ముందు చూపుతో జాతి సంరక్షణార్థం మన పూర్వీకులు గణాధిపతిని అవతరింప జేసి ఉంటారు. వారి అభీష్టమే మనది కావాలి. ఋతంభర ప్రజ్ఞాబండారమే గణేశ్వరం! పరమేశ్వరం! అదే మన జాతి స్వరం!

శుక్లాంబర ధరం విష్ణుం
శశివర్ణం చతుర్భుజం!
ప్రసన్న వదనం ధ్యాయే
త్సర్వ విఘ్నోప శాంతయే!

అని ఎలుగెత్తక తప్పదు. జాతి సేవలో తాత్సారం చేసినందుకు పరిహారంగా గుంజిళ్ళు తీయకా తప్పదు.

— డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

# అందరూ మనుషులే

క్రోవి రామమోహన శాస్త్రి

ఈ మధ్య మా ఆవిద ధోరణి నాకు చాలా ఆశ్చర్యంగా వుంది డ్యూటీ ముగిశాక ఇంటికి వెళ్ళాలనుకుంటేనే చికాకు కలిగేటంత విచిత్రంగా కూడా వుంది. అసలే పని చేసేది ప్రైవేటు కంపెనీ. తుమ్మితే ఊడిపోయే ముక్కులాంటి వుద్యోగం. ఇచ్చేది ఎక్కువ గాకపోయినా, ఎనిమిది గంటలూ వంచిన నడుం ఎత్తనీకుండా చాకిరి చేయించుకుంటారు. పైగా ఏ చిన్న లోపం కనిపించినా చివాట్లూ, చెప్పుదెబ్బలూ. జీవన పోరాటం మరి! అన్నీ భరిస్తూనే పాతికేళ్ళయి పని చేస్తూ యాభై ఏళ్ళు ఒంటి మీదికి తెచ్చుకున్నాను.

చెప్పొచ్చేదేవిఁటంటే చచ్చి చెడి శాయం గల విన్నపాలని, ఒంట్లో ఓపికంతా డ్యూటీలో ఖర్చు చేసుకుని కొంపలో కాలు పెడితే, యిల్లాలి గోలతో గుండె దడ పుట్టుకొస్తోంది. ఆ మాటకొస్తే అంత గోల పెట్టి నన్ను హడల గొట్టేటంత దారుణ పరిస్థితులంటూ ఏం లేవు. అయినా ఆవిడ గారి హడావిడికి అంతూ పంతూ లేకుండా పోతోంది.

రోజూ లాగే ఆ రోజు కూడా ఠంచనుగా అయిదింటికల్లా ఇంటికి చేరాను.

"అమ్మయ్య! వచ్చారా!" అన్నది కాంతం.

"అదేవిఁటి, అలా అడుగుతున్నావ్? దేన్నన్నా లేపుకు పోయానని కబురొచ్చిందా?" అన్నాను కుర్చీలో కూలబడుతూ.

"వస్తే మటుకు నేను నమ్ముతానా!"

"నా మీద అంత నమ్మకం వుందన్న మాట!"

"మీ మీద నమ్మకం సంగతేమో గాని, మీతో లేచొచ్చేందుకు, నా కన్న తలకి మాసిన ఆడది ఈ భూప్రపంచంలో వుండదని నా పూర్తి నమ్మకం!"

"నేను నిక్షేపంలా వుంటే నీకు తల మాయడమేవిఁటే?"

కాంతం నన్ను అమాంతం నమిలి మింగేలా చూస్తూ, "ఏవిఁటా వెధవ కూతలూ? మరీ మతి పోతున్నట్టుంది మీకు!" అంటూమంగళ సూత్రాలు కళ్ళకి అద్దుకుని విస–విస లోపలికి వెళ్ళింది

అలాంటి మాటొకటి పడేస్తే గాని ఈ ఈవినింగ్ షోలో మా కాంతం టింపరరిగా ఎగ్జిట్ అవదు. అది నాకు కాఫీ కలిపి తీసుకురావడానికి పట్టే పది నిముషాల కాలంలో కాస్త విశ్రాంతి తీసుకోవచ్చున్న ఆశ.

అయినా దీనికి ఇదేం జబ్బో అర్థం కావడం లేదు. మరి ఓ మూడు నాలుగు నెలలుగా ప్రతి చిన్న విషయానికి వాదనకి దిగిపోతోంది. పాదనతో సరిపెడితే బాగానే వుండేది. కాని బాహాబాహి యుద్ధానికి సిద్ధ పడుతోంది. పోనీ మనసులో ఏముందో చెబుతుందా అంటే అది లేదు. ఆఖరికి ఈ సమర శంఖారావాలకి తట్టుకోలేక గట్టిగా నోరు చేసుకుంటే, మా కాంతం పాత్ర ట్రాజెడీ నాటకం క్లైమాక్సులో లాగా ఏడుపులూ, మొత్తుకోళ్ళూ, ముక్కు చీదుకోవడాల్తో నిష్క్రమిస్తుంది ప్రతిరోజూ ఈ సీను, కొద్ది పాటి తేడాతో జరుగుతూనే వస్తోంది దీనికి ముగింపు ఎక్కడో బోధపడక సతమతమై చస్తున్నాను.

కాంతం గంగాళం లాంటి గ్లాసుతో ఉష్ణద్రవం ఏదో తీసుకొచ్చింది.

"అంత చిన్న గ్లాసుతో తెస్తున్నావ్? కాఫీయేనా?" అనడిగాను

"చాల్లెండి వేళాకోళం! హార్లిక్స్ కలిపాను'తాగండి!" అంటూ అందించింది, కాంతం. ఆవిడ గొంతులో ఇందాకటి తీవ్రత వినిపించలేదు. తక్షణం, ఆ గ్లాసు నిజంగానే ఉగ్గు గిన్నెలా తోచింది నాకు. అందుకున్నాను. ఆత్రంగా తాగుతున్నాను.

"పాపిష్టి నోరు ..." అని ఆగింది కాంతం

ఉలిక్కిపడ్డాను.

"నాదేనా?" అన్నాను.

"ఛీ ఛీ! మిమ్మల్ని అంటే పురుగులు పడి చస్తానండీ నేను! నా నోటిని గురించి అనుకుంటున్నాను. ఏవిఁటో ఈ మధ్య మరీ పిచ్చి పట్టినట్టు మంచీ చెడ్డా లేకుండా మిమ్మల్ని విసిగించేస్తున్నాను." అన్నది కాంతం చాలా నెమ్మదిగా

మలయానిల తరంగం ఒకటి ఎక్కణ్ణుంచో హఠాత్తుగా వచ్చి నా శరీరాన్నీ, మనస్సునీ స్పర్శించినట్లనిపించింది.

ఎదురుగా పైట కొంగు అంచుని వేళ్ళకి ముడేస్తూ, విప్పుతూ ఎప్పుడూ ఎటో చూస్తూ నిలబడ్డ కాంతంలో ఈ మధ్య నేను మర్చిపోయిన సౌందర్య రేఖలు మళ్ళీ కనిపించాయి. సన్నగా నవ్వేను.

"ఎందుకు నవ్వుతున్నారు?" అడిగింది కాంతం.

"ఇలా వచ్చి కూచో, చెబుతాను!" అన్నాను, ఓ ప్రక్కన అందుబాటులో వున్న స్టూలుని ఎదురుగా లాగుతూ.

కాంతం కూచుంది, ఓ సారి తలెత్తి చూసి, మళ్ళీ దించుకుని.

"చెప్పండి! స్టౌ అలాగే మండుతోంది. వేణ్ణీళ్ళు పడెయ్యాలి మీకు!" అన్నది.

"వేణ్ణీళ్ళ దేముందోయ్! నువ్వు హార్లిక్స్ గ్లాసుతో వచ్చిన దగ్గిర్నుంచి నడిచిన సీన్లో, నీ ముఖంలో, మాటల్లో తొంగి చూసిన భావాలు చూసి, చాలా కాలం తరవాత పులకరించాననుకో!ఇలా వరసగా ఓ నాలుగు రోజులు కనిపించావంటే ఆగిపోయిన నాటకం పూర్తి చేసేస్తాను కాంతం! రోజూ ఇలాగే వుండరాదూ?" అన్నాను, ఆవిడ చేతి గాజులు సవరిస్తూ.

"ఎలా వుండాలంటారు? ఇక్కడే, ఈ స్టూలు మీద, మీ ఎదురుగానా? ముందు చెయ్యి వదలండి! వీధి తలుపు తీసే వుంది ఎవరేనా వస్తారు. మన వేషాలు చూస్తే నవ్వుతారు!" అన్నది కాంతం. అన్నదే గాని చెయ్యి మాత్రం విడిపించుకోలేదు. ఆమె ముఖం అత్యంత ప్రసన్నంగా వుంది. చేతుల మధ్య వున్న ఆమె చెయ్యి కొద్దిగా కంపించడం కూడా నేను గమనించాను.

"మన వేషాల కేం లోటు కాంతం? ఇప్పటి దాకా బాగానే పోషించుకొచ్చేం, పాతికేళ్ళుగా. ఇప్పుడూ, ఇహ ముందు కూడా మనకి యిష్టమైన ఏ వేషం వెయ్యడానికైనా హక్కుంది. ఇందులో ఇతరుల ప్రమేయం లేదు. సరే. ఆ సంగతి అలా వుంచు. ప్రస్తుతం సూటిగా అడుగుతున్నాను, చెప్పు! ఇన్ని నెలలుగా నాకు మనశ్శాంతి లేకుండా చేస్తున్నావు! కారణం?" అనడిగేను, గొంతులో కొంచెం గాంభీర్యాన్ని రంగరించి.

"చెప్పానుగా చాలా సార్లు! మీరు వినిపించుకోనిదే నేనేం చేసేది చెప్పండి?" అన్నది కాంతం, నిష్ఠూరంగా

"చూడు కాంతం! ఎదటి మనిషి వినేలా చెప్పే తీరు వేరు! కాని నువ్వా దారొదిలేసి, ఇంట్లో తలెత్తిన ప్రతి, చిన్న సమస్యకి నేనే బాధ్యుడి నన్నట్టుగా ప్రవర్తించావు! నీకు, పరిష్కారం కన్న పరనిందే ప్రధానంగా తోచినట్టుంది. ఆత్మాభిమానం నీకే కాదు, ఎదటి వాడికీ వుంటుందిగా! నేను కట్టుకున్న వాడిననే భావంతో కాక, నీ సాటి మనిషినని గ్రహించి ప్రవర్తిస్తే ఈ గొడవంతా ఉండేదేకాదు!" అన్నాను.

కాంతం రెండు మూడు క్షణాలు నా వైపు కళ్ళార్పకుండా చూసింది. చిరునవ్వు నవ్వింది

"నిజమేనేమో బాబూ! మీ లాజిక్ అర్థం చేసుకోవడం నా వల్ల కాలేదు! ఉండండి! స్టౌ మీద వేణ్ణీళ్ళు పడేసి వస్తాను! కాగే దాకా కదలకుండా

కూర్చుని మాట్లాడుకోవచ్చు!" అంటూ కాంతం చెయ్యి విడిపించుకుని, నెమ్మదిగా వంట గదిలోకి వెళ్ళింది.

కాంతం నా కంటె అయిదేళ్ళు చిన్నది. అప్పుడే ఆమెకి నలభై అయిదేళ్ళు మీద పడ్డాయి. కాని, ఆమె నాకే కాదు, ఆ వయసులో వున్న వాళ్ళెవరికీ అలా కనిపించదు. కనీసం ఓ పదేళ్ళు చిన్నదానిలా కనిపిస్తూ వుంటుంది. నేటికీ ఆమె ముఖంలో, శరీరంలో అనాటి కాంతీ, లావణ్యం అలాగే నిల్చిపోయేయి. కాకపోతే అలనాటి చలాకీతనం, చిలిపితనం స్థానంలో కించిత్తు గాంభీర్యం, మరికాస్త చాదస్తం చోటు చేసుకున్నాయి. అప్పుడప్పుడు, బూడిద రంగు తిరిగిన నా క్రాపుని అద్దంలో చూసుకుని, ముసలివాడినై పోతున్నానని బెంగపడిపోతూ వుంటాను.

ఆ మాట కాంతంతో అంటే ఆమె ముగ్ధమనోహరంగా నవ్వి, "ఆ మాట మీతో ఎవరేనా అంటే, నిజానిజాలు నన్నడగమనండి? ఫైనల్ జడ్జిమెంటు నాదేగా!" అనేది.

ఆమె నవ్వు, ఆ విశాలమైన కళ్ళల్లోని మెరుపూ చూసి, నా వయస్సు ఇరవై ఏళ్ళు తగ్గిపోయినట్లనిపించేది నాకు.

నిజమే మరి! మనసుకి వయసు లేదు.

మళ్ళీ కాంతం లోపల్నుంచీ వచ్చింది. స్టూలు మీద కూచుంటూ, "చెప్పండి!" అన్నది.

"ఏం చెప్పమంటావ్? కొన్ని నెలలుగా ఖాళీగా వుండిపోయిన పెద్ద మంచం గురించి చెప్పనా? ఆ మంచం మీద ఇప్పుడే పరిచినట్లున్న నలగని తెల్ల దుప్పటి గురించా? దేన్ని గురించి చెప్పేది?" అనడిగాను.

"చాల్లెండి, మరి కుర్రాళ్ళై పోతున్నారు రాను రానూ!" అని మధురంగా మందలించబోయింది కాంతం, చిరునవ్వుతో విచ్చుకున్న పెదవులతో.

"మళ్ళా అదేం మాట? ఇప్పుడేగా ఫైనల్ జడ్జిమెంటిచ్చేశావ్?" అన్నాను.

"అలా అని మరి పచ్చిగా మాట్లాడుకుంటామా?" అన్నది కాంతం, కళ్ళు తిప్పుతూ.

"ఈ వయసులో పచ్చిగా మాట్లాడుకుంటేగాని గుండెల్లో వెచ్చదనం రాజు కోదు కాంతం. ఇది నా థియరీ! రాజీ కొచ్చిన రమణీమణివి. తొందరేముందిలే! రాత్రంతా ముందుంది. బెంగలేదు. ఇక నీ మనోవేదనేమిటో చెప్పేసెయ్." అన్నాను.

కాంతం కొద్ది సేపు మౌనం వహించింది. ఆమె మాటలు వెదుక్కుంటోందని అర్థమైంది. కొంత టైమివ్వడం అవసరం అనిపించింది. ఈలోగా నేనో సిగరెట్టు ముట్టించాను. గట్టిగా రెండు దమ్ములాగి గాలిలోకి వదిలాను. పైపైకి పోతున్న నీలిరంగు పొగల్లోకి చూస్తూ వుండిపోయాను.

కాంతం గొంతు సవరించుకుంది.

"మన కృష్ణబాబు వ్యవహారం!" అన్నది.

కాంతం వైపు దృష్టి మళ్ళించాను.

కృష్ణ మా సుపుత్రుడు. జ్యేష్ఠుడు. మా పెళ్ళయిన ఏడాది కల్లా మా యింట ఊపిరి పీల్చుకున్నాడు. ఇరవై మూడు నిండి ఇరవై నాలుగు మొన్ననే వచ్చింది. బి. కామ్ పాసై ఆర్నెల్ల కిందటే ఊళ్ళోనే విలసిల్లుతున్న ఓ ఫ్యాక్టరీలో గుమాస్తా వుద్యోగంలో చేరాడు. జీతం బాగానే వస్తుంది. నిజం చెప్పాలంటే అచ్చం వాడు వాళ్ళ అమ్మ నోట్లోంచి వూడి పడ్డట్టుంటాడు. మగ వేషం వేసుకున్న మా కాంతం లాగే వుంటాడు. పెళ్ళి వయస్సొచ్చి మీదపడ్డా, యిప్పటికీ కాంతం దృష్టిలో వాడింకా పసివాడే. నోట్లో నాలిక లేని అమాయకుడనీ, నాలుగు మాటలు చెప్పిన వాళ్ళ మాయలో పడిపోయేటంత అర్భకుడనీ కాంతం నమ్మిక. వాడి తరవాత ఇద్దరాడపిల్లలు. పిల్లలుముగ్గురికి ఏడాదో, ఏణ్ణర్ధమో వార.



పరిస్థితులు ప్రస్తుత సమాజంలో ఎలా వున్నాయో తెలిసిన వాళ్ళం గనక ముందే జాగ్రత్త పడి ఆడపిల్లల పెళ్ళిళ్ళు చేసేసి బరువు దింపేసుకున్నాం ఇక మిగిలిన వాడు కృష్ణ.

ఏ మాట కామాటే చెప్పుకోవాలి. మా కృష్ణ ఈ తరం ఆలోచనలకి ప్రతీక అయితే నా ఎదురుగా వాడెప్పుడూ అధికంగా మాట్లాడడు, ఎంతో అవసరం అనుకుంటే తప్ప. వాడెంత తక్కువ మాట్లాడినా వాడి అభిప్రాయా లెటువంటివో నేను ఏ నాడో పసిగట్టాను మొదట్నుంచి. ఎవర్ని శాసించి, నా చెప్పుచేతుల్లో వుంచుకునే స్వభావం కాదు నాది. సర్టెన్ ఎక్స్‌టెంటు వరకే ఆ పద్ధతి ఆచరణీయమని నా విశ్వాసం. అన్ని వేళలా, ప్రతి విషయంలోనూ పిల్లల మీద నిరంకుశాధికారాలు చెలాయించడం కన్నవాళ్ళకి గౌరవప్రదం కాదని నేను అనుకుంటూ వుంటాను అయితే ఈ అభిప్రాయం కాంతం ఒప్పుకోదు. మన బిడ్డలు పూర్తిగా మన చెప్పుచేతల్లోనే వుండాలని వాదిస్తుందామె. సమాజంలో వస్తున్న మార్పులు, 'వింత' ధోరణులు ఆమెకి గిట్టవు. అందుకే ఈ మధ్య మా కృష్ణకీ, కాంతానికీ చిన్న చిన్న సంఘర్షణలు కొనసాగుతూ వస్తున్నాయి. ఈ విషయం నేను గ్రహించాను. అయినా కలగజేసుకోలేదు, ప్రయోజనం వుంటుందన్న ఆశలేక

కాంతం నన్ను కాల్చుకు తినడానికి కారణం అదేనని నాకు తెలుసు. ఎవరి పక్షాన నిలబడి వాదించినా, మరొకళ్ళకి బాధ కలిగించడమే అవుతుందనిపించి మౌనంగా వుండిపోయాను పాతికేళ్ళుగా నా కష్టసుఖాల్లో నిస్వార్థంగా పాలు పంచుకున్న కాంతం ఓ పక్క, ఇరవై మూడేళ్ళుగా మా ఆలనాపాలనల్లో పెరిగిన కొడుకు కృష్ణ మరో ప్రక్క. మధ్యన నేను ఇద్దరూ కావలసిన వాళ్ళే. నా వాళ్ళు, ధర్మకాటాలో ఎవరి పక్క మొగ్గు చూపినా చికాకే. లేని సమస్యల్ని సృష్టించుకోవడం అవుతుంది.

ఆలోచనలు కట్టిపెట్టి, "ఏవిఁటి కాంతం ఆ వ్యవహారం?" అనడిగేను.

"అంతా నా కర్మ!" అన్నది కాంతం.

"ఆదుగో, ఆ వేదాంతం మాత్రం మాట్లాడకు. అసలు విషయం చెప్పు.' అన్నాను.

కాంతం కొద్ది సేపు తటపటాయించింది. ఇబ్బంది పడుతున్నట్టుంది, చెప్పడానికి.

"జాన్‌రత్నం కూతురు తెలుసుగా మీకు?" అనడిగింది కాంతం.

"తెలుసు. బంగారు బొమ్మ. పేరు మేరి అనుకుంటా!" అన్నాను.

"అవును మేరి! కృష్ణబాబుతో నే పని చేస్తోందట." అన్నది కాంతం, గంభీరంగా.

"ఒక్క మేరి యేం కర్మ? పద్మ, సుల్తానా, జయమణి... అందరూ ఒక చోటే పని చేస్తున్నారు. ఆ మధ్య మన చిన్నమ్మాయి పెళ్ళికి వచ్చినప్పుడు అందర్నీ పేరు పేరు వరసనా పరిచయం చేశాడుగా కృష్ణ?" అన్నాను.

## ఎండమావి

కలలో కనిపిస్తున్నావు
జీవితంపై ఆశను చిగురిస్తున్నావు
అందుకొందా మనుకొంటే
అందనంత దూరంలో ఉన్నావు
ఎండమావి లాంటి ఉద్యోగమా
ఆటలాడకు దయఉంచి
నాలాంటి నిరాశాజీవులతో!

– జి. జానకీరామ్

## అందరూ మనుషులే

"అందరి సంగతీ ఎందుకులెండి! నేను మాట్లాడేది మేరి గురించే!"

"ఇప్పుడు మేరికి ఏమైందట?" అనడిగేను

"దానికేమి కాదు. అయ్యేదంతా మన కృష్ణబాబుకే!"

'వాడికేమవుతుంది, కాంతం?" అన్నాను.

"ఏమవుతుందా? పరువూ మర్యాదా మంటగలిసి పోతాయి. వీడా పిల్లతో తెగ తిరిగేస్తున్నాడు " అన్నది కాంతం కోపంగా.

"కొంపతీసి కృష్ణ వెనక నువ్వు సి. ఐ. డి. గా తిరుగుతున్నావో ఏవిఁటో, నాకు అనుమానంగానే వుంది." అన్నాను

"వాడి తిరుగుళ్ళు నాకు తెలీడానికి నేనే తిరగాలా? చూసిన వాళ్ళెవరైనా చెబుతారు. పక్కింటి హనుమాయమ్మగారూ, ఆవిడ భర్తా మొన్న సినిమా హాల్లో చూసేరట మనవాణ్ణీ మేరిని. వెనక సీట్లో కూచుని ఒకటే పక – పకలూ వికవికలూలు!" అన్నది కాంతం.

మౌనంగా వింటున్నాను.

"మొన్న వాళ్ళు చూసి చెప్పడం కాదు! ఇంతకు ముందోసారి నా కళ్ళతో నేనే చూసేను. నిలదీసి అడిగితే, నీదంతా చాదస్తం అమ్మా! మేరి నేనూ మంచి స్నేహితులం సినిమాలకి వెళ్ళినా షికార్లకి వెళ్ళినా తప్పులేదు." అన్నాడు. వాడి దృష్టిలో నాది చాదస్తం! విన్నారా?" అనడిగింది కాంతం ఆవేశంగా.

"నీది చాదస్తం అనడం నే ఒప్పుకోను కాంతం!" అన్నాను చాలా నెమ్మదిగా.

"అంటే వాడు దాంతో తిరగడం ఒప్పుకుంటారన్న మాట?" అన్నది కాంతం రోషంతో.

"తిరగడం రెండు రకాలు కాంతం! మామూలుగా మనసులు విప్పి మాట్లాడుకోవడానికి, ఒకరినొకరు అర్థం చేసుకోడానికి షికార్లకి, సినిమాలకి వెళ్ళడం ఒక రకం పోతే... శారీరకమైన కోరికల ఒత్తిడితో, రహస్య స్థలాలు వెదుక్కుంటూ తిరగడం మరో రకం. నా నమ్మకం ఏవిఁటంటే వాళ్ళు మొదటి రకం తిరుగుళ్ళతో నే సరిపెట్టుకుంటున్నారని." అన్నాను.

"అవి రెండో రకానికి మారవనీ మీకు నమ్మకం ఉన్నట్టుంది? అన్నది కాంతం హేళనగా.

దొరికి పోయేను. ఇప్పుడు నేనేం జవాబు చెప్పినా, కాంతం ఇంకో చిక్కు ప్రశ్న అడుగుతుంది. ఇలాంటి విషయాల్లో ఆడవాళ్ళ లాజిక్ ముందు మగాడు ఓటమి అంగీకరించాల్సిందేనని నాకు బాగా తెలుసు. అందుకే నేను సమాధానం చెప్పలేదు.

"అందుకేనండి, వాడి పెళ్ళి ప్రయత్నాలు తొందరగా మొదలెట్టండి అని చెవినిల్లు గట్టుకుని చెప్తున్నాను. జాన్‌రత్నం కూతురు మనవాణ్ణి వల్లో వేసుకోవాలని చూస్తోంది. ఒక్కగానొక్క కొడుకు. అడ్డమైన వాళ్ళ వల్లో పడిపోతే మన పరువుప్రతిష్ఠలు గంగపాలవుతాయి." అన్నది కాంతం, బాధ పడుతూ

నేను కొన్ని క్షణాలు మౌనంగా వుండి, "అదికాదు కాంతం! ఇలాంటి వ్యవహారాల్లో ఏక పక్షంగా ఆలోచించకూడదు. రెండో వైపు నుంచి కూడా ఆలోచించాలి." అన్నాను

"రెండో వైపు నుంచా?" అడిగింది కాంతం.

"అవును మనవాడి వైపు నుంచి అసలు మేరిని వల్లో వేసుకోవాలని వీడే ట్రయల్స్ చేస్తున్నాడేమో? ఏం? అందుకు అవకాశం లేదంటావా?" అన్నాను.

"ఊరుకోండి చాలుగాని. కృష్ణబాబు ఒట్టి అమాయకుడు ఇంకా పాతికేళ్ళయినా రాలేదు వాడికి. వాడి మీద, కన్నతండ్రి అయి వుండి ఇటువంటి అభాండాలు వెయ్యకండి, బావుండదు. వెంటనే జాన్‌రత్నాన్నీ, మేరిని కలుసుకుని కృష్ణబాబు మీద ఆశలు పెట్టుకోవద్దని చెప్పి రండి. మా అన్నయ్య ఇప్పటికే పది వుత్తరాలు రాసేడు. మనతో సంబంధం కలుపుకుంటానంటూ " అన్నది కాంతం.

"ముందు కృష్ణని అడగాలిగా?" అన్నాను

"వాడి మొహం! వాడి కేం తెలుసుని అడుగుతారు?" అన్నది కాంతం.

ఏమి తెలీకుండానే, ఏ రకమైన అభిప్రాయం లేకుండానే మేరీ వెంట ఎందుకు తిరుగుతాడూ – అని అడగటానికి ధైర్యం చాలింది కాదు. ధైర్యం చేసి అడిగితే ఇన్ని నెలల తరవాత మళ్ళీ కాంతంతో కలిగిన సాన్నిహిత్యం దూరమవుతుందేమోనన్న భయం. ఈ సమస్య పైకి చిన్నదిగా, పట్టించుకో వీల్లేనంత స్వల్పంగా కనిపించినా, చాలా జటిలమైనదని ఆకళింపైంది నాకు

"సరే నీ యిష్టం! నీళ్ళు తోడు. స్నానం చేసి అలా వెళ్ళొస్తాను " అంటూ కుర్చీలోంచి లేచేను.

★ ★ ★ ★

కాంతానికి మాట యిచ్చానే గాని జాన్‌రత్నాన్ని కలుసుకుందుకి నా మన సొప్పడం లేదు. ఒకవేళ మనస్సుకి నచ్చ జెప్పుకుని కలుసుకున్నా, అతనితో నేనేం మాట్లాడాలి? మీ అమ్మాయి మేరి మా వాడితో తిరుగుతోందట. కొంచెం అదుపులో పెట్టవయ్యా అని చెప్పాలి తీరా చెప్పాక అతనింతెత్తున ఎగిరిపడి మీ వాణ్ణి అదుపులో పెట్టుకోలేక నాకు చెపుతున్నావా అని ఎదురు తిరిగితే, సమర్థించుకోడానికి తగినంత బ్యాక్‌గ్రౌండు నా దగ్గిర లేదు. కృష్ణా, మేరి కలిసి అడపాదడపా

సినిమాలకి, షికార్లకి తిరుగుతున్న విషయం, హనుమాయమ్మా, ఆవిడ భర్తా, వాళ్ళిద్దరి ద్వారా విన్న కాంతం నా చెవిన వెయ్యక ముందే నాకు తెలుసు. అయితే నేను దాన్ని అట్టే సీరియస్‌గా తీసుకోలేదు.

ఆసలీ రోజుల్లో ఇలాంటి సంఘటనలు చాలా సాధారణమై పోయాయి. హైస్కూలు స్టేజిలోనే పిల్లలు బోయ్ ఫ్రెండ్స్‌తో, గరల్ ఫ్రెండ్స్‌తో తిరగడం చూస్తూనే వున్నాను. వయస్సు, చెత్తరకం సినిమాలూ, సంఘ వాతావరణం కలిసి రేపిన ఉద్రేకాలతో తొందర పడిపోయి, కడుపో కాలో వచ్చి, ఆ ప్రమాదం తప్పించుకోలేక ఆత్మహత్యలు చేసుకున్న ఆడపిల్లల కథలు చాలా విన్నాను.

మా కృష్ణ గాని, మేరీ గాని అలాంటి తొందరపాటుతో ప్రవర్తిస్తారన్న సందేహం లేదు నాకు ముఖ్యంగా మా కృష్ణలో అంత బలహీనత లేదని నా ప్రగాఢమైన నమ్మకం. అందుకే, తెలిసినా తెలీనట్లే వుండిపోయాను. పైగా ఇద్దరూ ఉద్యోగాలు చేసుకుంటున్నారు. సంఘంలో ఓ రకమైన గౌరవ స్థానంలో వున్నారు నలుగురి నోళ్ళల్లో పడి అవమానాల పాలయ్యే విధంగా ప్రవర్తించరు.

కాని, ఇద్దరూ స్నేహాన్ని పెంచుకోవడంలో, కలిసి తిరగడంలో ఏ ప్రయోజనాన్ని ఆసిస్తున్నారో తెలుసుకోవలసిన బాధ్యత నాకుంది. అందుకు ప్రప్రథమంగా జాన్‌రత్నాన్నో, మేరీనో కలుసుకోవడం కన్న మా కృష్ణని అడగడమే మంచిదనిపించింది.

నడుస్తున్న వాణ్ణల్లా ఓ సారి నిలబడి వాచీ చూసుకున్నాను. సాయంత్రం ఆరు దాటింది. ఈ మధ్య కృష్ణ ప్రతి రోజూ ఓ గంట ఓవర్ టైం చేస్తున్నాడు. ఇంకో పావు గంటలో జంక్షన్‌లో కంపెనీ బస్సు ఆగుతుంది. అక్కడ దిగి, అయ్యర్ హోటల్లో స్నేహితులతో కాస్సేపు పిచ్చాపాటీమాట్లాడుకుని ఇంటికి చేరడం వాడికి అలవాటు. కనక వాణ్ణి అక్కడే కలవడం మంచిది.

## అందరూ మనుషులే

ఇంట్లో అడిగితే మా కాంతం మరో సీను క్రియేట్ చేస్తుంది.

గబ-గబ ముందుకి సాగాను. అయిదు నిముషాల్లో అయ్యర్ హోటల్ జంక్షన్‌కి చేరాను. ఇంకా కంపెనీ బస్సు రాలేదు. రోడ్డు వార నిలబడి ఓ సిగరెట్టు ముట్టించి, గట్టిగా రెండు దమ్ములాగి గాలిలోకి వదిలాను.

ఆలోచించసాగాను.

మేరీ నా మనస్సులో మెదిలింది.

అందంగా, చాలా ఆకర్షణీయంగా వుంటుంది. మేరీ చెంపకి బారెడు కళ్ళు. నవ్వుతుంటే సొట్టలుపడే బుగ్గలూ, పెద్ద జడా, పొడుగ్గా, పొడుక్కి తగిన అవయవ నిర్మాణంతో చూపుల్ని ఇట్టే నిలబెట్టేస్తుంది. దరిదాపు ఆరడుగులున్న కృష్ణ పక్కన నిలబడ్డా, కలిసి నడిచినా చూడ ముచ్చటగా వుంటుందన్నది నిజం.

ప్రస్తుతం సంఘంలో యువతీయువకులు సౌఖ్యవంతమైన వైవాహిక జీవితం కావాలని తపిస్తున్న సంగతి జగమెరిగిన సత్యం. వాళ్ళ ఆలోచనల్లా సుఖాన్ని గురించే గాని, భారతీయ సామాజిక జీవన సరళిలో వివాహబంధానికున్న ప్రాధాన్యతనీ, పవిత్రతనీ నిలబెట్టాలని కాకపోవచ్చు సుఖజీవనానికి వివాహబంధం చాలా అవసరమని భావించగలగడమే గొప్ప అనుకోవాలి. ఆ వివాహానికి పరస్పర ఆకర్షణా, ఆనందానుభూతులూ ప్రధానంగాని, కులాలూ, మతాలూ, కలిమిలేములు అంతరాలూ అడ్డురాకూడదని అనుకుంటూ వుండటం, శుభ పరిణామమనే చెప్పుకోవచ్చు.

మా కృష్ణా, మేరీలు ఇలాంటి ఆలోచనలోనే వున్నారా? ఈ ప్రశ్న నా మెదడులో అదే పనిగా రొద చేస్తోంది ఎంతకీ సమాధానం చెప్పుకోలేక నాలో నేనే విసుక్కున్నాను.

అంతలో దూరం నుంచి కంపెనీ బస్సు రావడం చూసి ఆలోచనలు కట్టి పెట్టేను. పేవర్లో తల దూర్చాను.

ఇంతలో బస్సొచ్చి ఆగింది. ఉద్యోగులంతా గబ-గబ దిగి హడావిడిగా ఎవరి దారిన వాళ్ళు సాగిపోతున్నారు. అందరి కన్నా వెనకగా మా కృష్ణ, వాడి వెనక మేరీ దిగారు. గమనించాను.

ఇద్దరూ నన్ను చూళ్ళేదు.

హోటల్ ముందు నిలబడ్డారు.

"విజ్జీ! ఇక్కడే దిగి పోయావేం?" అని ప్రశ్నించాడు మా కృష్ణ.

"దిగాలనిపించింది. దిగాను. అయినా కృష్ణా! నీ కెన్ని సార్లు చెప్పేను? ఓ డబల్ సీట్‌లో కూచుని నన్ను పిలవమని! పొద్దస్తమానం నువ్వొక డిపార్ట్‌మెంటులో, నేనొక డిపార్టుమెంటులో ఏడుస్తున్నాం. కనీసం బస్సులోనైనా ఒకే సీట్లో కూచుని రావాలని వుండదా నీకు?" అడిగింది విజయమేరీ.

"ఎందుకుండదు?" అడిగాడు కృష్ణ చిరునవ్వుతో.

"మరి రోజూ ఇలాగే చేస్తున్నావేం?"

"కావాలనే చేస్తున్నాను. ఇప్పటికే కొలీగ్సంతా మన మీద అసూయతో కుళ్ళి చస్తున్నారు ఇక మనిద్దరం రోజూ ఒకే సీట్లో సర్దుక్కూచుంటే భరించగలరా, చెప్పు! భరించడం సంగతలా వుంచు మనిద్దర్నీ జూలో జంతువుల్ని చూసినట్లు చూస్తారు ఆ చూపుల్ని తట్టుకోవడం కష్టం!"

నవ్వింది మేరీ. ఆమెతో శ్రుతి కలిపేడు మా కృష్ణ.

"ఇంకెన్నాళ్ళిలా?" అడిగింది మేరీ.

"సమయం చూసి ఇవ్వాళో రేపో మా డాడీతో చెప్తాను విజ్జీ. ఆయన తప్పకుండా ఒప్పుకుంటారు. మా అమ్మలాంటి చాదస్తాలు ఆయనకి లేవు. సమాజాన్ని ముక్కలు ముక్కలు చేస్తున్న ఈ కులమతాలూ, మూఢాచారాలూ ఆయనకి గిట్టవు. బతికి నన్నాళ్ళూ మనిషి సుఖంగా, సంతోషంగా, సంతృప్తిగా బతకాలనే తత్వం డాడిది వాటి కోసం ఎంత బలమైన గోడలనైనా కూలదోసే ధైర్యం, శక్తి కూడగట్టుకున్న వాడే నిజమైన మనిషి అంటారాయన." అన్నాడు మా కృష్ణ.

"నిజంగా ఆయన దేవుడే కృష్ణా! అలాంటి వాళ్ళు అరుదుగా వుంటారీ సంఘంలో. ఇంతకీ కాఫీ తాగిస్తావా, కబుర్లతో కడుపు నింపుతావా?" అనడిగింది మేరీ.

"ఇవ్వాళ నేను వాలిని." అన్నాడు కృష్ణ.

అంటే....?" అడిగింది మేరీ.

"పొద్దుట బట్టలు మార్చుకుని, పర్సు జేబులో వేసుకోవడం మర్చిపోయేను విజ్జీ! అందుకే నీ మీద వాలి పోవాల్సి వస్తోంది. కనక నేనిప్పుడు వాలిని."

మేరీ గల-గల నవ్వింది.

"థాంక్ గాడ్! ఎంత అదృష్టం! నువ్వు నా మీద ఎప్పుడు వాలిపోతావా అని ప్రతిక్షణం ఎదురు చూస్తున్నాను కృష్ణా! ఇన్నాళ్ళకి నా మీద దయ కలిగింది. నువ్వు రోజూ పర్సు మర్చి పోయి వస్తూండాలని, రోజూ నా మీద వాలాలనే నా కోరిక. మేగాడ్ బ్లెస్ మి! పద! ఇవ్వాళ, నీకు చాలా



యిష్టమైన గులాబ్ జాం యిప్పిస్తాను. కాదనకు." అంటూ హోటల్ మెట్లెక్కింది మేరి.

మంత్ర ముగ్ధుడిలా మేరిని అనుసరించాడు మా కృష్ణ.

సన్నివేశం చాలా పట్టుగా, శృంగార రసభరితంగా, ముద్దుగా, ముచ్చటగా సాగింది. పాన్ షాప్ పక్కనే మొహానికి పేపరు అడ్డు పెట్టుకుని నిలబడి వున్న నా చెవుల్లో వాళ్ళు మాట్లాడిన ప్రతి మాటా స్పష్టంగా సోకింది

నా మనసులో మెదిలిన ప్రశ్నకి సమాధానం లభించింది. ఇక ఎగ్జామినేషన్లూ, క్రాస్ ఎగ్జామినేషన్లూ అనవసరం. పైగా మా కృష్ణ నేను రాసిన నాటకాలూ, అప్పుడప్పుడు చెప్పిన ఉపన్యాసాలూ విని నా భావాల్ని పసిగట్టేసి, తన 'విజ్జి' ముందు నన్నొక దేవుడిగా చిత్రీకరించేశాడు. ముందరి కాళ్ళకి బంధం వేశాడు. దాదాపుగా నా నోరు నొక్కేశాడు.

అదే ఇప్పుడు నా కొక భయంకరమైన విషమ సమస్యని సృష్టించి పారేసింది. నేను వెళ్ళి కాంతానికేం చెప్పాలి? ఎవరు ఎవర్ని వల్లో వేసుకున్నారని చెప్పాలి? పరస్పరం వల విసురుకున్నారని చెప్పాలా? చెబితే మాత్రం నమ్ముతుందా? పోనీ నమ్మిందే అనుకున్నా, తన కొడుకు ఓ క్రైస్తవుల పిల్లని చేసుకోవడానికి ఒప్పుకుంటుందా? కథ ఇంత దూరం వచ్చాక, అది మొండి కెత్తి కూచుంటే ఫలితం ఏమిటి?

ఇవన్నీ భేతాళుడి చిక్కు ప్రశ్నల్లా నాలో గందరగోళం రేపుతున్నాయి. పేపరు మడిచి షాపువాడికిచ్చేసి, మెల్లిగా నడక సాగించాను. నడుస్తూనే సిగరెట్టు ముట్టించాను. గట్టిగా రెండు దమ్ములాగి గాలిలోకి వదిలాను.

మనస్సంతా ఒక్కసారిగా కల్లోలం అయిపోయింది. మా కృష్ణ తీసుకుంటున్న నిర్ణయం పొరపాటని నేను అనుకోవడం లేదు. వాడు మేరిని ప్రేమించడం ఘోరాపరాధం కాదని ఎరుగుదును. పరిణామశీలమైనది సమాజం మా కృష్ణ అయినా, మరొకడైనా – ఆ కోవకి చెందిన



యువతీయువకులంతా ఈ పరిణామ గదిలో ఇలాగే ప్రవర్తిస్తూన్న సంగతి కొత్తేమి కాదు. ప్రతిరోజూ ఈ రకం కథలు వింటూనే వున్నాను.

గతకాలపు సంప్రదాయమో, ఆచారమో, సిద్ధాంతమో – మారుతున్న సమాజానికి అనుగుణంగా రూపుదిద్దుకుంటున్న కొత్త తరం

## అందరూ మనుషులే

వాళ్ళని ఎల్లకాలం చెప్పు చేతల్లో ఉంచడం అసహజమే కాక అసాధ్యం కూడా. పూర్వం ప్రతిపాదింపబడ్డ ధర్మాల లాగే అచార సంప్రదాయాలూ, సిద్ధాంతాలూ ఫ్లెక్సిబుల్ అనుకుంటేనే చాలా సమస్యలు నివారింపబడతాయేమో లేకపోతే సంఘర్షణలు తప్పనిసరిగా చెలరేగుతాయి.

ఆలోచనల బరువుతో ఇంటికి చేరేసరికి కాంతం నా కోసం గుమ్మంలో నిలబడి ఎదురు చూస్తోంది.

"వాళ్ళని కలుసుకున్నారా?" అనడిగింది ఎంతో ఆదుర్దాతో.

"ఆ అవసరం లేదు కాంతం!" అన్నాను.

"అంటే?" అన్నది కాంతం అర్థంగాక.

విషయం ఏమి దాచకుండా చెప్పాను. దాచవలసిన అవసరం కనిపించలేదు.

కాంతం కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి.

"చివరికి ఇలా పగ తీర్చుకుంటున్నాడు వాడు వాడి పెళ్ళి విషయంలో మన ప్రమేయం లేనట్లే నన్నమాట! మనల్ని వీధిలో పెట్టడానికి వాడికి మనసెట్లా ఒప్పిందండీ?" అన్నది ఆవేశంగా.

"వాడి మనసిప్పుడు వాడిది కాదుగా కాంతం!దాన్ని మేరికి ధారాదత్తం చేసేశాడు. బాధ పడి ప్రయోజనం లేదు." అన్నాను.

"ఆపలేమంటారా?" అడిగింది కాంతం.

"యుద్ధం చెయ్యాలి. చేస్తాం. ఒకవేళ ఆ యుద్ధంలో మనం గెలిచినా, వాడు గెలిచినా ఫలితం ఒక్కటే కాంతం!" అన్నాను.

"వివరంగా చెప్పండి!" అన్నది కాంతం.

"ఏముంది? మనం గెలిస్తే వాడు దూరమై పోయి, కులం, అచారం, సంప్రదాయం మన దగ్గిరే మిగుల్తాయి. ఇక వాడు గెలిస్తే ఈ మూడూ పోవడం కాకుండా వాడు కూడా దూరమై పోతాడు. మొత్తం మీద ఏ రకంగా చూసినా వాడు దూరం కావడం తప్పదు." అన్నాను.

కాంతం కొన్ని క్షణాలు మాట్లాడలేదు.

ఆమె చాలా దారుణమైన వేదన అనుభవిస్తున్న సూచనలు ఆమె ముఖంలో స్పష్టంగా కనిపిస్తున్నాయి. కాని అది అనివార్యం. నేను ఓదార్చ గలిగిందేం లేదు.

తన కన్న కొడుకు తన మాట వినకుండా పోతున్నాడనీ, ఓ కులంగాని కులం పిల్ల వల్లో పడిపోతున్నాడనీ, ఇదంతా తనేనాడో చేసుకున్న పాపానికి ఫలితం అనీ కుళ్ళి కుళ్ళి ఏడ్చింది కాంతం.

కృష్ణకి చెప్పి చూస్తానంటూ ఓదార్చడానికి ప్రయత్నించాను. అదే విధంగా ఆ రాత్రి మా కృష్ణతో, అన్ని విషయాలూ వివరంగా మాట్లాడేను. గదిలో జరుగుతున్న మా సంభాషణంతా హాల్లో కూర్చుని కాంతం వింటూనే వుంది.

చాలా వాదోపవాదాల తరవాత, మేరి, మా వాడి హృదయంలో ఎంత గాఢంగా ముద్రించుకు పోయిందో అర్థమైంది. ఆమెతో జీవితాన్ని ఎంత సౌఖ్యావహంగా వాడు వూహించు కుంటున్నాడో గ్రహించాను. ఆమెని దూరం చేసుకున్నప్పటి జీవితం ఎంత సారహీనమో వాడు వాడి భాషలో వివరిస్తుంటే అవాక్కయి పోయాను.

మా యిద్దరిదీ ఒకే మాట నాన్నా! మీరు నన్ను అర్థం చేసుకుంటారను కున్నాను. మీరు మీ తరఫు నుంచే చెప్తున్నారు. మా వైపు నుంచి కూడా ఆలోచించండి. దాదాపుగా మే మిద్దరం భార్యాభర్తలం అయిపోయినట్లే మా కంపెనీలో అందరూ అనుకుంటున్నారు. ఈ పరిస్థితుల్లో ఎవరు వెనకడుగు వేసినా, మీరు బాధపడే కులం, అచారాల కన్న మా యిద్దరి ప్రవర్తనకే కళంకం ఎక్కువ. అంత చాతగాని వాళ్ళుగా మిగలడం ఒక నాటికి జరగదు." అని తేల్చేశాడు మా కృష్ణ.

ఇక నేను చెప్పగలిగిందీ, చెయ్య గలిగింది ఏం మిగల్లేదు. గదిలోంచి బైటికి నడిచాను.

"కాంతం, విన్నావుగా వాడి మాటలు?" అన్నాను కాంతంతో.

"అహా! పూర్తిగా విన్నాను. వాడిష్టం ఒచ్చినట్లు ఏడవమనండి. మన ఏడుపు మనం ఏడ్చి వూరుకుందాం. అసలు మనకి కొడుకే పుట్టలేదని అనుకుందాం. అంతేగాని, ఇలా కులాన్ని మంట గలిపిన దౌర్భాగ్యుడు ఈ ఇంట్లో ఉండటానికి మాత్రం నే ఒప్పుకోను. ఒకవేళ అటువంటి పరిస్థితి వస్తే ఏ నుయ్యో గొయ్యో చూసుకుంటాను. అంతే!" అంటూ లోపలికి వెళ్ళి పోయింది కాంతం, మూర్తీభవించిన విషాదంలా.

నేను ఆ హాల్లో శిలా ప్రతిమలా నిలబడి పోయాను.

* * * *

శ్రావణమాసం వచ్చేసింది.

## విఘ్నేశ్వర స్తోత్రము

ప. వేకువ వేళల
వెలుగుల జిలుగును
సుప్రభాతం నీకు
విఘ్నపతీ.....
విఘ్నపతీ.....

చ. నీ గుజ్జు రూపము
నీ ఏక దంతము
కనులకు విందులు
మనసుకు ఇంపులు "వేకువ"

విద్దెలకు నొజ్జవై
విఘ్నములకు రాజువై
యుగముల జగముల
జీవించు మానవుల
నీ కృప సారించి
నీ దయ చూపించి
దీవెన లీయుము "వేకువ"

–కె. నాగేశ్వరి

మరో నాలుగు రోజుల్లో వ్రతాలూ గట్రా మొదలవుతాయని కాంతం అప్పటికి పది పన్నెండు సార్లు నాతో చెప్పింది. తల వూపి వూరుకున్నాను.

"మన కర్మ యిలా కాలిపోయింది." అని ఒకటే కళ్ళనీళ్ళు పెట్టుకుంది కాంతం ఆ రోజు.

"అనవసరంగా మనసు పాడు చేసుకోకు కాంతం!" అన్నాను.

"ఈసారి ఆడపిల్లలు కూడా రావడానికి వీలుపడదని రాశారు!" అన్నది కాంతం.

"అవును. ఎవరి సంసారాలు వాళ్ళవి!" అన్నాను.

"ఇహ బతికున్నన్నాళ్ళు ఒంటరిగానే నా వెధవ బతుకు గడవాలని మొహాన రాసి పెట్టాడు, ఆ దిక్కుమాలిన దేవుడు!" అన్నదామె దుఃఖం దిగమింగుతూ.

"ఛీ! ఛీ! ఏవిఁటా మాటలు?" అన్నాను. బైటి నుంచి, "నాన్నా!" అన్న పిలుపు వినిపించింది ఒళ్ళంతా ఒక్కసారి జలదరించింది.

"కాంతం! అది మనః కృష్ణబాబు గొంతేనే' అన్నాను. నాకు తెలీకుండానే నా గొంతు కంపించింది.

కాంతం కళ్ళు తుడుచుకుంది.

"అవును! వాడి గొంతే! ఆర్నెల్ల తరవాత మనం గుర్తొచ్చినట్లున్నాం!" అన్నది. ఆ గొంతులో ఏ రకమైన భావమూ లేదు. కాని ఆ మొహంలో మాత్రం అనిర్వచనీయమైన వెలుగు.

"వెళ్ళి, విషయ మేమిటో అడగండి! నా మొహం వైపు చూస్తారేం?" అన్నది కాంతం.

తడబడే కాళ్ళతో వరండాలోకి నడిచాను.

"కులాసాగా వున్నారా నాన్నా! అమ్మ ఎలా వుంది?" అన్నాడు కృష్ణ.

"ఏదో ఇలా వున్నాంరా! మీరు?" అని అడిగేను. ఆర్నెల్లయి పోయింది వాడితో మాట్లాడి. నా కళ్ళల్లో నీళ్ళు తిరుగు తున్నాయి.

"బాగానే వున్నాం నాన్నా! మిమ్మల్ని చూడాలనిపించి...." అని ఆగేడు కృష్ణ. వాడి కళ్ళల్లోంచి ధారాపాతంగా జారుతున్నాయి అశ్రువులు.

"అమ్మాయి రాలేదా?" అడిగాను.

"వచ్చింది నాన్నా! వీధి గేటు దగ్గిరే వుండి పోయింది. దాని భయం దాన్ది!" అన్నాడు కృష్ణ తలవంచి.

"అదేవిఁట్రా! వీధిలో నిలబెట్టడ మేమిటి?" అన్నాను, బాధగా.

"తెలివి తేటలు! పిలవమనండి!" అన్నది గుమ్మంలో నిలబడి, కాంతం.!

కృష్ణ పిలవకుండానే వచ్చి, కృష్ణ పక్కనే నిలబడి చేతులు జోడించింది, మేరి

నేను కాంతం వైపు చూశాను. ఆమె కళ్ళార్పకుండా ఆ జంటని చూస్తూ వుండి పోయింది

"అమ్మ చాలా సార్లు చెప్పేది నాన్నా! నా భార్యతో నోములన్నీ పట్టిస్తానని. విజయ రోజూ గోల పెడుతోంది, శ్రావణ మాసం వచ్చింది, వెళ్ళి మిమ్మల్ని అడగమని! మీరు తప్ప మా కెవరున్నారు నాన్నా! వాళ్ళ నాన్న గారికివేవీ తెలీవు!" అన్నాడు కృష్ణ ఎలాగో గొంతు పెగుల్చుకుని

"అదేవిఁటి? ఆ అమ్మాయి కీ నమ్మకాలు ఉండవుగా?" అన్నది కాంతం చాలా, ఆశ్చర్యంగా.

"అది నా భార్యమ్మా! అలాని నేను విజయని ఏ విషయంలోనూ బలవంతం చెయ్యలేదు. చెయ్యను కూడా! తనే యిష్టపడుతోంది. కాని నేనే అన్నాను. మా అమ్మకి, నాన్నకి నేను కాని వాణ్ణి! ఇవన్నీ జరిగేవి కావని. అయినా విజయ పట్టుబట్టి బైలుదేర దీసింది." అన్నాడు కృష్ణ.

"కృష్ణా!" అని పిలిచింది కాంతం.

"అమ్మా!" అంటూ కృష్ణ మెట్లెక్కి గబ-గబ తల్లిని సమీపించాడు.

కాంతం కొన్ని క్షణాలు కృష్ణ మొహంలోకి చూసింది. ఒక్కసారిగా రెండు చేతుల్తో వాణ్ణి చుట్టేసింది. వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"అమ్మా, విజయా! వాళ్ళని కొంచెం ఓదార్చు!" అన్నాను.

మా కోడలు విజయ మేరి మెట్లెక్కి పైకొచ్చి వాళ్ళ పక్కనే నిలబడింది.

కాంతం ఓ చేత్తో ఆమె తల నిమిరింది.

కొన్ని కొన్ని మధుర దృశ్యాలు నాలాంటి రచయితకి చాలా అరుదుగా కనిపిస్తూ వుంటాయి.

కొన్ని రసమయ కావ్యాల సృష్టికి ప్రేరణలవుతూ వుంటాయి. □



"సాక్షి గణపతి" (శ్రీశైలం)

"ఓ సాక్షి గణపయ్య
సేతులెత్తి మొక్కేదమయ్య!
అక్షయంబు లోనయిన
అణు పరీక్షల నాపవయ్య!
విశ్వశాంతి నొసగుమయ్య."

— నిడమర్తి ఆదిలక్ష్మీప్రసాద్






## భార్య విడాకులు - భర్త ఆత్మహత్య!

లాల్‌గుడికి చెందిన 40 ఏళ్ల శ్రీధరన్ అనే డాక్టరుకూ, ఆయన భార్య డాక్టర్ రుక్మిణికి ఒక్క క్షణం కూడా పడేదికాదట. ఆవిడ తన భర్తను వొదిలి మద్రాసులో తన తండ్రి యింట్లో వుంటూ తన భర్తతో తనకు కాపురం చేయడం యిష్టం లేదని, తనకు విడాకులు కావాలని కోర్టును కోరిందట. ఈ సందర్భంగా ఆమె తన భర్తకు రాసిన కొన్ని వుత్తరాలలో డ్రగ్స్ చట్టం క్రింద నిన్ను నేను ఈ క్షణంలో అరెస్టు చెయించగలను అని రాసిందట సమాధానంగా డాక్టర్ శ్రీధర్ రాసిన వుత్తరాలలో కుటుంబం అన్నాక, జీవితం అన్నాక కొన్ని కార్యాలూ, కొన్ని అకార్యాలు చేసి తీరాలి అని రాశారట. చివరికి తన భార్య విడాకులు యిస్తోందని, తనకిహ బ్రతకాలని లేదనీ ఒకనాడు తన స్నేహితులతో అన్నారట ఆ రాత్రే ఆయన విషం త్రాగి ఆత్మహత్య చేసుకున్నారట.

## పొడవైన మీసాలున్న ఘనుడు!

స్వీడన్ దేశానికి చెందిన బింకర్ బిల్గాస్ అనే వో వాచి రిపేరు చేసే ఆయన తన మీసాన్ని 233.6 సెంటిమిటర్ల పొడవుకు ఏపుగా ఎంచక్కా పెంచుకున్నాడట. తను పనిలో వున్నపుడా మీసాల్ని రిబ్బను చుట్టినట్టు చుట్టి, వో క్లిప్పు పెట్టేస్తాడట పని ముగిసి బయటకి వచ్చాక ఆ మీసాలని స్వరున వదిలి, సవరించుకుంటూ బయల్దేరుతాడట.

## పిల్లితో పెళ్లి!

పశ్చిమ బెంగాలుకు చెందిన డార్జిలింగ్‌లో డాగ్మా అనే వో తెగకు చెందిన వారిలో ఒక వింత ఆచారం వివాహంలో వుందట. పెళ్ళి కొడుకు ముందస్తుగా




వో ఆడపిల్లిని, పెళ్ళి కూతురు వో మగపిల్లినీ పెళ్ళి చేసుకోవాలట ఆ పెళ్ళి అయ్యాక విడాకులు తంతు కూడా అవ్వాలట! ఆ తరువాతే ఆ వధూవరుల పెళ్ళిట. అంటే అది రెండో పెళ్ళి అన్నమాట!




## కంటికి ఆరోగ్యం కన్నీరు!

బాలానాం రోదనమ్ బలమ్ అని పెద్ద లన్నారు.




కానీ మనుష్యాణాం రోదనమ్ బలమ్ అని యిటీవలి శాస్త్రజ్ఞు లంటున్నారు కన్నీళ్ళు వచ్చేట్టుగా ఏడవడం ఏ వయస్సు వారికయినా మంచిదని వీరు ఏకగ్రీవంగా తీర్మానించారట. భావోద్వేగం వల్ల వచ్చే కన్నీరులో నీరు, కొన్ని కొవ్వు పదార్థాలే గాక, ఎన్‌కెఫలిన్ అనే రసాయనిక పదార్థం కూడా వెలువడు తుందట కనుక కన్నీరు కార్చడం ఆరోగ్యానికి మంచిదని అమెరికా– టెక్సాస్ రాష్ట్రాలలో ప్రపంచ కన్నీటి కాంగ్రెస్ సమావేశంలో విజ్ఞానులు నిర్ణయించారట వుల్లిపాయ వల్ల వచ్చే కన్నీటిలో యీ మహత్యం లేదని కూడా వారు ఉద్ఘాటించారట.

## ఆడంటే ఆడ, మగంటే మగ!

పిల్లలు– ఆడంటే ఆడ, మగంటే మగ– మన యిష్ట ప్రకారం కనవచ్చునని చెప్పడమే గాక, టోక్యోలో వో యిద్దరు డాక్టర్లు అంత పనీ వో ఆరుగురు దంపతుల మీద చేసి చూపారట. మగవారి స్పెరమ్‌లోని x క్రోమోజోమ్ ఆడవారి x క్రోమోజోమ్‌తో కలిస్తే ఆడ పిల్లలు పుడతారని, ఆడవారి x క్రోమోజోము మగవారి y క్రోమోజోముతో కలిస్తే మగపిల్లలు పుడతారని, మగవారిలో x y క్రోమోజోములు సమానంగా వుంటాయనీ చెప్పి, ఆ ఆరుగురు దంపతులూ కోరిన ప్రకారం వారికి ఆడపిల్లలే పుట్టించడానికి మగవారి ఇంద్రియం నుంచి x క్రోమోజోములను వేరు చేసి, వాటిని వారి వారి ఆడవారి x క్రోమోజోములతో కలిపి, కృత్రిమ గర్భధారణ చేసి, వారికి ఆడపిల్లలు పుట్టించారట. ఈ ఘనకార్యం చేసిన వారు టోక్యో విశ్వవిద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ హిడియో మోరి అనే ఆయన, కెలో విశ్వ విద్యాలయానికి చెందిన డాక్టర్ రిహబిలిజుకి అనే ఆయనా అట!

## "అగర్" నుంచి అతి ఖరీదైన సెంటు!

"అగర్" అనే వో చెట్టు నుంచి తీసే సెంటు నూనె ఒక కిలో సుమారు రెండున్నర లక్షల రూపాయల ఖరీదుట. ఈ చెట్టుకు ఇరవై సంవత్సరాలు నిండాక ఫంగస్ వల్ల ఒక విధమైన రసాయన సంయోగం చెందుతుందట. తత్ఫలితంగా యీ అత్యద్భుత మైన సెంటునూనెపుట్టి, ఆనక యీ చెట్టు నుంచి సుగంధపు గాలులు వస్తాయట అపుడు చెట్టు నరికి, యీ సెంటు నూనెను తీసి, మిగిలిన కర్రను అగరు వత్తులు చేసేందుకు వుపయోగిస్తారట. ఇవి అస్సాంలోనూ, బర్మాలోనూ, ఫిలిప్పైన్స్‌లోనూ ఎక్కువగాపెరుగుతాయట.

## బొడ్డూడని పిల్లలపై కుటుంబ భారం!

పెద్ద వారికి వుద్యోగాలు దొరక్క ఛస్తున్న యీ భారతదేశంలో బొడ్డూడని పిల్లలు పనులు చేసి డబ్బు సంపాదించడం ఎక్కువయి పోయిందట. అయిదు నుంచి పదిహేనేళ్ళలోపు మగా ఆడా పిల్లలు దేశం మొత్తం మీద సుమారు 440 లక్షల మంది పనులు (వుద్యోగాలనచ్చు) చేసి డబ్బు సంపాదిస్తున్నారట. అక్షరాభ్యాసం కూడా




కాకుండానే పిల్లలు సంపాదనలోకి దిగిపోతున్నారట కుటుంబ భారం మోయడానికి. ప్రభుత్వం ఎంత ప్రయత్నించినా యీ విషయంలో చెప్పుకోదగ్గ ఫలితాలు దక్కటం లేదట. □




సీరియల్

# జీవితం చేజారిందా?

కాకాని కమల

(గత సంచిక తరువాయి)-

దుఃఖ భారంతో వుంది.

కడుపు శోకంతో కుమిలిపోతూంది.

మనసు విప్పి ఏ మాట చెప్పాలన్నా ఇది సమయం, సందర్భం కాదు.

ఆ పరిస్థితిలో ఏ ఆడపిల్ల అయినా పుట్టిల్లే కోరుకుంటుంది.

కాని ఆమె వెడితే పిల్లల మాట ఏమిటి?

వాళ్ళని కూడా తీసుకు వెళతానంటే అభ్యంతరం చెప్పకుండా పంపాలి అనుకొన్నాడు.

కాని సీత పిల్లల్ని తీసుకువెళ్ళే ప్రశక్తి లేదని, తాను మాత్రమే వెళుతున్నానని, తిరిగి వచ్చే ఉద్దేశ్యం లేదని చెప్పగానే ప్రభాకర్ హతాశుడయ్యాడు.

అతనికి తల తిరిగినట్లయ్యింది.

ప్రస్తుత పరిస్థితుల్లో ఆమెని వెళ్ళవద్దనే హక్కు అతనికి లేదు. పంపించాలనే అనుకొంటున్నాడు.

కాని ఆమె శాశ్వతంగా పుట్టింట్లోనే వుండిపోతాననటమే ప్రభాకర్ని దిగ్భ్రాంతుడ్ని చేసింది.

"సీతా!?" అన్నాడు ఉన్మత్తుడిలా. ఆ పిలుపులో ఆర్తి వుంది. ఆవేదన వుంది.

సీత నెమ్మదిగా రెండు అడుగులు ముందుకు వేసి తాళాల గుత్తి టేబిల్ మీద పెట్టింది.

కొద్దిగా నలిగిన చీరలో ... జుత్తు రేగి ... వడిలిన పువ్వులా నిర్లిప్తంగా వుంది సీత.

ప్రభాకర్కి చాలా మాట్లాడాలని వుంది. కాని పదాలు అందటంలేదు. భాష రాని వాడిలా తడుముకుంటున్నాడు.

ఆఖరికి ఎలాగో గొంతు పెగుల్చుకొని అడిగాడు

"సీతా ...! ... మళ్ళీ ... ఎప్పుడు వస్తావ్?"

సీత నిశ్శబ్దంగా తల ఎత్తి అతనికేసి చూసింది.

ఆమె కళ్ళు రక్తంలో ముంచి తీసిన కలువ మొగ్గల్లా వున్నాయి.

మౌనంగా తల అటు యిటు కదిలించింది.

"బహుశా ఇంక రానేమో! నేను మా పుట్టింట్లోనే వుండిపోవాలి అనుకొంటున్నాను. మీరు కావాలంటే మళ్ళీ పెళ్ళి చేసుకోండి. నాకేమి అభ్యంతరం వుండదు. మీరు కోరిన చోట సంతకాలు పెడతాను ... ఇక ఈ ఇంటితో ... నాకు ఎలాంటి సంబంధము లేదు ..."

చెప్పి చప్పున వెను తిరిగింది సీత.

ఆమె చెప్పింది ఏమిటో అర్థం అయ్యేసరికి అతని గుండె ఝల్లుమంది. అప్పుడే స్పృహ వచ్చిన వాడిలా మెరుపులా లేచి గుమ్మానికి అడ్డంగా నిలబడి రెండు చేతులు తలుపుకి అడ్డం పెట్టాడు.

"... ..."

"సీతా! నావల్ల నిజంగా క్షమించరాని నేరమే జరిగింది. నీకు తీరని ద్రోహం చేశాను. కాని నాకు నానీ మీదగాని ... నీ మీదగాని ... ఏ విధమైన ద్వేషంలేదు. నువ్వు నమ్మవని తెలుసు. కాని ... పిల్లలు నువ్వు లేకుండా వుండలేరు. నా మీద కోపంతో వాళ్ళని శిక్షించకు సీతా ... ప్లీజ్ ..."

సీత రెండు చేతులు జోడించింది.

"వద్దు! దయచేసి నన్ను ఆపాలని చూడకండి. శుష్క వాదనలు చేసే ఓపిక నాకు లేదు. నా మనసు విరిగిపోయింది. మీ పిల్లల సంగతి మీ యిష్టం ...

... ఇకపై ఈ ఇంటితో నాకు ఏ విధమైన సంబంధంలేదు."

దెబ్బతిన్నట్లు చూశాడు ప్రభాకర్.

"సీతా! ప్లీజ్. అంత మాట అనకు. నేను భరించలేను."

సీత చివ్వున తలెత్తింది.

"నేను భరించగలనా?"

"...!?"

"మీ పిల్లల విషయంలో ఏ చిన్న పొరపాటు జరిగినా మీరు నన్ను క్షమించలేనని, ఈ ఇంట్లో నాకు స్థానం లేదని చెప్పారు. అవునా?"

"..."

"ఇంతవరకు అలాగే కాపాడుకొంటూ వచ్చాను. కాని ఇకపై నా వల్ల పొరపాట్లు జరగవచ్చు. నా మనస్సు దెబ్బతింది. ఆ బాధలో నేను అజాగ్రత్తగా, అప్రమత్తంగా వుండవచ్చు. మంచికయినా - చెడుకయినా నానీ నా స్వంత బిడ్డ కనక ఆ బాధ్యత కూడా నాదే అయ్యింది.

కాని ...

... రేపు దురదృష్టవశాత్తూ ఈ ఇంట్లో ఏ చిన్న అరిష్టం జరిగినా దానికి నేనే బాధ్యురాల్ని అని, నేను కావాలనే చేశానని, కక్ష తీర్చుకొన్నానని నింద మోపితే నేను

జరిగిన కథ-23 : ప్రభాకర్ పిల్లల్ని తీసుకొని బావమరిది పెళ్ళికి వెళ్ళాడు. నానికి జ్వరం వస్తే డా. ఆనంద్ చూసి మందిచ్చి వెళ్ళాడు. నానికి జ్వరం తగ్గినట్లే తగ్గి మర్నాడు తెల్లవారేసరికి హై టెంపరేచర్ వచ్చేసింది. నాని మరణంతో సీత మనసు బండబారిపోయింది. నాని మరణించిన మర్నాడు పెళ్ళి నుంచి వచ్చాడు ప్రభాకర్. నాని మరణవార్త విని ప్రభాకర్ గుండె చల్లగా అయింది. మనసు ఉద్వేగంతో కొట్టుకుంది. సీతని తనని క్షమించమని అడిగాడు. సీత తను తల్లితో కూడా తమ ఊరు వెళ్ళిపోతున్నానని చెప్పగానే దిగ్భ్రాంతుడయ్యాడు ప్రభాకర్.

భరించలేను.

... ఆ అపవాదుని రూపుమాపి నా నిజాయితీని నిరూపించుకోగల శక్తి కూడా నాకు లేదు ...

... అంతేకాదు ... ఎందుకో నాకు ఇక్కడ వుండాలని లేదు. పైగా ఇప్పుడు నా మనసు కూడా ఏమి బాగుండలేదు ...

అందుకే... దయచేసి నన్ను ఆపకండి :..."

సీత చప్పున చీర కొంగుతో మొఖం చాటు చేసుకొని చివ్వున వెనుదిరిగి గుమ్మం దాటింది.

ప్రభాకర్‌కి గుండె ఆగినంత పని అయ్యింది. గభాల్న దూకినట్లు రెండు అడుగులు ముందుకి వేసి ఆమె చేతిని పట్టుకున్నాడు.

"సీతా! నీ దృష్టిలో నేను దోషిని. అందుకే నిన్ను ఆపగల శక్తి లేదు నాకు. కాని ఆఖరిగ ఒక మాట చెప్తాను. వింటావా?"

"...!?"

ప్రభాకర్ తనలో తను చెప్పుకొంటున్నట్లు గుబులుగా అన్నాడు! ...



## జీవితం చేజారిందా

"సంధ్య పోయిన తరువాత చీకటి నిండిన నా ఇంట్లో తిరిగి దీపం వెలిగించిన దేవతవి నువ్వు. మంజుకి, హరికి వాళ్లమ్మ గురించి సరిగా వూహ తెలియదు. వాళ్లకి కాస్త వూహ తెలిసేసరికి నువ్వే వాళ్లని ఆదరించావు. నిన్ను "పిన్ని" అని పిలిచినా వాళ్లు నీలో అమ్మని చూసుకొని బ్రతుకుతున్నారు. నా మీద కోపం వుంటే నన్ను శిక్షించు. అంతేగాని అమాయకులైన ఆ పసివాళ్లను హింసించి తల్లి ప్రేమను వాళ్లకి దూరం చెయ్యకు ... నువ్వు మీ ఊరు వెడితే పిల్లల్ని కూడా తీసుకొని వెళ్లు - ఓ నెల రోజులు వుండి వచ్చెయ్యండి."

"... ..."

"సీత! నీకు ముగ్గురు పిల్లలు అన్నావ్. జ్ఞాపకం వుందా? అందులో ఒక బిడ్డే ఇప్పుడు చచ్చి ... పొయ్యాడు కాని .... మిగతా ఇద్దరూ కూడా చ........"

సీత అసహనంగా తల విదిల్చుకుంది.

"ఆపండి. అలాంటి దురుద్దేశాలు నాకు ఎప్పుడూ లేవు."

"లేదంటే సరిపోదు సీత! జరిగిన దానికి నేను ఎంతగానో తల్లడిల్లి పోతున్నాను. క్షమించమని అడిగే అర్హత కూడా నాకు లేదు. అందుకే నువ్వే బాగా ఆలోచించుకుని ... నిర్ణయించుకో ....."

" ...... " కదులు మెదులు లేని శిల్పంలా సీత అలాగే నిల్చుంది. "వెన్న" లాంటి ఆమె మనసు "రాయి"లా మారిపోయిందా? అన్నట్లు ఆమె వదనం భావరహితంగా వుంది.

"సీత! హరి నువ్వు లేకుండా వుండలేడు. నిన్ను వెళ్ళకుండా ఆపే శక్తి నాకు లేదు. నీ ఎదురుగా నిల్చునే అర్హత కూడా నాకు లేదు. అందుకే ఆఖరిసారిగా ..... నిన్ను అభ్యర్థిస్తున్నాను. హరిబాబు కోసం అయినా నువ్వు దయచేసి వెళ్ళద్దు ........"

"... ..."

"లేదూ .... నీ నిర్ణయం మారదు అనుకుంటే .... సరే .... అలాగే నువ్వు వెళ్ళు. కాని ... నీ వెంట హరిబాబుని కూడా తీసుకు వెళ్ళు ...."

" ....... !?" దెబ్బతిన్న సర్పంలా సీత చివ్వున తల ఎత్తింది. ఆమె కళ్ళ నిండా పుత్రశోకం ....! ఏదో చెప్పాలి అన్నట్లు ఆమె పెదాలు కదిలాయి. కాని గొంతు దాటి చిన్న శబ్దం కూడా బయటికి రాలేదు.

ప్రభాకర్ పశ్చాత్తాప పడుతున్నట్లు అన్నాడు :-

"అవును సీత! నేను నిజంగానే ఈ మాట అంటున్నాను. పోయిన 'నాని'ని నేను ఎలాగూ తెచ్చివ్వ లేను. నువ్వు లేకుండా హరిని నా దగ్గర వుంచుకొని తిరిగి వాడ్ని కూడా పోగొట్టుకోలేను. ఇప్పటికే నా మూర్ఖత్వం వల్ల, అహంకారం వల్ల ఒక అనర్థం జరిగిపోయింది. హరి ఎక్కడో అక్కడ సుఖంగా వుండటమే నాకు కావాలి."

" ..........."

"వాడికి నా కంటి నువ్వు అంటేనే ఎక్కువ ఇష్టం .... అందుకే ... వాడ్ని నీ వెంట తీసుకు వెళ్ళు. నానికి బదులు నా బాబుని నీకు కానుకగా ఇస్తున్నాను.... నిజానికి వాడ్ని వదిలి నేనూ వుండలేను. అయినా నీ కోసం.... నా పాపాన్ని ప్రక్షాళనం చేసుకోవడం కోసం .... నేను నీకు వాడ్ని ఇస్తున్నాను. ఈ క్షణం నుంచి వాడికి తండ్రి లేడు. నయాపైసా ఆస్థి లేదు. నువ్వు తప్పించి వాడికి ఇంకెవ్వరూ లేరు."

"..........!?"

"వెళ్ళాలన్నదే నీ నిర్ణయం అయితే నీతో పాటు వాడ్ని తీసుకెళ్ళు. లేదూ .... నన్ను మన్నించగలిగితే .... ప్రయాణం విరమించుకో." అంటూ మొఖం చాటు చేసి గబగబా అక్కడ్నుంచి వెళ్ళిపొయ్యాడు.

బయట తోటలో రంగా దగ్గర ఆడుకుంటున్న హరిబాబుని ఎత్తుకుని తిరిగి సీత వున్న గదిలోకి వచ్చాడు.

తను మాత్రం గడప అవతల నిల్చుని బాబుని కిందకి దింపాడు.

కొడుకు బుగ్గలు ప్రేమగా పుణికి ముద్దు పెట్టుకుని చెప్పాడు.



## టార్చిలైటు ధగధగా వెలుగుతుందని తప్పకుండా చెప్పగలం.

## అయితే అది చూపబోయే అపాయాల మాట మేము మాత్రం ఎలా చెప్పగలం!

మా బ్యాటరీలను ఎంతో శ్రమ తీసుకుని తయారుచేస్తాం. అవి మీకెంతో శ్రమపడి సేవ చేయాలన్నదే మా ధ్యేయం.

నొవీనో విషయంలో నాణ్యత అన్నది శుష్కవచనం కాదు. మరింత మన్నికైనదీ, మరింత శక్తిగలదీ, మేలైన లీక్ రెసిస్టెన్స్ గలదీ అంటూ అదే పనిగా జపం చేసే వట్టి మాటల వరస కాదు.

నొవీనో నాణ్యత ఈ బ్యాటరీని వాడినప్పుడల్లా మీకై మీరే చూడగలది.

కనుక మీరు బ్యాటరీ కొంటున్నప్పుడు సందిగ్ధంలో పడకండి. నొవీనో చేపట్టండి.




National **నొవీనో**

లఖన్‌పాల్ నేషనల్ లిమిటెడ్
బరోడా, గుజరాత్.

నేషనల్ & పానాసోనిక్ ఉత్పాదనల నిర్మాతలైన, జపాన్ దేశపు మట్సుషిట ఎలెక్ట్రిక్ వారితోటి సమిష్టి ప్రయత్నం.

# ఓహో! నొవీనో

Sista's-LNL-298/86 TEL A

## దారి చూపుము దేశ ప్రజకు

వందన మో గణనాథా! వందిత విబుధా!
సుందర ప్రణవ స్వరూపా! శుక్లాంబరధారి!
ఈదేశం నీ దేశం హితముకోరి ఒక్కసారి
ధ్యానముద్ర వీడి మేటి దారి చూపరావయ్యా!

ఒక కన్నింకొక కంటిని ఉరిమి హెచ్చరిస్తుంటే
కుడి చేతిని ఎడమ చెయి కోరి లంచ మిమ్మంటే
ఒక కాలింకొక కాలును ఒడిసి పట్టి తన్నుతుంటె
మనసుకేవి సుఖ శాంతులు మనిషికి మాయని కాంతులు?

కరుణా సహనము సేవ కారకులు కాగా
మానవతా తరువు రూపు మాసి యున్నదీనాడు
మత విద్వేషము మౌఢ్యం మరిలా విస్తరిల్లె
కర్తవ్యము బోధింపుము గజాననా! దేశప్రజకు.

ప్రాణావన దీక్షితులై ప్రజను కాచు వైద్యులే
పేషంట్లను కోరి కోరి ప్రేతపురికి పంపేరే
ఎంతటి హృదయ విదారక మెంతటి హింస
ఇంత ఎడప బుద్ధులతో ఎటుపోతోంది జాతి?

జనగణాళి మనసులలో అణగారని ద్వేష ధూళి
సమసిపోవ చల్లుమయ్యా సతము శాంతి శీకరాళి
ఏనుగు తొండము దేవర! హృదయాంజలు లివిగో
ధ్యానముద్ర వీడి మేటి దారి చూపరావయ్యా!

–సూర్యదేవర రవికుమార్

## జీవితం చేజారింది

'బాబూ! పిన్ని పిలుస్తోంది. వెళ్ళు.' సీత హృదయం వికలం అయ్యింది. కళ్ళనిండా నీటి చుక్కలు నిండి చూపు అలుక్కుని పోతుంటే నెమ్మదిగా తల ఎత్తింది సీత.

ఎదురుగా.....

కాస్త దూరంలో హరిబాబు నిల్చుని వున్నాడు. వాడికి ఇప్పుడిప్పుడే నడక వస్తుంది. తూలి పడిపోతాడేమో ... అన్నట్లు నిలుచుని వున్నాడు

వాడు పడకుండా ఆసరా కావాలి. ఇంతకు ముందు సీత కనిపిస్తే "పిన్ని .... పిన్ని .." అంటు గునగునా నడిచి ఆమె ఒడిలో చేరేవాడు.

కాని ఇప్పుడు శోకతప్తలా వున్న సీతని చూస్తు బెదిరినట్లు దూరంగా అలాగే నిల్చున్నాడు.

"పోయిన నానీని ఎలాగూ తిరిగి ఇయ్యలేను. అందుకే బాబుని నీకు కానుకగా ఇస్తున్నాను.. . ఈ క్షణం నుంచి వాడికి తండ్రి లేడు. నయాపైసా ఆస్థి లేదు. తల్లి, తండ్రి అన్ని నువ్వే...."

"నా .... నీ!"

సీత గుండెల్లో ఒక ఉద్వేగపు అల. మాతృ మమకారపు వెల్లువ.

మరుక్షణం సుడిగాలి చుట్టినట్లు సీత రెండు చేతులూ బాబుని చుట్టుకున్నాయి. సీత ఒడిలో గువ్వలా ఒదిగి పోయాడు బాబు.....

"నానీ.. .. నాబంగారు కొండా.... మూడు రోజుల్నుంచి ఎక్కడికి వెళ్ళావురా? ఈ అమ్మని ఒదిలి..... నువ్వు లేకుండా నేను బ్రతకలేనురా ..... తండ్రీ......"

సీత మనసు మూగగా రోదిస్తూంది.

చెక్కిళ్ళపై అశ్రువాహిని వెల్లువలా పొంగుతుంటే బాబుని హృదయానికి హత్తుకొని వాడి ఒళ్ళంతా ముద్దుల వర్షం కురిపించింది.

తొలకరి జల్లు పడ్డ భూదేవిలా ఆ మాతృహృదయం పులకిస్తూంది.

గుమ్మం ప్రక్కగా నిల్చుని ఆ సుమధుర దృశ్యాన్ని చూస్తు నోట మాట రానట్లు అలాగే చిత్తరువులా నిల్చుండి పొయ్యాడు ప్రభాకర్.

స్త్రీ హృదయం అమృతం.

అందులో ప్రేమకే గాని ద్వేషానికి తావు లేదు.

★ ★ ★ ★

"మృత్యువు" మనిషిని మనిషి నుంచి వేరు చెయ్యవచ్చు.

కాని మమతల్ని, అనుభూతుల్ని వేరు చెయ్యలేదు.

మాతృత్వపు వెల్లువని అణచి వెయ్యలేదు!

అప్పుడే పుట్టిన "లేగదూడ" చచ్చిపోతే ఆవు బెంగ పడుతుంది.

దూరంగా నిలబెట్టిన గడ్డి దూడెని చూసి తృప్తి పడుతుంది.

"మృత్యువు" అనే వాడి గాయాన్ని సృష్టించిన భగవంతుడే "మరుపు" అనే మహాసంజీవిని కూడా ప్రసాదించాడు.

గొడ్డు అయినా – స్త్రీ అయినా ప్రేమ ప్రేమే!

మాతృత్వం మాతృత్వమే. మగవాడు ఈ సత్యాన్ని తెలుసుకోవాలి.

"పలుపు తాడు మెడకేస్తే పాడి ఆవురా
పసుపు తాడు ముడులేస్తే ఆడదాయెరా
బొడ్డు పేగు తెగివడ్డ రోజు తలుచుకో
గొడ్డు కాదు ఆడదనే గుణం తెలుసుకో...."

అన్న కవి ఎవరో గాని.... పచ్చి నిజాన్ని ఎంత హృద్యంగా చెప్పాడు?

అనాదిగా స్త్రీ అణిగి మణిగి వుండటానికి, ఆమె అశ్రుఘోషకి అంతం లేక పోవటానికి కారణం .... ఈ మాతృ మమకారమే!

ఆ మమకారం అనే జైలులో ఆమె ఖైదీ! సెంట్రీ మగవాడు!

కాని– ఆ జైలు మగవాడు చెయ్యలేదు.

"పిరికి తనం" అనే గోడలతో, "మంచి" అనే కటకటాలు అడ్డం వేసి, "త్యాగం" అనే తాళం కప్ప బిగించుకుని స్త్రీ ఆ జైలు సృష్టించుకుంది.

మాతృత్వం, ప్రేమ అనే సంకెళ్ళు వేసుకుని అందులో తనకి తనే "బంది" అయ్యింది.

ఆ జైలు నుంచి బయట పడాలని, ఆ శృంఖలాలను త్రెంచుకోవాలని ఆమె ఎన్నడూ ప్రయత్నించలేదు

"సెంట్రీ" దౌష్ట్యం, అరాచకం ఎక్కువైతే ఆమె ఆ ప్రయత్నం చేస్తుందేమో.....

కాని ఆమె అందుకు ప్రయత్నించిన నాడు సృష్టి చిత్రం మారి పోతుంది.

–"అలుగుటయే ఎరుంగని
మహా మహితాత్ముడు
అజాత శత్రువే
అలిగిననాడు
సాగరము లన్నియు
ఏకము కాక పోవునే?"– అన్నట్లు..... స్త్రీ ఆ సంకెళ్ళు ఛేదించుకున్న రోజు "ప్రేమ' అన్న పదానికి ఈ సృష్టిలో అర్థం వుండదు.

అశ్లీలంతో, అరాచకంతో మానవత్వం మంట కలిసి పోతుంది.

అందుకే స్త్రీ ఆ బంధనాలను చేదించుకో లేక పోతూంది. క్షమయా ధరిత్రిః.

అంత వరకు ఆమె కంటి నుండి రాలిన ప్రతి అశ్రుకణం సృష్టికి శ్రీరామ రక్ష!

మరి......

"స్త్రీ" అంటే .... . శక్తి స్వరూపిణి కదా?

(అయిపోయింది)

# గూడు

కంచుమర్తి వెంకటేశ్వరరావు



"తాతయ్యా. మన ఇంట్లో ఎచ్చుకలు గూడు పెడుతున్నాయ్"

ఆఫీసు నుండి అప్పుడే వచ్చిన పరంధామయ్య గారిని ఇంట్లోకి రానీయ కుండానే కాళ్ళను చుట్టేసి సంబరంగా చెప్పాడు ఐదేళ్ళ మనవడు రాజు మనవడిని ఎత్తుకుని లోపలకు వచ్చారు

వరండా గదిలో ట్యూబులైటు పోయి నెలయింది. 'ట్యూబు కొందామని అనుకోవడం, మరచి పోవడం . .. నాల్రోజుల క్రితం పరంధామయ్య గారు రాజుతో కబుర్లు చెబుతూ చూసారు. మగ, ఆడ పిచ్చుకలు రెండూ గదిలో అటూ యిటూ ఎగరడం. చూస్తుండగానే అవి రివ్వున బయటకు వెళ్ళి నోట రెండేసి గడ్డి పరకలు తసుకుని లోపలకు వచ్చాయి ట్యూబు, ఫ్రేముకు మధ్య ఉన్న స్థలం తమ గూడుకు అనువైన స్థలమని అనుకున్నాయేమో వాటిని తీసుకొచ్చి అక్కడ ఉంచాయి.

ఇవి ఇక్కడ గూడు పెట్టేలా ఉన్నాయి .. చెత్తంతా పడేస్తాయి." అనుకుని ఎచ్చుకలు బయటకు వెళ్ళగానే ఆ గడ్డి పరకలను తసేసారు పరంధామయ్యగారు అతనలా వెళ్ళడం తరువాయి పిచ్చుకలు మళ్ళీ పెట్టేవి

రెండ్రోజుల వరకూ వాటిని అక్కడ గూడు పెట్టకుండా చేయాలని ప్రయత్నించారు . అయితే వాటి పట్టుదల ముందు అతను ఓడిపోయారు.

"ఆ ట్యూబు తసెయ్యండి . మరిక గూడు పెట్టవు."

పరంధామయ్య గారి భార్య అనసూయ సలహా ఇచ్చింది.

"అనసూయా..... ఇక్కడే గూడు కట్టాలని అవి ఎంత పట్టుదలతో ఉన్నాయో చూస్తున్నావు కదా' వాటిని నిరుత్సాహ పరచడం నాకిష్టం లేదు. గుడ్లు పెట్టి, అవి పిల్లలయింతర్వాత వాటికి రెక్కలు వస్తే ఇక్కడ ఉండవు ... మహా అయితే రెండు మూడు నెలలు.. ." అన్నారు నవ్వుతూ .

రాజు కయితే సంబరం. .

గూడు వంకే చూస్తుండే వాడు.....

తాతయ్య ఇంటికి రాగానే ఆ గూడు గురించే కబుర్లు.

* * *

"నీ నిర్ణయంలో మార్పు రాదా"

పరంధామయ్య గారు కొడుకు కృష్ణారావును సూటిగా అడిగారు. కృష్ణారావు ఒక్కడే కొడుకు తర్వాత ఎల్లలు పుట్టక పోవడంతో ఆ దంపతులకు కృష్ణారావంటే చిన్నప్పటి నుండి ముద్దు ఎమ్మే వరకు చదివించారు . చదువయిపోగానే ఉద్యోగం .... పరంధామయ్య గారికి అంతకంటే ఆనందం ఇంకేముంది కొడుకు ఏ పని చేసినా అతను అభ్యంతరం చెప్పరు ..

కట్నం ఆశించకుండా కొడుకు ప్రేమించిన అమ్మాయి సీతను కోడలుగా తెచ్చుకున్నారు....

ఆ మధ్య కృష్ణారావు తక్కువ ధరకే వస్తుందని ప్లాటు కొన్నాడు. ఇల్లు కట్టే ప్రయత్నాలు చురుగ్గా చేస్తున్నాడు

# చవితి దేవునికి హారతి

అయ్యా వినాయకస్వామి
అక్షయలో అక్షింతలు వేసిపో
గణపతీ నీ అభినయం దర్శయామి
ఇక్కడ నీ పేరుతో మా పాలకులు
అభినయాలు, వేషాలు వేస్తున్నారు
నీకు ఈ ఏడు కేవలం
గరిక పత్రి సమర్పయామి
అందామంటే దాన్ని కూడా
మేస్తున్నారు పుష్టి, తుష్టి.

నీ వాహనం అనిందు్యడు
దాని సంతానం కుటుంబ
సంక్షేమం పాటించక
పంటలను, మా ఇంటి
వంటలను, నీ దండకం
పుస్తకాలను నైవేద్యం
పడుతున్నాయి
మూషిక నిర్మూలనకు
కొన్ని కోట్లు తగల పెడుతున్నారు.
నీకు తొమ్మిది రాత్రులు పూజలు
చవితినాడు చతుష్షష్ట్యుపచార పూజలు
జరిపిస్తాం అతివృష్టి, అనావృష్టి
చీడ పీడల నుండి రక్షించు
నీకైతే ఏం ఛత్రపతివి
సిద్ధి, బుద్ధులపతివి
నీ కోసం మా పాలకులు
బహువిధ వేషాలు వేస్తున్నారు
టర్బన్లు, టోపీలు ధరిస్తున్నారు.
మా కో శమంతకమణి
పారేయ మంటున్నారు
స్వార్థపరులు, దురాశా
మూషికశ్రేష్ఠులు వాటి
పరమమిత్రులు
నీవు వస్తున్నావంటే భయపడుతున్నారు
ఏకదంతుడవైనా వక్రతుండముతో ద
వారిని దండించి, భూలోకమున
పౌరులందరికి సుఖము పండించి
దీవించుమయ్యా మదఘూర్ణితలోచన

– ఎం. ఎస్. ఎం.

# గూడు

రాజు ఒకటే కేరింతలు.

"తాతయ్యా.... తల్లి నోటితో అన్నం తీసు కెళుతుంది".

మగ, ఆడ పిచ్చుకలు రెండూ పిల్లలకు కావలసిన ఆహారాన్ని సేకరించి గూడులోకి తీసుకెళ్ళడం, మళ్ళీ అవి బయటకు రావడం.... అన్నీ గమనిస్తున్నాడు రాజు.

"తాతయ్యా.... అవి బయటకు రావా".

"రెక్కలు వచ్చే వరకూ పిల్లలకు కావాలసిన ఆహారమంతా తల్లి పిచ్చుక– తండ్రి పిచ్చుకలే తీసుకొస్తాయి. రెక్కలొచ్చేక తమ ఆహారాన్ని తమే సంపాదించుకుంటాయి".

తాతయ్య చెప్పేది వేదాంతం రాజుకు...
శ్రద్ధగా వింటాడు ...

* * *

రోజులు గడుస్తున్నాయి.

పరంధామయ్య గారు ఇంకో రెండు రోజుల్లో రిటైరవుతారు. రిటైరయిం తర్వాత ఇంట్లో భార్య, కొడుకు, కోడలు, మనవడు మధ్య హాయిగా విశ్రాంతి తీసుకునే రోజులను ఊహించుకుంటూ ఇంటికి వచ్చారు....

వరండాలో అనసూయ దిగులుగా కూర్చుంది.

"ఏమిటోయ్.... ఈ వేళ డల్‌గా ఉన్నావు" అన్నారు క్రిందనే ఆమె ప్రక్కన కూర్చుంటూ.

"ఎల్లుండి మన కృష్ణ కొత్త ఇంట్లో గృహ ప్రవేశం ... అందరికి చెప్పడానికి సీతను, రాజును తీసు కెళ్ళాడు."

"ఆ విషయం ముందే చెప్పాడు.... అద్దెకు ఇమ్మని చాలా మంది అడిగారట."

పరంధామయ్య గారు చాలా మామూలుగా అన్నారా మాట.

"అది కాదండీ.... మీరు ఆఫీసు కెళ్ళిం తర్వాత సీత అబ్బాయితో అన్న మాటలు విన్నాను...."

అనసూయ గొంతు తడబడుతుంది.

వింతగా చూసారు భార్యను.

"అనసూయా.... నువ్వు దేనికో బాధ పడు తున్నావు...."

పరంధామయ్య గారిలో కంగారు మొదలయింది.

"కొత్త ఇల్లు కట్టుకున్నాం.... గృహ ప్రవేశం అయింతర్వాత ఆ ఇంట్లోనే మనం ఉండి పోదాం.... అని సీత అంది" అన్చెప్పి భోరున ఏడ్చేసింది అనసూయ.

పరంధామయ్య గారు కొయ్యబారి పోయారు.

చాలా సేపటి వరకు తేరుకోలేక పోయారు.

కోడలు నోటంట ఆ మాట విన్నప్పటి నుండి భార్య

"కృష్ణా...... నువ్వు మాకు ఒక్కడివే..... మూడు నెలల్లో నేనెలాగూ రిటైరవుతాను. రేపో మాపో రాలిపోయే వయసు మాది..... లంకంత ఇల్లుండగా మళ్ళీ ఎందుకు ఇంకొకటి".

పరంధామయ్య గారికేమాత్రం ఇష్టం లేదు కొడుకు ఇల్లు కట్టించడం.... ఎన్నో సార్లు నచ్చ చెప్పారు.

"నాన్న గారూ.... ఇంకో సంవత్సరంలో అది మంచి సెంటరవుతుంది..... అద్దెకు ఇచ్చుకోవచ్చు కదా".

కృష్ణారావు అలా అనగానే ఏదో ఊహించుకున్న పరంధామయ్య గారు నిట్టూర్చారు తేలిగ్గా.

కొడుకు, కోడలు ఇంటి పనులు దగ్గరుండి చేయిస్తున్నారు.

"అనసూయా.... మన అబ్బాయి అప్పుడే ఇల్లు కట్టించేస్తున్నాడు.... తెలివి తేటలంటే అలా ఉండాలి. లోను, కొంత అప్పు, కోడలు బంగారం... డబ్బును చాలా తెలివిగా ఖర్చు పెడుతున్నాడు...."

భర్త మాటలకు, కొడుకు చేస్తున్న పనికి సంతోషించింది అనసూయ.

* * *

"తాతయ్యా..... గుడ్లు పిల్లలయ్యాయి.... కిచకిచ మంటున్నాయి."

ఎంత బాధ పడుతుందో సులభంగా గ్రహించారు.

సీత ఇంట్లోకి అడుగు పెట్టిన రోజున ఆడపిల్లలు లేరనే చింత తీరిపోయింది అనసూయకు సీత ప్రతి పనిలో తోడుగ ఉండేది.

అత్తయ్యా అత్తయ్యా అని ప్రతి నిముషం పిలుస్తుంటె అనసూయ పొంగి పోయేది ..

మనవడు పుట్టడం

ఇల్లంతా కళ..

అటువంటిది ఈ రోజు సీత ఆ నిర్ణయం తీసుకుందని తెలిసిన క్షణం అనసూయ మనసు మనసులో లేదు .

పరంధామయ్యా గారు అనసూయను చిన్న పిల్లలా దగ్గరగా తీసుకున్నారే తప్ప ఇంకేం మాట్లాడలేక పోయారు

అలా ఆ ఇద్దరూ ఎంతసేపు ఉండి పోయారో తెలియదు. "అత్తయ్యా.. చీకట్లో కూర్చున్నారేం ... లైటు వేయండి' సీత పిలుపుకు ఉలిక్కి పడ్డారు...

తాతయ్యా. అంటూ దగ్గరకు వచ్చిన రాజును ఎత్తుకుని లోపలకు నడిచారు పరంధామయ్యా గారు

ఎవరి ఆలోచనల్లో వాళ్ళున్నారు

ఎలాగో భోజనం అయిందనిపించి వరండాలో కూర్చున్నారు పరంధామయ్యా గారు .. కృష్ణారావు నెమ్మదిగా అక్కడకు వచ్చాడు.

"కృష్ణా! నీ నిర్ణయంలో మార్పు రాదా?" అనునయంగా అడిగారు

"నాన్నగారూ సొంతంగా ఇల్లు కట్టుకున్నాం... కొత్త ఇంట్లో ఉండాలని ఆశ పడుతుంది సీత అందుకని.. ఆపై మరి మాట్లాడ లేదు కృష్ణారావు

పరంధామయ్యా గారు కొడుకు కళ్ళల్లోకి చూసారు....

'కృష్ణా! నిన్ను శాసించగల ధైర్యం లేదు. . ఈ ఇల్లు, డబ్బు అంతా నీ కోసం సంపాదించాను రిటైరయిన క్షణం మీ అందరి మధ్య రోజులను సంతోషంగా వెళ్ళబుచ్చాలని ఆశతో బ్రతుకు తున్నాను.. మా కలలను కల్లలుగా మిగిల్చి, కన్నీటిలో వదేసి వెళ్ళి పోవాలని నిర్ణయించుకోవడంలో మేమేం పాపం చేసాం '

పరంధామయ్యా గారి కళ్ళు తడయ్యాయి.

ఎప్పుడొచ్చిందో అనసూయ కొడుకు చేతులు పట్టుకుని ఏడ్చేసింది...

"కృష్ణా! నువ్విక్కడే ఉండరా! ఆ ఇల్లు అద్దెకు ఇచ్చేయ్!"

"అత్తయ్యా... మిమ్మల్ని విడిచి ఏదో పై ఊరు వెళ్ళిపోతున్నట్లు బాధపడతారేం ఆ ఇంటికి ఈ ఇంటికి మహా అయితే ఆరు మైళ్ళు దూరం ... రోజూ వస్తాం కదా" అంది సీత .

సొంతంగా కట్టుకున్న ఇల్లు.

కొత్త ఇల్లు....

కొత్త ఇంటిలో తను గడపబోయే కొత్త సంసారం గురించి కొత్త ఊహలతో, సరికొత్త కలల మత్తులో ఉంది సీత . .

ఆ సమయంలో సీతకు అత్తా, మామయ్యల గుండెల్లో రేగుతున్న బాధ ఏమిటో తెలియడం లేదు. .

"మీరు భోంచేసి పని మీద వెళతా నన్నారు . . ముందు వెళ్ళండి" అంది సీత భర్తతో .

బొమ్మలయ్యారు వృద్ధ దంపతులు.

* * * *

పరంధామయ్యా గారు ఆ రోజు రిటైరయ్యారు.

ఆఫీసు ఘనంగా వీడ్కోలు చెప్పింది

తడబడే అడుగులతో ఇంటికి వచ్చారు

ఆ రోజు ఉదయమే కొడుకు కొత్త ఇంట్లోకి గృహ ప్రవేశం చేసాడు. ..

సాయంత్రం సీత మిగిలిన సామానంతా సర్ది ఆటోలో ఎక్కించింది.

తాతయ్యా అని రాజు పరంధామయ్యా గారిని చుట్టేసాడు

ఆ పసి మనసుకు ఏం తెలుసు తాతయ్యా హృదయ ఘోష

రాజు పిచ్చుకల గూడు చూసాడు . .

"తాతయ్యా .. అక్కడ తల్లి పిచ్చుక, తండ్రి పిచ్చుకే ఉన్నాయి పిల్ల లేవి?" అని అమాయకంగా అడిగాడు

పరంధామయ్యా గారు మనవడిని గుండెలకు హత్తుకున్నారు ..

'పిల్లలేవి తాతయ్యా ' రాజు మళ్ళీ అడిగాడు

"పిల్లలకు రెక్కలు వచ్చాయి బాబూ ఎగిరి పోయాయి" ఇంకేం చెప్పగలరు

"మరి వాటికి గూడు ఎక్కడుంది .. ఇదే కదా"

'ఈ గూడుతో ఇంకేం అవసరం ... రెక్కలు వచ్చాయి. తమ గూడు తమే కట్టు కుంటాయి. రెక్కలు రానంత వరకే అమ్మా, నాన్న కట్టిన గూడులో ఉంటాయి . ఇప్పుడు పెద్ద వయ్యాయి కొత్త గూడులోకి వెళ్ళి పోతాయి "

అలా చెబుతున్నప్పుడు తాతయ్యా పండినగుండె ఎంతగా నలిగి పోతుందో ఆ చిరు గుండె కెలా తెలుస్తుంది

"అత్తయ్యా ... మళ్ళీ రేపు వస్తాం.... రా రాజూ" సీత కొడుకు చేతులు పట్టుకుంది.

"తాతయ్యా.. డాడీ కొత్త ఇల్లు బాగుంది.. రేపటి నుండి అక్కడే ఉంటామని చెప్పింది మమ్మీ.... కొత్త ఇల్లుకు నీవు, నాన్నమ్మ ఎప్పుడొస్తారు "

"ఈ ముసలి అమ్మా, నాన్నకు పాత ఇల్లు చాలు బాబూ" మరి మాటలు నోట్లోంచి పెగల్లేదు పరంధామయ్యా గారికి.

కొడుకు, కోడలు, మనవడు అక్కణ్ణించి కదిలారు.

అలాగే కూర్చుండి పోయారు పరంధామయ్యా గారు, అనసూయ.

రెక్కలొచ్చి వెళ్ళిన పిల్లలను తలచుకుంటూ గూడు దగ్గరే బిక్కు బిక్కు మంటున్న పిచ్చుకలు రెండూ తమ కేసి చూస్తున్నట్లు చూస్తున్నాయి.

భాష కందని ఏ భావమో తమ బాధను వాటికి అందజేసిందేమో తమనే చూస్తున్నట్లనిపించింది పరంధామయ్యా గారికి.

ఆ గూడు చిన్న బోయింది.

ఈ గుండె ఖాళీ అయింది.

## వంటింటి



### కొబ్బరి ఉండ్రాళ్ళు

కావలసినవి – మూడు చిప్పల పచ్చికొబ్బరి, పావు కేజి బెల్లం, ఒక శేరు విసరిన బియ్యపు పిండి, ఐదు యాలకులు, కొద్దిగా ఉప్పు.

చేసే పద్ధతి – ముందుగా కొబ్బరిని తురుముకుని ఉంచాలి బెల్లం తరిగి తురిమిన కొబ్బరిలో వేసి ముద్దగా దంచుకోవాలి. యాలకులు పొడి చేసి దంచిన ముద్దలో కలిపి ఓ ప్రక్కగా పెట్టుకోవాలి కొంచెం సటిని వేడి చేసి విసరిన బియ్యపు పిండిలో పోసి తగినంత ఉప్పు వేసి గట్టిగా కలుపుకోవాలి

ఇప్పుడు కొబ్బరి బెల్లంతో చేసిన ముద్దను చిన్న చిన్న ఉండలుగానూ, బియ్యపు పిండితో కలిపిన ముద్దను పెద్ద పెద్ద ఉండలుగానూ చేసుకోవాలి బియ్యపు పిండ ఉండను అరచేతిలో వెడలాగా తట్టి, కొబ్బరి బెల్లంతో కలిపిన ఉండను దానిపై ఉంచి అది కనపడకుండా బియ్యపు పిండిని కప్పేస్తూ ఉండ చేయాలి. ఈ విధంగా అన్నీ చేసుకుని ఆవిరిపై ఉడకించి దించుకోవాలి ఈ ఉండ్రాళ్ళను దేవుడికి నైవేద్యంగా పెట్టవచ్చు. టిఫిన్‌గా కూడా చేసుకోవచ్చు.

— మంతెన విజయలక్ష్మి

### అంకితం

"నేను కథ వ్రాసినా, నవల వ్రాస్తున్నా చక్కని విమర్శలతో, సూచనలతో నన్ను ప్రోత్స హిస్తున్న మిత్రుడు, నా కొలీగ్ అయిన శ్రీ కె కోటీశ్వరరావుకు చిరుకానుకగా"

– రచయిత

## వ్యక్తిగతం

భారత మాజీ ప్రధాన సైనికాధికారి జనరల్ అరుణ్ వైద్య దౌర్జన్య వాదుల తుపాకి గుళ్ళకి బలై పోయారు మహారాష్ట్రలోని పూణె నగరంలో ఆయన తమ సతిమణితో పాటు కారులో వెళుతూ ఉండగా ఆగస్టు 10వ తేదీ పగలు 11-50 ప్రాంతంలో స్కూటరు, మోటారుసైకలుపై వచ్చిన నలుగురు ఆయనపై హఠాత్తుగా దాడ చేస కాల్పులు జరిపారు తీవ్రంగా గాయపడిన ఆయన ఆ తర్వాత సైనిక ఆసుపత్రిలో కన్ను మూసారు జనరల్ వైద్య సైనికదళాల ప్రధానాధికారి పదవిని మూడేళ్లపాటు సమర్థవంతంగా నిర్వహించి గత జనవరిలో పదవీ విరమణ చేసారు బంగారు గుడిలోని దౌర్జన్యవాదులని ఏరివేయటానికి నీలం నక్షత్రం' దాడిని సైన్యం జరిపినప్పుడు జనరల్ వైద్య ప్రధానాధికారిగా ఉన్నారు ఆ కారణంగా ఆయనని హత్య చెయ్యాలని ఖలిస్తాన్ దౌర్జన్యవాదులు నిర్ణయించు కున్నారు ఈ హత్యకి ముందు ఆయనకి ఎన్నో బెదిరింపు లేఖలు కూడా అందాయి ఆయన భద్రతకి గట్టి ఏర్పాట్లు కూడా జరిగాయి అయినా తీవ్రవాదులు ఆయనని దారుణంగా హత్య చేసారు. ఇది దేశంలో నానాటికి ఎక్కువ అవుతున్న దుష్పరిణామాలకి మరో నిదర్శనం జనరల్ వైద్య దేశంలో అత్యున్నత అవార్డులలో రెండవది అయిన మహావీర చక్ర'ని రెండుసార్లు అందుకున్నారు ఆయనకి విశిష్ట సేవా పతకం కూడా లభించింది ఆయనకి భార్య, ఇద్దరు కుమార్తెలు ఉన్నారు. . □



గుంటూరు కేంద్రియ విద్యాలయం 7వ తరగతి విద్యార్థిని చి పి. కళ్యాణికి దక్షిణ కొరియా 28వ ప్రపంచ పాఠశాల విద్యార్థుల కళా ప్రదర్శన సియోల్ కోస్పాన్సర్‌షిప్ ఆధ్వర్యంలో సియోల్ ఆశియా క్రీడోత్సవాల నిర్వాహక సంఘం ఏర్పాటు చేసిన ప్రపంచ బాలల చిత్రకళా పోటీలో గ్రాండ్ ప్రైజ్" లభించింది చి కళ్యాణితో పాటు ఆమెకి చెందిన పెద్దవారిని మరొకరిని సియోల్‌లో పది రోజుల పర్యటనకి దక్షిణ కొరియా ప్రభుత్వం ఆహ్వానిస్తుంది అన్ని కర్చులనీ ఆ ప్రభుత్వమే భరిస్తుంది సియోల్ పర్యటనలో ఈమె ఆశియా క్రీడోత్సవాల సందర్శన, చిత్రకళా ప్రదర్శన మేళా, బహుమతి ప్రదానోత్సవ కార్యక్రమాలలో పాల్గొని తనకి వచ్చిన గ్రాండ్ ప్రైజ్'ని తానే స్వయంగా స్వీకరిస్తుంది భారతదేశానికిఈ పోటీలో మొత్తం 196 బహుమతులు లభించాయి అందులో ఒక్క గుంటూరు కేంద్రియ విద్యాలయానికే 40 బహుమతులు లభించాయి ప్రపంచం అంతటినుంచి ఈ పోటీలో పాల్గొన్న దేశాలలో ఆరింటికి మాత్రమే ఈ 'గ్రాండ్ ప్రైజ్ దక్కింది అందులో భారతదేశానికి వచ్చిన గ్రాండ్ ప్రైజ్" చి కళ్యాణికి లభించింది... □

# వారఫలం

### 5-9-1986 శుక్రవారం మొదలు 11-9-1986 గురువారం వరకు

★ **మేషం :**— వ్యాపార సంబంధంగా మీరు గావించే మార్పులు, చేర్పులు, కూర్పులు అనుకూలమే. ఉత్తమ ఫల ప్రదాయకవారం నూతనంగా మీరు ఆలోచించిన వ్యవహారం అమలు చేస్తారు. వృత్తియందు వికాసమున్నది. స్త్రీలకు:— వస్తుసేకరణ, వారమంతా హడావుడి.

★ **వృషభం:**— కార్యమందు మీ శ్రద్ధాసక్తులు సత్ఫలాన్ని ప్రసాదిస్తాయి. మంచి విజయవంతమైన వారం. చాల కాలంగా చేతికందని ద్రవ్యం అందుతుంది. రాజకీయంగా పెద్దగా ప్రోత్సాహకరంగాదు. సన్నిహితులతో తగాదాలు రాకుండా చూచుకొండి బాధ్యత నెరవేర్చుటలో వెనుకంజ వేయరాదు. స్త్రీలకు:— అధికారమందు, ఆరోగ్యమందు వృద్ధిగల వారం.

★ **మిధునం:**— రాజకీయంగా ఏ విధంగా మేలుగాదు. ఎట్టి ప్రయత్నాలకు దిగకుండుట శ్రేయస్కరం. డబ్బు సమయానికి అందక పోవటం గమనించదగిన అంశం. ఇచ్చుకోవలసిన మొత్తాన్ని గూర్చి కొంత వత్తిడి ఏర్పడవచ్చు. స్త్రీలకు:— కొందరకు ఉద్యోగావకాశాలు, కొందరకు శుభ కార్యయత్నాలు.

★ **కర్కాటకం:**— రాజకీయ వాదులకు అనుకూలంగాదు. మాట పాటింపక ముందుకు పోతే యిబ్బందులకు గురికాగలరు. సంఘ సేవలో కాలయాపన చేయటం కూడ ఏమంత శ్రేయస్కరంగాదు. వ్యాపారరీత్యా కూడా యిబ్బందికరమైన వారం. కృషి చేసినా రాణింపునకు రాలేదని కూడ గ్రహిస్తారు. స్త్రీలకు.— విలువగల వస్తులో, నగలో సేకరించుకొనుటకు కొందరకు, ఉద్యోగరీత్యా ప్రగతి కొందరకు.

★ **సింహం:**— బంధువులతో శుభ విషయ ప్రస్తావనలు. వ్యాపార సంబంధంగా మిత్ర సంభాషణకు అనుకూలం. ఉద్యోగరీత్యా ఎంతో కాలంగా అందని 'ప్రమోషన్' కొందరకు లభ్యం, ప్రయాణాలు సాగించుట శ్రేయస్కరమే. స్త్రీలకు:— విందు వినోదాలతో కాలక్షేపం. మిత్ర సమాగమం. ఆరోగ్యాభివృద్ధి.

★ **కన్య:**— నూతన మిత్రులు చేరుతారు. వారమంతా మీకు విజయవంతమే. వృత్తియందు కొంత అభివృద్ధి కనిపిస్తుంది. కళాకారులకు సదవకాశాలు లభ్యం. ఉద్యోగరీత్యా కొందరకు స్థాన చలనం సూచితం. స్త్రీలకు:— బంధు మిత్రులను కలిసికొనుట, ఆదాయమందు స్వల్పంగా అభివృద్ధి చెప్పదగిన వారం, గ్రహించండి.

★ **తుల:**— రాజకీయంగా మీరు శ్రమించి ప్రయోజనంలేదు. సంఘ పరంగా, ప్రభుత్వ పరంగా యింకా మీ స్థితి మెరుగుపడలేదు. కాదు కూడదని కృషిచేసినా వ్యర్థమే, స్వల్పాదాయం కొందరకు, ప్రయాణ మూలకంగా ధనలబ్ధి కొందరకు. స్త్రీలకు:— ఉద్యోగం, లేక వృత్తియందు కొంత మెరుగున్నది.

★ **వృశ్చికం:**— వారాంతం ఒకటి రెండు రోజులు తప్ప అనుకూలంగాదు. ఆదాయమందు లోపం. చిత్రరంగ నిర్మాతలకు అనుకూలంగాదు. శ్రమకు తగిన ఫలితంలేదు. కళా ప్రియులకు, సాహితీ వేత్తలకు, పత్రికా రంగాన కృషి చేసే వారికి ఉత్సాహజనకమైన వారంగాదు. స్త్రీలకు:— ఉద్యోగంలో మెలకువ, అణకువ వలసిన వారం.

★ **ధనుస్సు:**— ఇటీవల సగం వరకు లాగి, కృషి చేసి వదిలిన వ్యవహారం మరలా తిరుగతోడి సొంతం చేయాలనే మీ దీక్ష ప్రశంసనీయం, సాంగంగా నెరవేరుతుంది. కొందరు తప్పనిసరిగా ప్రయాణం చేయగలరు. స్త్రీలకు:— స్థిరాస్థియందు పెంపు. వృత్తియందు అనుకూలం, విందు వినోదాలతో కాలక్షేపం.

★ **మకరం:**— బంధు ప్రీతికి, అధికారుల ఆదరణకు, రాబడియందు వృద్ధి కనిపించుటకు, ఆరోగ్యమందు అభివృద్ధికి, వ్యాపారరీత్యా సుగుణం కనిపించుటకు ఈ వారం అనుకూలం. ధనాదాయ మున్నది. ఏమో చెప్పారనుకోవద్దు, కొంత మీ ప్రయత్నం కూడా ఉండాలి. స్త్రీలకు:— ఉద్యోగమందు అభివృద్ధి, ధనలబ్ధి.

★ **కుంభం:**— మీ ఆలోచనలు నెర వేరుటకు యింకా కొంత కాలం పట్టవచ్చు. గృహనిర్మాణ కార్యక్రమం విధిగా వాయిదా వేయవలసి రావచ్చు. అధిక శ్రమతో ఒకానొక విషయాన ముందుకు పోగలుగుతారు. ఆదాయం సున్న, వ్యయం మిన్న. స్త్రీలకు:— ఉద్యోగరీత్యా చేసిన యత్నాలు ఫలవంతంగావు, అయినా ఊరుకోకండి.

★ **మీనం:**— పుణ్య కార్యాచరణమునకు అవకాశం గలవారం. అధికారం వృద్ధిఅయ్యే మార్గమున్నది. వస్తుసేకరణకు అవకాశమున్నది. దూర బంధువులు యింటికి రానున్నారు. అప్పులు అతిశ్రమమీద వసూలు కాగలవు. స్త్రీలకు:— శుభ కార్య ప్రస్తావనలు. వృత్తియందు పెంపు చెప్పదగిన వారం.

—విద్వాన్ కోట సత్యారంగయ్యశాస్త్రి




అల్లంత దూరం నుంచి తన ఇంటివైపు చూసి తృళ్ళిపడ్డాడు సోమరాజు. ఒక్క సారిగా అతడి గుండె కొట్టుకునే వేగం హెచ్చింది. అడుగులు తడబడ్డాయి. ఆందోళన అతడి అణువణువునూ ఆక్రమించుకొంది... మరో సారి కళ్ళు చించుకొని ఇంటి వైపు చూసి చుక్కమ్మ అన్నంతపనీ చేసినట్టుంది అనుకున్నాడు. ఆవిడలా చేసినా ఆ తప్పు తనదే గాని ఆవిడది కాదని కూడా అనుకున్నాడు.

చుక్కమ్మ ఇంట్లో దాదాపు ఆరు సంవత్సరాల నుంచి అద్దెకుంటున్నాడు సోమరాజు. ఆరు సంవత్సరాలుగా ఎన్నడూ లేనిది ఈ మధ్య అద్దె పెంచమని ఒకటే గొడవ పెడుతోంది చుక్కమ్మ.

అయితే సోమరాజు సామాన్య జీవి. చేస్తున్నది చిన్న ఉద్యోగం. ఇళ్ళ అద్దెలు, నిత్యావసర వస్తువుల ధరలు పెరుగుతున్నంత వేగంగా అతడికి జీతం పెరిగే అవకాశం లేదు. కుటుంబం చూస్తే కాస్త పెద్దది. ఆవిడ అద్దె పెంచమన్నప్పుడల్లా "చూద్దాం.... చూద్దాం...... " అంటూ రోజులు నెట్టుకొస్తున్నాడు సోమరాజు.

ఇలా చూద్దాం అంటూనే తన ఇంటి చూరుకు అతుక్కు పోయేలా వున్నాడని– నెల్లాళ్ళ క్రితం ఇల్లు ఖాళీ చేసెయ్యమని సోమరాజుకు సీరియస్‌గా వార్నింగ్ ఇచ్చింది చుక్కమ్మ.

"అంత వరకూ ఎందుకు లెండి. వచ్చే నెల నుంచి పెంచుతాను!" అన్నాడు ఇక తప్పదనుకున్న సోమరాజు.

అలా అన్నాడే గాని మొన్నెళ్ళి పోయిన ఫస్టు తారీక్కు కూడా తను ప్రతినెలా ఇస్తున్న మొత్తమే చుక్కమ్మ చేతిలో పెట్టాడతను.

ఆ డబ్బు లెఖ్ఖ చూసుకున్న వెంటనే అపర కాళికావతారం దాల్చింది చుక్కమ్మ.... "నీకు మాట నిలకడ– మంచి, మర్యాద లేనట్టుంది. నువ్వేదో చిరుద్యోగి వని జాలిపడి చౌకగా ఇల్లు అద్దెకిస్తే– ఇక వున్నంత కాలం ఆ అద్దెనే నా మొహాన కొట్టేటట్టున్నావు! ఇలాంటి వాటాకే ఆ ఎదురింటి ఎల్లమ్మ, పొరుగింటి పుల్లమ్మ ఎంత తీసుకుంటు న్నారో తెలుసా?" అని ఒక్క క్షణం ఆగింది చుక్కమ్మ.

"అది కాదు చుక్కమ్మ గారూ!..... " అంటూ ఏదో చెప్ప బోయాడు సోమరాజు.

కానీ, అతని మాటలకు మధ్యలోనే అడ్డొచ్చి, "అది కాదు– ఇది కాదూ ఏమిటయ్యా? ఇంటిపన్ను వగైరాలు పెరిగాయని ఇన్ని సంవత్సరాల తర్వాత ఓ పాతిక రూపాయలు అద్దె పెంచమంటే – పెంచుతానని కూడా దగా చేస్తావా? ఇల్లు చౌగ్గా వచ్చింది ఇదే బావుందనీ, ఆడముండ ఏం చేస్తుందనీ అనుకుంటున్నావేమో.... నువ్వు సాయంత్రం లోగా పెంచిన అద్దె బాపతు డబ్బు ఇవ్వకపోతే నా తడాఖా చూపిస్తాను..... ఏమనుకున్నావో!" అంది, తన కంచు కంఠంతో చుక్కమ్మ.

పక్కనున్న భార్య చెయ్యి గిల్లుతున్నా వూరుకోకుండా "ఏం చేస్తారేమిటి?" అన్నాడు పౌరుషం పొడుచుకొచ్చిన సోమరాజు.

"ఏం చేస్తానా. .. సామాన్లు రోడ్డు మీదికి విసిరి పారేస్తాను!!..... " అంది, పారేస్తాను అన్న పదం వత్తి పలుకుతూ చుక్కమ్మ.

"ఎలా పారేస్తారో చూద్దాం?..... అసలు నేను అద్దె పెంచను– ఇల్లూ ఖాళీ చెయ్యను!" అనేసి డ్యూటీకి బయల్దేరి పొయ్యాడు సోమరాజు

వెనుక నుంచి – "వెళ్ళవయ్యా..... నీ చేత ఇల్లు ఎలా ఖాళీ చేయించాలో నాకు తెలుసు..... " అంటున్న చుక్కమ్మ మాటలు గాల్లో తేలివచ్చి అతని చెవుల్ని తాకి కొంత కలవరపెట్టాయి.

పౌరుషం పట్టలేక అలా అన్నాడే గాని అంతమాట చుక్కమ్మ చేత అనిపించుకున్నందుకు అతడికి చాలా బాధనిపించింది..... అద్దె పెంచుదామన్న సదుద్దేశ్యం తనకున్నా జీతం అందుకొని ఎక్కడి వక్కడ సరిపెట్టే సరికి తలప్రాణం కాలికొచ్చింది. ఆ మాటే ఆవిడకు చెబుదామన్నా వినిపించుకునే స్థితిలో లేదు ... నిజానికి తన పాట్లేవో తను పడాలే గాని ఆవిడకలాంటి అవసరం లేదు. డ్యూటీలో వున్నంత సేపూ అదే బాధతో సతమత మవుతూ తను ఇవ్వగలిగే అద్దెలో ఇల్లేదైనా దొరుకుతుందేమోనని సహోద్యోగి సుందరాన్ని అడిగాడు సోమరాజు.

అతను తమ ఏరియాలో ఇళ్ళ అద్దెలు ఎలా మండి పోతున్నాయో చెప్పేసరికి సోమరాజు గుండె గుభేల్‌మంది అతను అంతటితో వూరుకోక సోమరాజు గొడవేమిటో తెలుసుకొని మాట్లాడ కుండా పాతిక రూపాయలూ పెంచి ఆ ఇంట్లోనే వుండమని సలహా కూడా ఇచ్చాడు.

ఇక తప్పదనుకున్న సోమరాజు ఆ పాతిక రూపాయలు సుందరం దగ్గరే బదులు తీసుకొని, ఆ డబ్బు ఆ రోజు చుక్కమ్మకివ్వడానికి నిశ్చయించు కొని ఇంటి కొస్తున్నాడు.... అయితే ఇంతలోనే ఇలా జరుగుతుందనీ, చుక్కమ్మ అన్నంత పనీ చేసేస్తుందనీ అతడెంత మాత్రం అనుకోలేదు.

వీధి గుమ్మం ముందు మంచాలు, అరుగు మీద వంట పాత్రలు, బిందెలు వగైరాలన్నీ కనిపిస్తున్నాయి... వాటికి కాపలా అన్నట్టుగా సోమరాజు ఆఖరి కొడుకు బయట నిలబడి దిక్కులు చూస్తున్నాడు.

చుక్కమ్మ పెంచమన్నదేదో పెంచి – ఎలాగోలా ముందే ఇచ్చి పారేస్తే ఈ గొడవ లేక పోయేదనీ, తన పరువు పోక పోయేదనీ చింతిస్తూ ఇల్లు సమీపించిన సోమరాజు "ఏమైందిరా?" అన్నాడు

# చౌకబేరం

పుత్ర రత్నాన్ని చూస్తూ ఆత్రంగా.

"మరేమో..... మరేమో....." అని ఓ మారు ముక్కు చీదుకున్నాడు అసలు విషయమేమిటో చెప్పకుండా వాడు.

"నేనేదో అడుగుతూంటే ముక్కు చీదుకుంటా వేంరా వెధవా!.... ఏం జరిగిందో సరిగ్గా చెప్పేడువ్వూ?" అన్నాడు కోపంగా సోమరాజు.

"మరేమో..... లోపల..... " అంటూనే తుంపర్లు సోమరాజు మీద పడేలా తుమ్మేడువాడు.

"వెధవకాన పక్కకి తిరిగి తుమ్ముకోవడం కూడా తెలియదట్రా, అడ్డగాడిదలా వున్నావ్! ఎప్పుడు చూసినా వెధవ జలుబూ నువ్వూను- అమృతాంజనం రాసుకోరా అంటే ముక్కు మంది పోతోంది మొర్రో అంటావ్!!.... ఏమైంది లోపల.... తి చుక్కమ్మ వుందా?" అన్నాడు, అనుమానాస్పదంగా వాణ్ణి చూస్తూ సోమరాజు.

"ఏమో, నాకేం తెలవదు. లోపలి కెళ్ళి చూడండి మీకే తెలుస్తుంది!" అనేశాడు చివరికి. ఏదీ సరిగ్గా చెప్పని చెడు అలవాటు వాడికి చిన్నప్పట్నుంచీ వున్నదే.

అసలే చికాగ్గా వున్న సోమరాజుకు ఆ సమాధానంతో ఒళ్ళు మండి – చురుక్కుమనేలా వాడికో లెంపకాయ బహూకరించి లోపలి కడుగు పెట్టాడు.

అతడి సహధర్మ చారిణి సావిత్రి ఓ చేత్తో ముక్కు మూసుకొని- మరో చేత్తో ఇంట్లో ఇంక మిగిలివున్న పెట్టెల్నీ, బుట్టల్నీ అట్నుంచిటూ ఇట్నుంచటూ జరిపి పారేస్తూ దేనికోసమో గాలించేస్తోంది.

"చిందర వందరగా, చిరాగ్గా ఏమిటిదంతా?" అన్నాడు తను భయపడింది కాకపోవటంతో కాస్త స్థిమిత పడ్డ సోమరాజు.

ఆవిడలా ముక్కు మూసుకునే "ఇంకొక్క క్షణం అలాగే వుండండి మీకే తెలుస్తుంది!" అని తిరిగి తన పనిలో లీనమై పొయ్యింది.

"మీ తల్లీ, పిల్లలందరికీ ఒకటే జబ్బులా వుంది అడిగిన దానికెప్పుడూ సవ్యంగా సమాధానం చెప్పి చావరు! చుక్కమ్మ సామాన్లు బయట పారేసిం దేమోనని హడలి పోతూ వచ్చాను నేను అసలేమైంది?" అన్నాడు తీవ్ర స్వరంతో సోమరాజు.

సావిత్రి ఓ మారు ముక్కు మీది నుంచి చెయ్యితీసి, "ఇంకా తెలియలా?..... మీ ముక్కు గాని చెడిపోయిందేమో..... " అంటూ మళ్ళీ ముక్కు మూసుకొని తన ప్రయత్నం మొదలెట్టింది.

'నా ముక్కు చెడిపోయిందా!' అనుకుంటూ శ్వాస గబగబా పీల్చిన సోమరాజుకు మరుక్షణం అర్థమైంది అసలు విషయం..... "అబ్బబ్బ..... ఎలుకేదో చచ్చిపోయి వుండాలి. ముక్కు బద్దలు కొట్టేస్తూందే..... " అన్నాడు వెంటనే ముక్కు మూసుకొని సోమరాజు

"ఇంకా అలా నిలబడ్డారేం.... వెతకండి". అంది అరచినంత పనిచేసి సావిత్రి.

భార్య మాటలకు ఉలిక్కిపడ్డ సోమరాజు తను కూడా చచ్చిపోయిన ఎలుక కోసం ఇంట్లో గాలించడం ప్రారంభించాడు.

అలా ఎంతసేపు వెతికినా ఏమి కనిపించ లేదు. ఆ వాసన ఎక్కణ్నుంచి వస్తూందో వాళ్ళ కంతు బట్టలేదు. అలుపొచ్చిన సావిత్రీ సోమరాజులు ఇంట్లో వుండలేక బయటి కొచ్చేశారు.

"అబ్బ, లోపల నిలబడ లేక పోతున్నా మెలాగ?" అన్నాడు సోమరాజు.

"మీరో పావుగంటకే ప్రాణం పోతున్నట్టు మాట్లాడు తున్నారు. మధ్యాహ్నం నుంచి మేము ఛస్తున్నాం! అదే పోతుందనుకుంటే అంత కంతకూ ఎక్కువై పోయింది. ఎక్కడ్నుంచో ఏమి అర్థం కావటంలా. ... ఇలా ఎంత సేపని వుండగలం?" అంది వికారంగా మొహం పెట్టి సావిత్రి. నిజంగా ఆవిడకి వాంతి వచ్చేటట్టుంది.

"మనింట్లో కాదేమోనోయ్.... చుక్కమ్మగారి ఇంట్లోంచి వస్తోందేమో ఈ వాసన..... ఆ మహాతల్లి ఎలుకల కేమైనా విషాహారం పెట్టిందేమో కనుక్కున్నావా?" అన్నాడు కొన్ని క్షణాల తర్వాత సోమరాజు.

"ఆఁ.... అదీ అయ్యింది.... అద్దె పెంచలేదని ఉదయం నుంచీ ఆవిడ మనమీద కారాలు మిరియాలు నూరేస్తోంది.... వెళ్ళి అడిగితే "మా ఇంట్లో పిల్లులూ, ఎలుకలూ ఏమి లేవమ్మోయ్, మందూ, మాకూ పెట్టి చంపడానికి" అని నామీద విరుచుకపడింది!" అంది సావిత్రి.

మందు పెట్టినా, పెట్టక పోయినా చుక్కమ్మ తమ మీది కోపంతో ఏ చచ్చిన ఎలుకనో సంపాదించి తెలియకుండా తమ భాగంలో ఎక్కడో పడేసి వుంటుందన్న అనుమానం వచ్చేసింది సోమరాజుకు....

అలాంటి అనుమానమేం లేకపోయినా ఏం చెయ్యాలో మాత్రం సావిత్రికి తెలియడం లేదు. వుండగా వుండగా ఆవిడకి పిచ్చెత్తి పోతోంది.... ఇంటి చూరు మొదలు ఇంట్లో అక్కడక్కడా వున్న కన్నాలతో సహా గాలించేసినా ఎక్కడా ఏమి కనపళ్ళేదు. చెంబులు, బిందెలు లాంటి వన్నీ ముందే బయట పడేసింది. నవ్వారు మంచం సందు సందు కళ్ళు చించుకొని చూసింది.... మడత మంచాల గుడ్డలూడ బెరికి మరి చూసింది. ఇంకేమున్నాయ్ వెతకడానికి?.... ఆలోచిస్తున్న సావిత్రికి దుప్పట్లు, తలగడలు చూడలేదన్న సంగతి హఠాత్తుగా గుర్తొచ్చింది.

మరుక్షణంలో లోపలి కెళ్ళి వాటిని కూడా తెచ్చి బయట పడేసింది.... వాటిలోనూ ఏమి కనిపించ లేదు. అయితే విచిత్రంగా భరించలేని వాసన ఈసారి బయట కూడా ప్రారంభమైంది. ఏదో అనుమానం వచ్చిన సావిత్రి తిరిగి గదిలో కెళ్ళి కాస్సేపు నిలబడింది. ఇదివరకంతటి వాసన ఇప్పుడా గదిలో లేదు. తన అనుమానం ధృవపడ్డంతో బయటి కొచ్చి- వున్న రెండు తలగడల్లోనూ కొత్తగా వున్న తలగడ తీసి ముక్కు దగ్గర పెట్టుకునే సరికి ఆమెకు మూర్ఛ వచ్చినంత పనైంది. వెంటనే ఆ తలగడను తన బలమంతా ఉపయోగించి రోడ్డు పక్కకి విసిరేసింది.

"నీకేం పిచ్చా! కొత్త తలగడనలా విసిరి పారేశావ్?" అర్చాడు సోమరాజు.

"మనం భరించలేకపోతున్న వాసనంతా దాన్లోంచే వస్తోందండీ!" అంది సావిత్రి.

"ఆఁ!" అంటూ ఒక్క క్షణం ఆశ్చర్యపోయి ఆ తలగడను పట్టుకొచ్చి పై గుడ్డను సర్రున చింపేశాడు సోమరాజు.

దాంట్లోంచి కాస్త దూది- టైలర్స్ దగ్గరుండే వేస్ట్ క్లాత్ పీసెస్‌తో బాటు చచ్చిన ఎలుక పిల్ల కూడా బయట పడింది.

అది చూస్తూనే "ఛ.... ఛ..." అంది అసహ్యించుకుంటూ సావిత్రి.

"ఎందుకూ చఛలూ –చిఛీలు. చౌగ్గా వచ్చిందంటూ ఈ తలగడ కొని ఇంట్లో పెట్టావ్! ఇక ఈ రోజు కూడా ఇది ఇంట్లో వుంటే అందరం వాంతులు చేసుకొని చచ్చి వుండే వాళ్ళం!" అన్నాడు భార్య మీద మండిపడుతూ సోమరాజు.

"ఎంత మోసం.... ఎంత మాయ.... నిన్న ఈ తలగడలు అమ్మకానికి తెచ్చిన ఆడమనిషి తన తలగడలు తలక్రింద పెట్టుకు పడుకుంటే సుందర లోకాలకు తీసుకుపోయి తెల్లవారే వరకూ మెలకువ రాకుండా చేసేస్తాయంటూ ఎంత తీయని కబుర్లు చెప్పిందను కున్నారు..." అంది చెంపకు చెయ్యి చేర్చుకొని సావిత్రి.

"ఆవిడ చెప్పినట్లు తప్పకుండా సుందర లోకాలకే వెళ్ళి వుండేవాళ్ళం!" అన్నాడు ఏడవలేక నవ్వుతూ సోమరాజు.

"అంతేకాదండీ, తలగడల్లో ఉపయోగించిన దంతా శ్రేష్ఠమైన దూదేనని చెప్పింది. దానికి తోడు పైక్లాత్ అందంగా వుండటం... ధర చౌకగా వుండటంతో వెంటనే కొనేశాను...."

"మంచిపని చేశావు!.... మీ ఆడాళ్ళు ఏ వస్తువైనా కాస్త చౌకగా వస్తుంది అంటే ఇక వెనుకా ముందూ చూడరు. జరిగింది చాలుగాని ఇంకెప్పుడూ చౌకబేరాల జోలికి పోకు" అన్నాడు కాస్త కోపంగా సోమరాజు.

"బాగుందండోయ్! ఇంత మోసం చేస్తుందనీ, తలగడలో చచ్చిన ఎలుక పిల్ల వుంటుందనీ నేను కలగన్నానా!... ఔనూ, అసలిది ఎలా జరిగిందంటారు?" అంది సావిత్రి.

"ఎలాగేమిటి- వెధవ సందేహం నువ్వూను. చెత్త- చెదారం పోగు చేసి సొమ్ము చేసుకోవటమే కొందరి మనుష్యుల లక్ష్యం గనుక- ఆ వేస్టు క్లాత్‌లో ఏముందో కూడా చూడకుండా తలగడలు తయారు చేసి వుంటారు.... పాపం, అనవసరంగా ఆ చుక్కమ్మ ననుమానించాను... ఇదిగో, పెంచిన అద్దె బాపతు డబ్బు పట్టుకెళ్ళి ఆవిడ కిచ్చిరా!" అని డబ్బు తీసి సావిత్రి కిచ్చి – సర్వం మాయగా మారిపోతున్న లోకాన్ని తల్చుకుంటూ బయట పడేసిన వస్తువులన్నీ లోపలకు చేరవెయ్యసాగేడు సోమరాజు. □

అల్లంత దూరం నుంచి తన ఇంటివైపు చూసి తృళ్ళిపడ్డాడు సోమరాజు. ఒక్క సారిగా అతడి గుండె కొట్టుకునే వేగం హెచ్చింది. అడుగులు తడబడ్డాయి. ఆందోళన అతడి అణువణువునూ ఆక్రమించుకొంది.. మరో సారి కళ్ళు చించుకొని ఇంటి వైపు చూసి చుక్కమ్మ అన్నంతపనీ చేసినట్లుంది అనుకున్నాడు. ఆవిడలా చేసినా ఆ తప్పు తనదే గాని ఆవిడది కాదని కూడా అనుకున్నాడు.

చుక్కమ్మ ఇంట్లో దాదాపు ఆరు సంవత్సరాల నుంచి అద్దెకుంటున్నాడు సోమరాజు. ఆరు సంవత్సరాలుగా ఎన్నడూ లేనిది ఈ మధ్య అద్దె పెంచమని ఒకటే గొడవ పెడుతోంది చుక్కమ్మ.

అయితే సోమరాజు సామాన్య జీవి. చేస్తున్నది చిన్న ఉద్యోగం ఇళ్ళ అద్దెలు, నిత్యావసర వస్తువుల ధరలు పెరుగుతున్నంత వేగంగా అతడికి జీతం పెరిగే అవకాశం లేదు. కుటుంబం చూస్తే కాస్త పెద్దది. ఆవిడ అద్దె పెంచమన్నప్పుడల్లా "చూద్దాం.... చూద్దాం...... " అంటూ రోజులు నెట్టుకొస్తున్నాడు సోమరాజు.

ఇలా చూద్దాం అంటూనే తన ఇంటి చూరుకు అతుక్కు పోయేలా వున్నాడని- నెల్లాళ్ళ క్రితం ఇల్లు ఖాళీ చేసెయ్యమని సోమరాజుకు సీరియస్‌గా వార్నింగ్ ఇచ్చింది చుక్కమ్మ.

"అంత వరకూ ఎందుకు లెండి. వచ్చే నెల నుంచి పెంచుతాను!" అన్నాడు ఇక తప్పదనుకున్న సోమరాజు.

అలా అన్నాడే గాని మొన్నెళ్ళి పోయిన ఫస్టు తారీక్కు కూడా తను ప్రతినెలా ఇస్తున్న మొత్తమే చుక్కమ్మ చేతిలో పెట్టాడతను.

ఆ డబ్బు లెఖ్ఖ చూసుకున్న వెంటనే అపర కాళికావతారం దాల్చింది చుక్కమ్మ.... "నీకు మాట నిలకడ- మంచీ, మర్యాద లేనట్టుంది. నువ్వేదో చిరుద్యోగి వని జాలిపడి చౌకగా ఇల్లు అద్దెకిస్తే- ఇక వున్నంత కాలం ఆ అద్దెనే నా మొహాన కొట్టేటట్టున్నావు! ఇలాంటి వాటాకే ఆ ఎదురింటి ఎల్లమ్మ, పొరుగింటి పుల్లమ్మ ఎంత తీసుకుంటున్నారో తెలుసా?" అని ఒక్క క్షణం ఆగింది చుక్కమ్మ.

"అది కాదు చుక్కమ్మ గారూ!.. .. " అంటూ ఏదో చెప్ప బోయాడు సోమరాజు.

కానీ, అతని మాటలకు మధ్యలో నే అడ్డొచ్చి, "అది కాదు- ఇది కాదూ ఏమిటయ్యా? ఇంటిపన్ను వగైరాలు పెరిగాయని ఇన్ని సంవత్సరాల తర్వాత ఓ పాతిక రూపాయలు అద్దె పెంచమంటే - పెంచుతానని కూడా దగా చేస్తావా? ఇల్లు చౌగ్గా వచ్చింది ఇదే బావుందనీ, ఆడముండ ఏం చేస్తుందనీ అనుకుంటున్నావేమో.... నువ్వు సాయంత్రం లోగా పెంచిన అద్దె బాపతు డబ్బు ఇవ్వకపోతే నా తడాఖా చూపిస్తాను..... ఏమనుకున్నావో!" అంది, తన కంచు కంఠంతో చుక్కమ్మ.

పక్కనున్న భార్య చెయ్యి గిల్లుతున్నా వూరుకోకుండా "ఏం చేస్తారేమిటి?" అన్నాడు పౌరుషం పొడుచు కొచ్చిన సోమరాజు.

"ఏం చేస్తానా... సామాన్లు రోడ్డు మీదికి విసిరి పారేస్తాను!!..... " అంది, పారేస్తాను అన్న పదం వత్తి పలుకుతూ చుక్కమ్మ.

"ఎలా పారేస్తారో చూద్దాం?..... అసలు నేను అద్దె పెంచను- ఇల్లూ ఖాళీ చెయ్యను!" అనేసి డ్యూటీకి బయల్దేరి పొయ్యాడు సోమరాజు.

వెనుక నుంచి - "వెళ్ళవయ్యా .... నీ చేత ఇల్లు ఎలా ఖాళీ చేయించాలో నాకు తెలుసు.. " అంటున్న చుక్కమ్మ మాటలు గాల్లో తేలివచ్చి అతని చెవుల్ని తాకి కొంత కలవర పెట్టాయి.

పౌరుషం పట్టలేక అలా అన్నాడే గాని అంతమాట చుక్కమ్మ చేత అనిపించుకున్నందుకు అతడికి చాలా బాధనిపించింది..... అద్దె పెంచుదామన్న సదుద్దేశ్యం తనకున్నా జీతం అందుకొని ఎక్కడి వక్కడ సరిపెట్టే సరికి తలప్రాణం కాలికొచ్చింది. ఆ మాటే ఆవిడకు చెబుదామన్నా వినిపించుకునే స్థితిలో లేదు.... నిజానికి తన పాట్లేవో తను పడాలే గాని ఆవిడకలాంటి అవసరం లేదు. డ్యూటీలో వున్నంత సేపూ అదే బాధతో సతమత మవుతూ తను ఇవ్వగలిగే అద్దెలో ఇల్లేదైనా దొరుకుతుందేమోనని సహోద్యోగి సుందరాన్ని అడిగాడు సోమరాజు.

అతను తమ ఏరియాలో ఇళ్ళ అద్దెలు ఎలా మండి పోతున్నాయో చెప్పేసరికి సోమరాజు గుండె గుభేల్‌మంది. అతను అంతటితో వూరుకోక సోమరాజు గొడవేమిటో తెలుసుకొని మాట్లాడ కుండా పాతిక రూపాయలూ పెంచి ఆ ఇంట్లోనే వుండమని సలహా కూడా ఇచ్చాడు.

ఇక తప్పదనుకున్న సోమరాజు ఆ పాతిక రూపాయలు సుందరం దగ్గరే బదులు తీసుకొని, ఆ డబ్బు ఆ రోజు చుక్కమ్మకివ్వడానికి నిశ్చయించుకొని ఇంటి కొస్తున్నాడు.... అయితే ఇంతలో నే ఇలా జరుగుతుందనీ, చుక్కమ్మ అన్నంత పనీ చేసేస్తుందనీ అతడెంత మాత్రం అనుకోలేదు.

వీధి గుమ్మం ముందు మంచాలు, అరుగు మీద- వంట పాత్రలు, బిందెలు వగైరాలన్నీ కనిపిస్తున్నాయి .. వాటికి కాపలా అన్నట్టుగా సోమరాజు ఆఖరి కొడుకు బయట నిలబడి దిక్కులు చూస్తున్నాడు.

చుక్కమ్మ పెంచమన్నదేదో పెంచి - ఎలాగోలా ముందే ఇచ్చి పారేస్తే ఈ గొడవ లేక పోయేదనీ, తన పరువు పోక పోయేదనీ చింతిస్తూ ఇల్లు సమీపించిన సోమరాజు "ఏమైందిరా?" అన్నాడు



పుత్ర రత్నాన్ని చూస్తూ ఆత్రంగా.

"మరేమో..... మరేమో....." అని ఓ మారు ముక్కు చీదుకున్నాడు అసలు విషయమేమిటో చెప్పకుండా వాడు.

"నేనేదో అడుగుతూంటే ముక్కు చీదుకుంటా వేంరా వెధవా!.... ఏం జరిగిందో సరిగ్గా చెప్పేడువ్వు?" అన్నాడు కోపంగా సోమరాజు.

"మరేమో..... లోపల..... " అంటూనే తుంపర్లు సోమరాజు మీద పడేలా తుమ్మేడువాడు.

"వెధవకాన పక్కకి తిరిగి తుమ్ముకోవడం కూడా తెలియదట్రా, అడ్డగాడిదలా వున్నావ్! ఎప్పుడు చూసినా వెధవ జలుబూ నువ్వూను- అమృతాంజనం రాసుకోరా అంటే ముక్కు మండి పోతోంది మొర్రో అంటావ్!!.... ఏమైంది లోపల.... తి చుక్కమ్మ వుందా?" అన్నాడు, అనుమానాస్పదంగా వాణ్ని చూస్తూ సోమరాజు.

"ఏమో, నాకేం తెలవదు. లోపలి కెళ్ళి చూడండి మీకే తెలుస్తుంది!" అనేశాడు చివరికి. ఏదీ సరిగ్గా చెప్పని చెడు అలవాటు వాడికి చిన్నప్పట్నుంచీ వున్నదే.

అసలే చికాగ్గా వున్న సోమరాజుకు ఆ సమాధానంతో ఒళ్ళు మండి – చురుక్కుమనేలా వాడికో లెంపకాయ బహుకరించి లోపలి కడుగు పెట్టాడు.

అతడి సహధర్మ చారిణి సావిత్రి ఓ చేత్తో ముక్కు మూసుకొని- మరో చేత్తో ఇంట్లో ఇంక మిగిలివున్న పెట్టెల్నీ, బుట్టల్నీ అట్నుంచిటూ ఇట్నుంచటూ జరిపి పారేస్తూ దేనికోసమో గాలించేస్తోంది.

"చిందర వందరగా, చిరాగ్గా ఏమిటిదంతా?" అన్నాడు తను భయపడింది కాకపోవటంతో కాస్త స్థిమిత పడ్డ సోమరాజు.

ఆవిడలా ముక్కు మూసుకునే "ఇంకొక్క క్షణం అలాగే వుండండి మీకే తెలుస్తుంది!" అని తిరిగి తన పనిలో లీనమై పొయ్యింది.

"మీ తల్లీ, పిల్లలందరికీ ఒకటే జబ్బులా వుంది అడిగిన దానికెప్పుడూ సవ్యంగా సమాధానం చెప్పి చావరు! చుక్కమ్మ సామాన్లు బయట పారేసిం దేమోనని హడలి పోతూ వచ్చాను నేను అసలేమైంది?" అన్నాడు తీవ్ర స్వరంతో సోమరాజు.

సావిత్రి ఓ మారు ముక్కు మీది నుంచి చెయ్యితీసి, "ఇంకా తెలియలా?..... మీ ముక్కు గాని చెడిపోయిందేమో... " అంటూ మళ్ళీ ముక్కు మూసుకొని తన ప్రయత్నం మొదలెట్టింది.

'నా ముక్కు చెడిపోయిందా!' అనుకుంటూ శ్వాస గబగబా పీల్చిన సోమరాజుకు మరుక్షణం అర్థమైంది అసలు విషయం .... "అబ్బబ్బ..... ఎలుకేదో చచ్చిపోయి వుండాలి. ముక్కు బద్దలు కొట్టే స్తూంది..... " అన్నాడు వెంటనే ముక్కు మూసుకొని సోమరాజు

"ఇంకా అలా నిలబడ్డారేం. . వెతకండి". అంది అరచినంత పనిచేసి సావిత్రి.

భార్య మాటలకు ఉలిక్కిపడ్డ సోమరాజు తను కూడా చచ్చిపోయిన ఎలుక కోసం ఇంట్లో గాలించడం ప్రారంభించాడు.

అలా ఎంతసేపు వెతికినా ఏమీ కనిపించ లేదు. ఆ వాసన ఎక్కణ్నుంచి వస్తూందో వాళ్ళ కంతు బట్టలేదు. అలుపొచ్చిన సావిత్రీ సోమరాజులు ఇంట్లో వుండలేక బయటి కొచ్చేశారు.

"అబ్బ, లోపల నిలబడ లేక పోతున్నా మెలాగ?" అన్నాడు సోమరాజు.

"మీరో పావుగంటకే ప్రాణం పోతున్నట్టు మాట్లాడు తున్నారు. మధ్యాహ్నం నుంచి మేము ఛస్తున్నాం! అదే పోతుందనుకుంటే అంత కంతకూ ఎక్కువై పోయింది. ఎక్కడ్నుంచో ఏమీ అర్థం కావటంలా..... ఇలా ఎంత సేపని వుండగలం?" అంది వికారంగా మొహం పెట్టి సావిత్రి. నిజంగా ఆవిడకి వాంతి వచ్చేటట్టుంది.

"మనింట్లో కాదేమోనోయ్.... చుక్కమ్మగారి ఇంట్లోంచి వస్తోందేమో ఈ వాసన..... ఆ మహాతల్లి ఎలుకల కేమైనా విషాహారం పెట్టిందేమో కనుక్కున్నావా?" అన్నాడు కొన్ని క్షణాల తర్వాత సోమరాజు.

"ఆс.... అదీ అయ్యింది.... అద్దె పెంచలేదని ఉదయం నుంచీ ఆవిడ మనమీద కారాలు మిరియాలు నూరేస్తోంది.... వెళ్ళి అడిగితే "మా ఇంట్లో పిల్లులూ, ఎలుకలూ ఏమీ లేవమ్మోయ్, మందూ, మాకూ పెట్టి చంపడానికి" అని నామీద విరుచుకపడింది!" అంది సావిత్రి.

మందు పెట్టినా, పెట్టక పోయినా చుక్కమ్మ తమ మీది కోపంతో ఏ చచ్చిన ఎలుకనో సంపాదించి తెలియకుండా తమ భాగంలో ఎక్కడో పడేసి వుంటుందన్న అనుమానం వచ్చేసింది సోమ రాజుకు....

అలాంటి అనుమానమేం లేకపోయినా ఏం చెయ్యాలో మాత్రం సావిత్రికి తెలియడం లేదు వుండగా వుండగా ఆవిడకి పిచ్చెత్తి పోతోంది ... ఇంటి చూరు మొదలు ఇంట్లో అక్కడక్కడా వున్న కన్నాలతో సహా గాలించేసినా ఎక్కడా ఏమీ కనపళ్ళేదు. చెంబులు, బిందెలు లాంటి వన్నీ ముందే బయట పడేసింది. నవ్వారు మంచం సందు సందు కళ్ళు చించుకొని చూసింది... మడత మంచాల గుడ్డలూడ బెరికి మరి చూసింది. ఇంకేమున్నాయ్ వెతకడానికి?.... ఆలోచిస్తున్న సావిత్రికి దుప్పట్లు, తలగడలు చూడలేదన్న సంగతి హఠాత్తుగా గుర్తొచ్చింది.

మరుక్షణంలో లోపలి కెళ్ళి వాటిని కూడా తెచ్చి బయట పడేసింది. .. వాటిలోనూ ఏమీ కనిపించ లేదు. అయితే విచిత్రంగా భరించలేని వాసన ఈసారి బయట కూడా ప్రారంభమైంది. ఏదో అనుమానం వచ్చిన సావిత్రి తిరిగి గదిలో కెళ్ళి కాస్సేపు నిలబడింది. ఇదివరకంతటి వాసన ఇప్పుడా గదిలో లేదు. తన అనుమానం ధృవపడ్డంతో బయటి కొచ్చి- వున్న రెండు తలగడల్లోనూ కొత్తగా వున్న తలగడ తీసి ముక్కు దగ్గర పెట్టుకునే సరికి ఆమెకు మూర్ఛ వచ్చినంత పనైంది. వెంటనే ఆ తలగడను తన బలమంతా ఉపయోగించి రోడ్డు పక్కకి విసిరేసింది.

"నీకేం పిచ్చా! కొత్త తలగడనలా విసిరి పారేశావ్?" అర్చాడు సోమరాజు.

"మనం భరించలేకపోతున్న వాసనంతా దాన్లోంచే వస్తోందండీ!" అంది సావిత్రి.

"ఆс!" అంటూ ఒక్క క్షణం ఆశ్చర్యపోయి ఆ తలగడను పట్టుకొచ్చి పై గుడ్డను సర్రున చింపేశారు సోమరాజు.

దాంట్లోంచి కాస్త దూది- టైలర్స్ దగ్గరుండే వేస్ట్ క్లాత్ పీసెస్‌తో బాటు చచ్చిన ఎలుక పిల్ల కూడా బయట పడింది.

అది చూస్తూనే "ఛ.... ఛ..." అంది అసహ్యించుకుంటూ సావిత్రి.

"ఎందుకూ చఛలూ –చిఛీలు. చౌగ్గా వచ్చిందంటూ ఈ తలగడ కొని ఇంట్లో పెట్టావ్! ఇక ఈ రోజు కూడా ఇది ఇంట్లో వుంటే అందరం వాంతులు చేసుకొని చచ్చి వుండే వాళ్ళం!" అన్నాడు భార్య మీద మండిపడుతూ సోమరాజు.

"ఎంత మోసం.... ఎంత మాయ.... నిన్న ఈ తలగడలు అమ్మకానికి తెచ్చిన ఆడమనిషి తన తలగడలు తలక్రింద పెట్టుకు పడుకుంటే సుందర లోకాలకు తీసుకుపోయి తెల్లవారే వరకూ మెలకువ రాకుండా చేసేస్తాయంటూ ఎంత తీయని కబుర్లు చెప్పిందను కున్నారు..." అంది చెంపకు చెయ్యి చేర్చుకొని సావిత్రి.

"ఆవిడ చెప్పినట్లు తప్పకుండా సుందర లోకాలకే వెళ్ళి వుండేవాళ్ళం!" అన్నాడు ఏడవలేక నవ్వుతూ సోమరాజు.

"అంతేకాదండీ, తలగడల్లో ఉపయోగించిన దంతా శ్రేష్ఠమైన దూదేనని చెప్పింది. దానికి తోడు పైక్లాత్ అందంగా వుండటం... ధర చౌకగా వుండటంతో వెంటనే కొనేశాను...."

"మంచిపని చేశావు!.... మీ ఆడాళ్ళు ఏ వస్తువైనా కాస్త చౌకగా వస్తుందీ అంటే ఇక వెనుకా ముందూ చూడరు. జరిగింది చాలుగాని ఇంకెప్పుడూ చౌకబేరాల జోలికి పోకు" అన్నాడు కాస్త కోపంగా సోమరాజు.

"బాగుందండోయ్! ఇంత మోసం చేస్తుందనీ, తలగడలో చచ్చిన ఎలుక పిల్ల వుంటుందనీ నేను కలగన్నానా!... ఔను, అసలిది ఎలా జరిగిం దంటారు?" అంది సావిత్రి.

"ఎలాగేమిటి- వెధవ సందేహం నువ్వూను. చెత్త- చెదారం పోగు చేసి సొమ్ము చేసుకోవటమే కొందరి మనుష్యుల లక్ష్యం గనుక- ఆ వేస్టు క్లాత్‌లో ఏముందో కూడా చూడకుండా తలగడలు తయారు చేసి వుంటారు.... పాపం, అనవసరంగా ఆ చుక్కమ్మ ననుమానించాను.... ఇదిగో, పెంచిన అద్దె బాపతు డబ్బు పట్టుకెళ్ళి ఆవిడ కిచ్చిరా!" అని డబ్బు తీసి సావిత్రి కిచ్చి – సర్వం మాయగా మారిపోతున్న లోకాన్ని తల్చుకుంటూ బయట పడేసిన వస్తువులన్నీ లోపలకు చేరవెయ్యసాగేడు సోమరాజు □




## ముఖచిత్రం

1-7 ఆగష్టు సంచికపై మా అభిమాన నటి బ్యూటీక్వీన్ జయప్రద ముఖచిత్రం మందార మకరంద ముఖారవిందమైన ముద్దు మోముతో ముచ్చటగా ముగ్ధమనోహరంగ మూర్తీభవించి నట్టుగా ఉంది.

కుమారి ఎమ్.ఎస్.ఎస్. త్రివేణి, హైదరాబాద్

## సీరియల్స్

దానవరూప మానవ పిశాచాలైన నాగరాజు వంటి క్రూర జంతువుల వల్ల దారుణ హింసకు గురవుతూ సమాజంలో అట్టడుగున పడి బాధలను భవిస్తున్న యానాదుల వంటి బడుగు వర్గాల బతుకుల్ని యధాతథంగా చిత్రిస్తూ 'సర్పయాగం' సీరియల్ రచించిన వీరపల్లి వీణావాణి గారికి బహుధా అభినందనలు.

★ ★ ★

జయప్రద ముఖచిత్రంతో వెలువడిన మా అభిమాన ఆంధ్రసచిత్ర వారపత్రిక మమ్మల్నెంతో ఆకట్టుకొన్నది.

"సంకెళ్ళెవరికి?", "కరిగిన శిల", "సర్పయాగం", "జీవితం చేజారిందా?" నాలుగు సీరియల్స్ వైవిధ్యమున్న నాలుగు రకాలుగా, ఒకదాని కొకటి పొంతనలేక ప్రత్యేకంగా ఉన్నాయి వీటి ఇతివృత్తాలు. "రచయిత"లకు మా కృతజ్ఞతాంజలి

– కె శివరామిరెడ్డి, కె. సీతామహలక్ష్మి నందివెలుగు

## న్యూఢిల్లీ లేఖ

డా. జయదుబాషి గారి లేఖలు చదువుతుంటే మిస్. మోయోగారి "మదర్ ఇండియా" గుర్తు కొస్తోంది. మనలో, మన దేశంలో ఏ మంచినీ చూడలేకున్నాడాయన గత నాలుగు దశాబ్దాలలో మనము సాధించిందేమి లేదనే ఆయన లేఖలు చాటుతున్నాయి. మనల్ని నిరాశ, నిస్పృహ నిరుత్సాహవాదులుగా చేసేట్టున్నాయి ఆయన లేఖలు. 40 ఏండ్లకు పూర్వం జిల్లాలో రెండు మూడు హైస్కూళ్ళుండేవి. తాలూకా కేంద్రాలలో కూడా విద్యుద్దీకరణ లేదు. ఇట్టి మార్పులు ఎన్నో. ఈనాటి పరిస్థితిని పోల్చి చూసుకుంటే దేశం ఎంత ప్రగతి చెందిందో తెలుస్తుంది. మనలో లోపాలను ఎత్తి చూపడం వేరు. అది వాంఛనీయమే. ఏమి జరగడం లేదంటే దుబాషీగారు కూడా మోయోగారి కండ్లతోనే చూస్తున్నాడన్నమాట.

–ఎస్. వెంకట రమణశర్మ, దేవునికడప

## రిజర్వేషన్లు

1-7 ఆగస్టు సంచికలో హైదరాబాద్ నోట్‌బుక్‌లో రిజర్వేషన్ల గురించి రాసింది అర్థం కాకుండా అయోమయంగా ఉంది. అసలు సమస్య ఏమిటి? ఉన్న రిజర్వేషన్లు హఠాత్తుగా పెంచడం వల్ల "ఫార్‌వర్డ్" క్లాస్ అనేవాళ్ళకి ఉన్న అవకాశాలు కూడా పోతున్నాయి కదా. అట్లా జరగడం లేదని రుజువు చేసే బదులు అసందర్భమైన విషయాలు రాశారు. "తెలివి తేటలు ఒకరి సొత్తు కాదు" అని వారే రాశారు. అలాంటప్పుడు ఆ తెలివి తేటల వల్లనే రిజర్వేషన్లు లేకుండా సీట్లు సంపాదించుకోవచ్చు కదా! "బ్యాక్‌వర్డ్" అనబడే వాళ్ళు అన్ని రంగాలలో "ఫార్‌వర్డ్" అయినా ఇంకా "బాక్‌వర్డ్" అని రిజర్వేషన్ల ద్వారా లాభం పొందటం న్యాయమా? ప్రభుత్వం ఆర్థికంగా సాయం చేయవచ్చు. ట్యూషను ఏర్పాటు చేసి చదివించవచ్చు కాని చదివినా చదవక -పోయినా, తెలివి ఉన్నా లేకపోయినా సీట్లు మాత్రం రిజర్వు అనటం న్యాయమా? రిజర్వేషన్లు గలవారు చేస్తున్న కొన్ని అకృత్యాలని గురించి రాశారు. అయితే ఆ అకృత్యాలు ఇన్నాళ్ళకి చెప్పాల్సిన అవసరం ఏమొచ్చింది? ఇన్నాళ్ళు వాటిని ప్రోత్సహిస్తున్నట్టే గదా! "ప్రమోషన్లలో రిజర్వేషన్లు మేధావి వర్గాన్ని క్షీణింప చేస్తుంది" అన్నారు చదువులో మాత్రం బాగా చదువుకున్న వాళ్ళలో నిరుత్సాహం కలుగ చేయదా! ఇదంతా మన నాయకులు తమ గద్దెల కోసం చేస్తున్న తతంగం అని అందరికి తెలుసు. మనం అంతా ఒక్కటే అని పద్యాలు, పాటలు పాడుతూ ప్రతి విషయం కుల- మత ప్రతిపాదికపైన ఆలోచించటం మనకి బాగా అలవాటైంది. ఇక దేశంలో అల్లర్లు అరాచకం ప్రబలక ఏమవుతుంది!

– కె రామారావు, హైదరాబాద్

తే 1-8-86ది ఆంధ్రసచిత్ర వారపత్రిక హైదరాబాద్ నోటుబుక్"లో ముఖ్యమంత్రి రిజర్వేషన్ల" శాతం పెంపుదల నిర్ణయం మీద తమ హర్షాన్ని తెలియబరుస్తూ శ్రీ తిరుమల రామ చంద్రగారు సుదీర్ఘ వ్యాసం వ్రాశారు. "44 శాతానికి పెంచిన యీ రిజర్వేషన్ల నియామకం- వికలాంగులు, మాజీ సైనికుల సంతానంతో, 67 శాతానికి పెరిగింది" అంటూ వ్రాకుచ్చారు. గాని, యీ రిజర్వేషన్ల నియామకం "అవక- తవక"లతో అసందర్భ రీతుల్లో అమలు చేస్తుండడం వల్ల, మొత్తం భారత దేశం అన్ని రంగాలలో దిగజారి పోతుండడం— ఎవరూ గమనించక పోవడం విచారకరం!

దేశవ్యాప్తంగా- బి.టి.సి. (బేసిక్ ట్రైనింగ్ సెంటర్)లు పెట్టమనండి వాళ్ళు ఆయారంగాలలో ఉత్తీర్ణులయ్యేక "ఉద్యోగాలు, ప్రమోషన్లు" ఇవ్వమనండి! చదివించండి! నేర్పించండి! యీ రిజర్వేషన్ల మాయాజాలాన్ని ఛిన్నాభిన్నం చేసి "ధనిక- బీద" వర్గాలను దృష్టిలో పెట్టుకోండి! దేశాభివృద్ధిని, పురోగతిని కాంక్షించండి! అర్థంలేని ఆచరణా కార్య క్రమాలతో అపహాస్యం పాలుకాకండి! దేశాధి నేతలారా! ఆలోచించండి!

– పి.వి.రావు, ఒరవూర్ □

# హైదరాబాదు నోట్‌బుక్

## శ్రీ జత్తి పిలుపు:-

శ్రీ మండలి వెంకటకృష్ణారావు షష్టి పూర్త్యుత్సవం సందర్భంగా ఆగస్టు 9వ తేదీన గాంధీభవన్‌లో జరిగిన సభకు అధ్యక్షత వహించిన మాజీ ఉపరాష్ట్రపతి శ్రీ బసప్ప దాసప్ప జత్తి దేశ యువకులకు చేసిన హిత బోధ ఎంతో సమంజసంగా వుంది. నేడు జాతీయ సమగ్రత అత్యవసరం. దేశంలో పెక్కు చోట్ల విచ్ఛిన్నకర శక్తులు విజృంభించి దేశాన్ని విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నిస్తున్నాయి. అలాటి విచ్ఛేదం జరుగకుండా, దేశ సమగ్రతకు జీవితం అంకితం చేయవలసిన బాధ్యత నేటి యువకుల పైన, మేధావులపైన వున్నది- అని శ్రీ జత్తి ఉద్బోధించారు. శ్రీ జత్తి దృఢ గంభీర కంఠంతో ఇంకా ఇలా అన్నారు:- "దేశంలో నేడు విస్తరించిన విచ్ఛిన్నకర ధోరణులను తీవ్రంగా అణచి వేయాలి. దానికి అందరూ ఉద్యమించాలి. ప్రాంతీయాభిమానం మంచిదే. కాని, అది దురభిమానంగా పరిణమించి, విభేదాలను, జాతి విద్వేషాలను సృష్టించ రాదు. ఇది చాల ఘోరమైన విషయం. అలాటి విభేదాలకు, విద్వేషాలకు అవకాశం లేకుండా, జాతి సమైక్యం పెంపొందడానికి, అందరూ కృషి చేయాలి. ఈ పనికి మేధావులు ముందుకు రావాలి. వారు కుల మత రహిత సమాజాన్ని నెలకొల్పడానికి నడుం కట్టాలి. మేధావులు జనానికి దేశ పరిస్థితులు మొదలయిన వాటిని వివరించాలి. ఎంతో పరిశ్రమతో సాధించిన జాతి సమైక్యాన్ని పరిరక్షించు కోవలసిన అవసరాన్ని నొక్కి చెప్పాలి. మరొక సంగతి. అన్ని సమస్యలకు మూలం దారిద్ర్యం. దేశం ప్రగతి పథంలో నడవాలంటే, దారిద్ర్యాన్ని పారదోలాలి. దళితులను పైకి తెచ్చినప్పుడే, దేశంలో అందరికి సామాజిక, ఆర్థిక సమానత్వం లభిస్తుంది. అలాటి సేవాతత్పరతను, సమానత్వ దృష్టిని యువకులు అలవరుచుకోవాలి; మేధావులయిన పెద్దలు యువకులకు అలాటి భావాలు కలిగించడానికి తగిన శిక్షణ ఇవ్వాలి." తర్వాత శ్రీ జత్తి శ్రీ మండలి సేవా పరాయణతను వివరిస్తూ, దివిసీమలో ఉప్పెనకు గురైన ప్రజలకు శ్రీ మండలి చేసిన అపార సేవను పేర్కొంటూ, సేవా పరాయణులుగా శ్రీ మండలి పేరు పొందారని, ఇటీవలి కాలంలో తెలుగు సంస్కృతిని ప్రపంచం నలుమూలలా చాటి చెప్పిన వారు శ్రీ మండలి అని ప్రశంసించారు. యువకులు శ్రీ మండలి సేవా తత్పరతను, ఓర్పును, దీక్షను అలవరచుకోవాలని శ్రీ జత్తి సూచించారు. మాజీ రాష్ట్ర ముఖ్యమంత్రి, మాజీ కేంద్ర మంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి శ్రీ మండలిని అభినందిస్తూ, ఆయన రాజకీయ జీవితాన్ని, సేవాభావాన్ని ప్రశంసించారు. ఒరిస్సా మాజీ గవర్నర్ మీర్ అక్బర్ అలీఖాన్ శ్రీ మండలి కృష్ణారావు షష్ట్యబ్ద పూర్తి సంచికను ఆవిష్కరించారు. మహాకవి డాక్టర్ దాశరథి పరిచయ వాక్యాలు పలికారు. ఈ సంచికలో ప్రముఖుల వ్యాసాలు, అభినందన కవితలు ఉన్నాయి. శ్రీ మండలి అవనిగడ్డలో నిర్వహిస్తున్న కొన్ని సేవాశ్రమాల నిర్వహణ కోసం కొందరు ప్రముఖులు విరాళంగా ఇచ్చిన లక్ష రూపాయల చెక్కును శ్రీ జత్తి శ్రీ మండలికి అంద జేశారు. డాక్టర్ సుంకు బలరాం శ్రీ మండలికి ఒక బంగారు గొలుసున్న గడియారాన్ని బహూకరించారు. దానిని శ్రీ మండలి అవనిగడ్డ గాంధీ సేవాశ్రమ నిర్వహణ నిధికోసం సభలోనే వేలం వేశారు. శ్రీ విజయ శిఖామణి ఆ గడియారాన్ని రెండువేల అయిదువందల రూపాయలకు పాట పాడి కొన్నారు. ఈ సందర్భంలో కవి సమ్మేళనం జరిగింది. డాక్టర్ దాశరథి, డాక్టర్ దివాకర్ల వెంకటావధాని, డాక్టర్ బోయి భీమన్న, డాక్టర్ అరిపిరాల విశ్వం, డాక్టర్ నాయని కృష్ణకుమారి, డాక్టర్ యశోదారెడ్డి, శ్రీ విశ్వనాథ శ్రీ కృష్ణదేవరాయలు, శ్రీ విజయ శిఖామణి మున్నగువారు పాల్గొన్నారు. కవులు శ్రీ మండలిని పొగడక, తమ ఇష్టం వచ్చిన కవితా ఖండికను గానం చేయడం ఈ కవి గోష్ఠి విశిష్టత. శ్రీ మండలి దంపతులు ఈ సందర్భంలో 60 మంది కవి పండిత గాయక శిల్పి చిత్రకారులను, స్వాతంత్ర్య యోధులను సన్మానించారు. సన్మానితులైన కవి పండితులలో పైన పేర్కొన్న కవి గోష్ఠిలో వారు, కళాకారులలో శ్రీ పి. టి. రెడ్డి, శ్రీ నూకల చిన సత్యనారాయణ, శ్రీ ఎల్లా వేంకటేశ్వర రావు మున్నగు వారు, స్వాతంత్ర్యయోధులలో శ్రీయుతులు బ్రహ్మానందరెడ్డి, పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, దేవులపల్లి రామానుజరావు, డాక్టర్ పి. తిరుమలరావు మున్నగు వారున్నారు.

## ఉపశ్రుతి:-

ఒక సభ ప్రారంభం కానున్నది. ఇంతలో ప్రఖ్యాత కవి శ్రీ కాళోజీ నారాయణరావు వచ్చారు. అయ్యా, మీకూ ఈ సమావేశంలో సన్మానం ఉంది- అన్నారు సభా నిర్వాహకులు. అదేమిటి? నాకు ముందుగా చెప్పలేదు, చేయలేదు. ఏదో, అభినందిద్దామని వచ్చాను. నేను ఒప్పుకోను- అని తమ సహజావేశ ధోరణిలో అన్నారు కాళోజీ. స్వామి, పనస పండు దొరికినప్పుడే తద్దినం పెట్టమన్నారు పెద్దలు- అన్నారు సహజ హాస్య చతురులైన రాంభట్ల కృష్ణమూర్తి.

– తిరుమల రామచంద్ర

ఆగస్టు 9న హైదరాబాద్ గాంధీభవన్‌లో జరిగిన శ్రీ మండలి కృష్ణారావు షష్టి పూర్తి సభలో ప్రసంగిస్తున్న భారత మాజీ ఉపరాష్ట్రపతి శ్రీ బి. డి. జెత్తి. శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి, మండలి దంపతులు, ఆహ్వాన సంఘాధ్యక్షులు డా. సుంకు బలరాం, డా. బి. కృష్ణంరాజులను చిత్రంలో చూడవచ్చు.




*Printed and Published for Nageswara Rao Estates Private Ltd.,*
*by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3,*
*Editor: S. Radhakrishna; Phones :- Business : 61247, 61248, Editorial: 75667*